ఓమ్

పరబ్రహ్మణే నమః.

శ్రీ సుబ్రహ్మణ్యపండితప్రోక్తమగు

# అభినవషడశీతి.

ఆశౌచధర్మశాస్త్రము

ఇది

చెల్లా నాగలింగశాస్త్రులవారి పుత్త్రుఁడగు

## లక్ష్మీనృసింహశాస్త్రిచే

ఆంధ్రతాత్పర్యసహితముగా వ్రాయఁబడి

బ్రహ్మశ్రీ సోమయాజుల పురుషోత్తశాస్త్రిగారిచేఁ

బరిశోధింపఁబడి

స్వకీయ శ్రీ

ఆర్యానందముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె

ప్రథమముద్రణము 500 ప్రతులు

రిజిష్టర్డు కాపీరైట్

గ్రంథమూల్యం 1—0—0

1936

# విషయసూచిక.



వరుస నెంబరు. ఫుట.

విషయానుక్రమణిక సంపూర్ణము.

# అభినవషడశీతి గ్రంథావతరణిక.



చంద్రిక మాధవీయము మొదలగు నిబంధములయందు ఆయా మునులచేఁ జెప్పఁబడిన స్మృతులయందలి వచనముల నుదహరించుచు నా వచనములకన్నిటికైకమత్యము నుపపాదించుచు సర్వధర్మములు బాగుగ నిర్ణయింపబడినవి. వానియందాశౌచమును బాగుగనే నిరూపింపబడినది, ఐనను ఆనిబంధములయందు ప్రత్యేకము విషయమంతయు చెప్పబడకుండుటచేతను, ఆయా విషయములయందు విస్తారములగు చర్చలచే గ్రంథవిస్తరమగుటవలనను, మందబుద్ధిగలవారలకు యథార్థ విషయముయొక్క నిర్ణయము తెలియబడదని, వారికట్టి నిర్ణయము తేటతెల్లమగుటకై, కౌశికాదిత్యునిచేత సారభూతములగు యంశముల గ్రహించి షడశీతియను సంక్షేపగ్రంథము రచింపబడి సర్వజనులచే నాదరింపబడుచు కన్పట్టుచున్నదికదా ఇకనీయభినవషడశీతి నారంభింప నేలనన, ప్రాచీనషడశీతియందు సులభముగా తెలియబడుటకై ఆయా నిబంధములనుండి సారాంశము మాత్రము గ్రహించి, జాతము, మొదలగు ఆశౌచములయొక్క భేదములు మాత్రము నిరూపింపబడినవి, అంతియకాని విషయమంతయు చెప్పబడలేదు. అదియెట్లన స్రావము నందు తండ్రికి స్నానము చెప్పబడిలేదు, నాల్గవమాసమున స్రావమైనచో జ్ఞాతులకు స్నానము చెప్పబడలేదు, ఆనాల్గవమాసమునందే కొంచము కఠినమగు స్రావమైనచో తండ్రికి త్రిరాత్రాశౌచము చెప్పబడలేదు, పాతమునందును మృతప్రసవమునందును జాతాశౌచము మాత్రము చెప్పబడియె, స్నానమాత్రమున నివర్తించు శావాశౌచము జెప్పబడదు జననదశాహమధ్యమున శిశువు మృతినొందినచో తలిదండ్రులకు సోదరులకును దశాహశేషపర్యంతము శావాశౌచము చెప్పబడలేదు పదిరోజులు గడచిన పిమ్మట చౌలములోగా శిశువు మృతినొందినచో ఖననము, దహనము, త్యాగము, వీటినను సరించి జ్ఞాతులకు కల్గెడి యాశౌచ తారతమ్యము జెప్పబడలేదు సమానోదకులకు జననమరణములయందు

త్రిరాత్రాశౌచము చెప్పబడలేదు, వారికే ఉపనీతుడు, అనుపనీతుడు, వీరిమృతియందు ఆశౌచముకలిగియుండుట లేకుండుటలు చెప్పబడలేదు పుత్రికమృతినొందినచో తలిదండ్రులకు తలిదండ్రులు మృతినొందినచో పుత్రికకు సోదరి మృతినొందినచో సోదరునకు సోదరుడు మృతినొందినచో సోదరికి అతిక్రాన్తాశౌచముయొక్క వైషమ్యము చెప్పబడలేదు, భార్యాభర్తలకు పరస్పర మతిక్రాన్తాశౌచమును, సవతితల్లి చనిపోయినచో నామెకు పుత్రులు గలిగియుండుట లేకుండుట సంవత్సరమునకు పూర్వము వినుట, పరమువినుట, ఇట్టికారణములబట్టి గల్గెడి యతిక్రాన్తాశౌచవైషమ్యను పునర్దహనమునందు అస్థులదహించుట పర్ణమును దహించుటలనుబట్టి జ్ఞాతులకు గల్గెడి యాశౌచవైషమ్యమును అనుపనీతుని మృతియందతిక్రాన్తాశౌచము లేకపోవుటయు దౌహిత్రుడు మేనల్లుడు వీరు ఉపనీతులగుట అనుపనీతులగుట ఇట్టికారణములబట్టి గల్గెడి యాశౌచభేదమును సవర్ణమైనట్టియు అసవర్ణమైనట్టియు శవముతోఁగూడనడచుట మోయుట అందును స్నేహము అర్థలోభము మొదలగువానిచే మోయుట వీటినిబట్టి గల్గెడి యాశౌచముయొక్క తారతమ్యమును చెప్పబడలేదు సుకృతమునుగోరి శవమును వహించినచో నాశౌచము లేదనియు సవర్ణులైనట్టియు అసవర్ణులైనట్టియు ఆతురుల నూరడించుటలనుబట్టియు అందును సంచయనమునకు పూర్వము పరము అగుటలనుబట్టి గలిగెడి యాశౌచ వైషమ్యమును చెప్పబడలేదు ఆశౌచ నియమములయందధశ్శయనము బ్రహ్మచర్యము మొదలగునవియు అగ్నిహోత్రౌపాసనలకు కర్తృభేదముచే నాచరింపదగుటయు సంధ్యావందనమునందలి ప్రాణాయామమమంత్రకముగా జేయదగుటయు చెప్పబడలేదు ఇట్లె మరికొన్ని యావశ్యకములగు విషయములా ప్రాచీనషడశీతియందు జెప్పబడలేదు ఇదియుగాక అచ్చటచ్చట స్మృతివిరుద్ధములగు విషయములు చెప్పబడియె అదియెట్లన శావాశౌచమును మూడుభాగములు జేయనందు మొదటిభాగమునక్క మిగిలిన రెండు మూడు భాగములయందాశౌచముగల వారికస్పృశ్యత లేదని జెప్పబడియె అది కలియుగమునందు నిషిద్ధము మరియు కదష్యాదు

(లుబ్ధుడు) వ్యాధితుడు మొదలగువారికి మరణాన్తమాశౌచము చెప్పబడియె మాధవీయాదులయందు మరణాన్తాశౌచమును జెప్పెడి వచనములు నిందార్థవాదములని వ్యవస్థజేయబడినది గాన నదివిచారింపక జెప్పబడినదగు ఈ ఘట్టమునందుగల వ్యాధితస్యకదర్యస్య అను నిది మొదలగు వచనములకు జనన మరణాదులయందు వ్యాధితుడు మొదలగువారికి మరణాన్తమాశౌచము కలదను నర్థముకానేరదు ఇకనేమన ఆవ్యాధితుడు మొదలగువారు మృతినొందినచో వారి బంధువులకు దుర్మరణాదికమునందువలె తత్కాలమునందే శుద్ధియనియు ఆసందర్భమునగల 'భస్మాన్తం' అను పదము మృతులగు వ్యాధితాదుల శవము దహింపబడువరకే తద్బంధువుల కాశౌచమనునర్థమును బోధించుచున్నదనుమతము మిక్కిలి యసమంజసము వ్యాధితాదుల మరణమునందు సద్యశ్శౌచము స్మృతులయందెచ్చటను కనబడదు అట్లుకానిచో దుర్మరణము నొందినవారికివలె వ్యాధితకదర్యాదులకును శూద్రునివలెనమంత్రికముగా దహించుట సంవత్సరమువరకు ప్రతీక్షించుట మొదలగునవి యనివార్యములగుటయను నాపత్తిసంభవించు కాన నా వచనములు నిందార్థవాదములే యనదగును ఇట్టి శాస్త్రవిరుద్ధ విషయములచ్చటచ్చట కన్పట్టుకొన ప్రాచీన షడశీతియందు చెప్పబడని విషయముల సంగ్రహించుటకొరకును అపసిద్ధాన్తముల త్రోసివైచుటకును నీయభినవషడశీతి ప్రారంభింపబడియె ఇందాశౌచముమాత్రము విమర్శింపబడియె ఆయాశౌచమునందు జేయదగిన తిలోదకాదికము ధర్మచింతామణియందుకననగు ప్రారంభింపబడిన గ్రంథము నిర్విఘ్నముగా పరిసమాప్తినొందుటకును ఆగ్రంథము ప్రసిద్ధివహించుటకును ఆచరింపబడిన మంగళమును శిష్యశిక్షార్థము గ్రంథమున గూర్చుచు బుద్ధిమంతులు ప్రవర్తించుటకై గ్రంథమున జెప్పబోవు విషయమును జెప్పుచున్నాడు



ఓమ్ పరబ్రహ్మణేనమః.

# అభినవషడశీతి.

## ధర్మశాస్త్రము, శ్లోకతాత్పర్యసహితము.



### ఇష్టదేవతా ప్రార్థనము.

శ్లో॥ గణనాథంనమస్కృత్య గురూనపిమహాత్మనః।
సుబ్రహ్మణ్యోవితనుతే సుధీరాశౌచనిర్ణయం ॥

తా॥ విఘ్నేశ్వరునిగూర్చియు, మహాత్ముల గురువులగూర్చియు నమస్కరించి సుబ్రహ్మణ్యపండితుడాశౌచ నిర్ణయమను గ్రంథమును జెప్పుచున్నాడు అనగా నీగ్రంథమున జెప్పబడు విషయమాశౌచకలాపము దానిని దెలసికొనుట యవాన్తరప్రయోజనము అందుమూలమున అర్థావాప్తియు (అనగా నాయాబంధువులు మృతినొందినప్పుడు తన్నిమిత్తమున దనకుగల్గెడి యాశౌచము తత్కాలపరిమాణము బాగుగా దెలసినచో నాదినములయందు ప్రేతనుద్దేశించి దానివ్వదగు తిలోదకాదుల నిచ్చుటవలన నైహికాముష్మిక లాభము) అనర్థ నివృత్తియు (అనగా నాశౌచదినములయందు నిషిద్ధములగు స్త్రీసంగమము, తాంబూలము, పరాన్నభోజనము, ప్రతిగ్రహము, మొదలగువానినివర్జించుటచే ప్రత్యవాయనివృత్తియు) ముఖ్యప్రయోజనము ముందుగా నాశౌచస్వరూపము దెలియబడనిచో తద్విమర్శమునందు మనసుజొరదనియాయాశౌచలక్షణమును జెప్పుచున్నాడు.

### ఆశౌచస్వరూప నిరూపణము.

౨ శ్లో॥ కర్మస్వనధికారత్వ మస్పృశ్యత్వంచదేహినా।
యతఃపాపాత్ప్రభవతి తదాశౌచమితీర్యతే॥

తా॥ మనుష్యులకధ్యయనాది కర్మలయందధికారము లేకపోవుటయు, స్పృశింపదగకుండుటయు, నేపాపమువలన గలుగుచున్నవో నాపాపమాశౌచమనంబడు, ఆయాశౌచము జననమరణాదులచేబుట్టి కాలయాపనము, స్నానము, మొదలగువానిచే నివర్తించు ఇది ముందు విశదముగాగలదు ఆశౌచమును విభజించుచున్నాడు.

శ్లో॥ జాతకంమృతకంచేతి ద్విధాశౌచముదీరితం ।

తా॥ జాతము, మృతము అని సామాన్యముగా నాశౌచము రెండువిధములు దీనికేవిశేషవిభాగమును జేయుచున్నాడు.

—* ఆశౌచవిశేషనిరూపణము *—

శ్లో॥ అల్పాధికవిభేదేన పూర్ణాపూర్ణ విభేదతః ।
పునశ్చతుర్విధంప్రోక్త మేకైకంమునిసత్తమైః॥

తా॥ జాతము, మృతము, ప్రత్యేకము (ఒక్కొకటి) అల్పము అధికము పూర్ణము, అపూర్ణము, అని నాలుగు విధములగునని మహర్షులచేఁ జెప్పఁబడియె జాతమాత్రమును విభజించుచున్నాడు.

శ్లో॥ స్రావఃపాతఃప్రసూతిశ్చ త్రివిధంజాతకంమతం ॥

తా॥ స్రావనిమిత్తకము, పాతనిమిత్తకము, ప్రసూతినిమిత్తకము అని జాతము మూఁడు రకములగు జాతాశౌచ మృతాశౌచముల స్వరూపము విస్పష్టమగుటచే నుపేక్షించి అల్పాద్యాశౌచములయొక్క లక్షణమును చెప్పుచున్నాడు,

శ్లో॥ అల్పాధికేసమాఖ్యాతే తత్రాల్పాధికకాలకే॥

తా॥ స్వల్పకాలమున నివర్తించునది యల్పాశౌచము అధిక కాలముచే నివర్తించునది యధికాశౌచము ఇఁక పూర్ణాపూర్ణాశౌచముల స్వరూపమును జెప్పుచున్నాడు.

శ్లో॥ దశాహద్వాదశాహార్ధ మాసమాసానువర్తియత్ ।
తద్వర్ణానాంక్రమాత్పూర్ణ మపూర్ణమితరత్పునః ॥

తా॥ బ్రాహ్మణులకు పదిదినములు క్షత్రియులకు పదిరెండు దినములు వైశ్యునకు పదునేనుదినములు శూద్రునకు మాసమును అనువర్తించునది పూర్ణాశౌచమనఁబడు అట్లుకానిది యపూర్ణాశౌచమనఁబడును.

శ్లో॥ శుద్ధ్యేద్విప్రోదశాహేన ద్వాదశాహేనభూమిపః।
వైశ్యఃపంచదశాహేన శూద్రోమాసేనశుద్ధ్యతి ॥

తా॥ పూర్ణాశౌచము ప్రాప్తించినపుడు బ్రాహ్మణులకు పది దినములచేతను, క్షత్రియులు పదిరెండుదినములచేతను వైశ్యులు పదునైదుదినములచేతను శూద్రులు మాసముచేతను శుద్ధుడగునని దక్షుడు చెప్పెను.

శ్లో॥ దశాహంబ్రాహ్మణస్తిష్ఠే ద్దానహోమాదివర్జితః।
క్షత్రియోద్వాదశాహంతు వైశ్యోమాసార్ధమేవచ ॥
శూద్రస్తుమాసమాసీత నిజకర్మవివర్జితః ॥

తా॥ పూర్ణాశౌచము ప్రాప్తించినపుడు బ్రాహ్మణుడు పది దినములు దానము హోమము మొదలగు కర్మల వదలియుండదగు ఇటులనే క్షత్రియుడు పదిరెండుదినములు వైశ్యుడుపదునైదుదినములు శూద్రుడు మాసమును తమతమకర్మల వదలియుండదగునని మార్కండేయుడుచెప్పెను.

సూ॥ బ్రాహ్మణస్య సపిండానాం జననమరణయోర్దశాహమాశౌచం ద్వాదశాహం రాజన్యస్య పంచదశాహం వైశ్యస్యమాసం శూద్రస్య॥

తా॥ సపిండుల జననమరణములయందు బ్రాహ్మణునకు పది దినములు క్షత్రియునకు పండ్రెండుదినములు వైశ్యునకు పదునేనుదినములు శూద్రునకు మాసమును ఆశౌచము అని విష్ణువు చెప్పెను శూద్రులకు జెప్పబడినరీతి వర్ణసంకరులకు నాశౌచము,

శ్లో॥ శావాశౌచంప్రకుర్వంతి శూద్రవద్వర్ణసంకరాః ॥

తా॥ వర్ణసంకరులు శూద్రులవలె నాశౌచము నవలింబింపదగునని బ్రహ్మపురాణమునజెప్పఁబడె.

శ్లో॥ సర్వేషామనులోమానా మాశౌచంమాతృవద్భవేత్ ।
పైతృకంప్రతిలోమానా మాశౌచంసద్భిరిష్యతే॥

తా॥ అనులోములకు అనఁగా నెక్కువజాతి పురుషునివలన తక్కువజాతి స్త్రీయందు జనించిన సంకరులకు అందరకు తల్లికులము

నకుఁ జెప్పఁబడిన యాశౌచము వర్తింపదగు ప్రతిలోములకు అనఁగా తక్కువజాతి పురుషునివలన నెక్కువజాతి స్త్రీయందు జనించిన సంకరులకు తండ్రికులమునకు జెప్పఁబడిన యాశౌచము వర్తింపదగునని సత్పురుషులచే జెప్పబడియెనని యాపస్తంబుడు విశేషించిపల్కె కాన వెనుకటి బ్రాహ్మపురాణవచనము వైశ్యునివలన శూద్రస్త్రీయందు జనించిన సంకరులకుమాత్రము వర్తింపదగును.

శ్లో॥ శూద్రజ ప్రతిలోమానా మాశౌచంనాస్తికించన ।

తా॥ శూద్రుని వీర్యమువలన జనించిన ప్రతిలోముల కేమాత్రి మాశౌచములేదు అని హారీతుడుపలికెను

శ్లో॥ మాసంశూద్రస్య శేషాణాం సదాశౌచమితిస్మృతిః ।
తథాపిమరణేతేషాం స్నానమాత్రంవిధీయతే॥

తా॥ శూద్రునకు మాసమాశౌచము తక్కిన వర్ణసంకరులకే మాత్రమాశౌచములేదు కాని మరణమునందు వారికి స్నానము మాత్రము విధింపబడియెనని జాబాలివచనము బ్రాహ్మణాదులకు దశరాత్రాదులకంటె నధికమగు నాశౌచము స్మృతులయందెచ్చటను చెప్పఁబడలేదు కాన నదియే పూర్ణాశౌచమననగు "వ్యాధితస్య కదర్యస్య" అను నిదిమొదలగు మరణాన్తాశౌచమును ప్రతిపాదించువచనములు నిందార్థవాదములని మాధవీయాదులయందు నిర్ణయింపఁబడియె ఇక స్రావాదులలక్షణములను జెప్పుచున్నాడు.

శ్లో॥ గర్భస్యనిర్గమస్స్రావ ఆద్యేమాసచతుష్టయే।
తతోమాసద్వయేపాతః ప్రసూతిస్స్యాత్తతఃపరం॥

తా॥ గర్భాదానమైనదిమొదలు నాల్గుమాసములలో గర్భము వెలువడినచో స్రావమనఁబడు, ఐదాఱుమాసములయందు పాతమనఁబడు, పిమ్మట ప్రసూతియనఁబడు,

శ్లో॥ ఆచతుర్థాద్భవేత్స్రావః పాతఃపంచమషష్ఠయోః।
అతఊర్ధ్వంప్రసూతిస్స్యాద్దశాహంసూతకీభవేత్ ॥

తా॥ నాల్గవమాసముష అశుస్రావము ఐదారుమాసములయందు పాతము ఏడవమాసము మొదలు ప్రసూతియనఁబడు ఇట్టి ప్రసూతి యందు సపిండులకుపదిదినములు జాతాశౌచము అనిపరాశరుఁడుపలికె.

శ్లో॥ మాసత్రయేచతుర్థేచ గర్భస్యస్రావఇష్యతే।
పాతస్స్యాత్ పంచమేషష్ఠే ప్రసూతిస్సప్తమాదిషు ॥

తా॥ మొదటిమూఁడుమాసములయందును నాల్గవమాసమునందును స్రావమనబడు ఐదారుమాసములయందు పాతము. ఏడు మొదలగు మాసములయందు ప్రసూతియనబడునని స్మృతిసంగ్రహమున జెప్పబడె.

## — స్రావాశౌచము —

శ్లో॥ స్రావేమాతుస్త్రిరాత్రంస్యాన్మాసేషుత్రిషుసూతకం।
చతుర్థేతు చతూరాత్రం పితాస్నానేన శుద్ధ్యతి ॥
చతుర్థఈషత్కఠినస్రావేత్రిదివసంపితుః।
మృదుస్రావేతుసర్వేషాం చతుర్థేస్నానమాత్రకం ॥

తా॥ మొదటిమూఁడుమాసములయందు గర్భముస్రవించినచో తల్లికి త్రిరాత్రము జాతాశౌచము, నాల్గవమాసమైనచో నాల్గుదినములు, తండ్రి యీ నాల్గుమాసములను స్నానమాత్రమున శుద్ధుడగు నాల్గవమాసమున కొంచము కఠినస్రావమైనచో తండ్రికి త్రిరాత్రాశౌచము, మృదుస్రావమైనచో జ్ఞాతులందరకు స్నానముమాత్రము చెప్పబడె చతుర్థమాసస్రావమున జ్ఞాతులకు స్నానచెప్పబడుటచే మొదటి మూఁడుమాసములయందు స్నానమవసరము లేదు.

శ్లో॥ త్రిషుమాసేషుగర్భస్య స్రావేమాతుస్త్రిరాత్రకం ॥

తా॥ మొదటి మూఁడుమాసములయందు గర్భముస్రవించినచో తల్లికి త్రిరాత్రాశౌచము అని హారీతుడుపల్కె.

మరీచిః॥ శ్లో॥ స్రావేమాతుస్త్రిరాత్రంస్యాత్సపిండాశౌచవర్జనం।
పాతేమాతుర్యథామాసం పిత్రాదీనాందినత్రయం ॥

తా॥ స్రావమున తల్లికి త్రిరాత్రాశౌచము సపిండులకాశౌచము లేదు పాతమునందు తల్లికి మాసములసంఖ్యతో సరియగు సంఖ్యగల దినములాశౌచము జ్ఞాతులకు మూడుదినములు ఆశౌచమని మరీచి పలికె.

శ్లో॥ స్రావేచైవపితుస్స్నానం సపిండానాంనవిద్యతే ।
రజోదర్శనేత్రిదినం పతనేమాససంఖ్యయా ॥

తా॥ స్రావమున తండ్రికి స్నానముమాత్రము జ్ఞాతులకదియును లేదు. తల్లికి రజోదర్శనమైనపుడువలె త్రిరాత్రము. (ఇదంతయు త్రిమాసస్రావవిషయము) పతనమున మాసములకు సరియగు సంఖ్యగల దినములు తల్లికాశౌచము అనియముడు జెప్పె. ఈ సందర్భమునందుత టను తండ్రికి జెప్పబడిన యాశౌచము సోదరులకుగూడ వర్తించును. ఎచ్చట తండ్రిపేర్కొనబడునో అచట సోదరులుగూడ గ్రహింపదగునని చంద్రికయందు జెప్పబడె "గర్భస్రావేమాసతుల్యారాత్రియస్త్రీణాంస్నానమాత్రమేవపురుషస్య" గర్భము స్రవించినచో మాసములకు సరిసంఖ్యగల రాత్రులు తల్లికాశౌచము, తండ్రికి స్నానముమాత్రము, అని పైంగగృహ్యమున జెప్పబడె.

శ్లో॥ షణ్మాసాభ్యన్తరేయావ ద్గర్భస్రావోభవేద్యది ।
తదామాససమైస్తాసాం దివసైశ్శుద్ధిరిష్యతే ॥

తా॥ ఆఱవమాసములోగా గర్భము వెలువడినచో మాసములకు సరియగు సంఖ్యగల దినములతో తల్లికి శుద్ధిచెప్పబడె ఆదిత్యపురాణంబున మూడవ మాసమునుండి ఈ మాససంఖ్యావిధానము మూడవ మాసమునకు లోగడకూడ వర్తించునని చెప్పినచో వెనుక నుదహరింపబడిన హారీతునివచనమునకువిరుద్ధమగును.

శ్లో॥ సద్యశ్శౌచంసపిండానాం గర్భస్యపతనేసతి ।

తా॥ గర్భము పతనమైనపుడు సపిండులకు తత్కాలమునేశుద్ధి. అను బ్రహ్మపురాణవచనము నాల్గవమాసమున మృదుస్రావమగు సంద

ర్భమునమాత్రము వర్తింపదగునని చంద్రికయందు చెప్పబడె. విజ్ఞానేశ్వరుడీ బ్రహ్మపురాణమునందలి వచనమును లిఖించి ఈవచనముద్రవరూపమగు గర్భము స్రవించినపుడు అట్టి పతనమున సపిండులకు సద్యశ్శౌచమును విధించునని చెప్పె "ఊనద్వివర్షే ప్రేతే గర్భపతనేవాసపిండానాంత్రిరాత్రం" రెండుసంవత్సరములకు లోగడ శిశువు మృతినొందినను గర్భము పతనమైనను సపిండులకు త్రిరాత్రాశౌచము అను వసిష్ఠవచనము ఐదారుమాసముల కఠినగర్భపాతమగునపుడు వర్తించు ఇట్లనేక నిబంధములయందు ద్రవరూపమగు గర్భము వెలువడిన సపిండులకు సద్యశ్శౌచమనియు కఠినమగు గర్భము వెలువడిన త్రిరాత్రాశౌచమనియు ప్రతిపాదింపబడె, ఐదారుమాసములయందు ద్రవరూపముగానుండుట సంభవింపదు. మొదటి మూడు మాసములయందు సపిండులకు స్నానము చెప్పబడలేదు. కాన నాల్గవ మాసమునందు మాత్రమీస్నానవిధిచెల్లదగు. "గర్భస్రావే మాసతుల్యా రాత్రయః స్త్రీణాంస్నానమాత్రమేవపురుషస్యైవ తత్కఠినస్రావేతు త్రిరాత్రం" గర్భస్రావమున మాససంఖ్యకుసరియగు సంఖ్యగలరాత్రులు తల్లికాశౌచము తండ్రికిస్నానముమాత్రము కఠినస్రావమగుచో తండ్రికిని త్రిరాత్రము. అని వృద్ధవసిష్ఠుడుపలికె. నాల్గవమాసమున చాల దినములు గడచిన పిదప గర్భమునకు కొంచెము కాఠిన్యమేర్పడు కాని నీవిధి నాల్గవ మాసమున మాత్రము చెల్లనగు, ఇచ్చట సోదరులు గ్రహింపబడరు, జనకాది శబ్దములచే తండ్రి ప్రత్యక్షముగా జెప్పబడినప్పుడే సోదరుల గూడ గ్రహింపదగు. ఇచ్చట పురుషశబ్దముచే తండ్రినే యూహింపవలసివచ్చె కాన సోదరులూహింపబడరు. ఈ వృద్ధవసిష్ఠుని వచనము తండ్రికిమాత్రము త్రిరాత్రాశౌచమును విధించుటవలన నైదారుమాసములవిషయముకానేరదు. అట్లైనచో నైదారుమాసముల జ్ఞాతులకు గూడ త్రిరాత్రాశౌచమును విధించు బహువచనములకు విరుద్ధమగు.

శ్లో॥ త్రిరాత్రంస్రావమాశౌచం మాతురేవవిధీయతే।
పిత్రాదీనాంసపిండానాం శుద్ధిస్సద్యోజలాప్లుతాత్ ॥

తా॥ తల్లికి స్రావాశౌచము మూడుదినములు తండ్రిమొదలగు సపిండులకు స్నానముతోశుద్ధి. అను వృద్ధవిష్ణువచనమున తల్లికి విధింపబడిన త్రిరాత్రాశౌచము మూడు మాసముల లోగడ విషయమనియు జ్ఞాతులకు విధింపబడిన స్నానమున సద్యశ్శౌచము నాల్గవమాసము విషయమనియు గ్రహింపదగు, కానిచో 'స్రావేచైవ పితుస్స్నానం సపిండానాం నవిద్యతే' మూడు మాసములలోగా స్రావమైనచో తండ్రికి స్నానము జ్ఞాతులకాస్నానమును లేదను యమవచనము.

## —♦ పాతాశౌచము. ♦—

శ్లో॥ మాససంఖ్యాదినంమాతుః పాతేఽన్యేషాందినత్రయం ॥

తా॥ ఐదు ఆఱుమాసముల గర్భపతనమైన తల్లికి వరుసగా నైదు ఆరు దినములు జాతాశౌచము, తండ్రి మొదలగు సపిండులకు త్రిరాత్రము, ఈ విషయమునుపపాదించెడి స్మృతివచనములు స్రావాశౌచప్రకరణమునందుదహరింపబడె. ఈస్రావపాతాశౌచములు ప్రాణశూన్యమగు గర్భము వెలువడుటయే నిమిత్తముగా గలవగుటవలన జాతాశౌచములేకాదగు, మరణ నిమిత్తకమగునదియు స్నానమాత్రమున నివర్తించునని శావాశౌచప్రకరణమందు చెప్పబడగలదు.

శ్లో॥ అదంతజాతేతనయే శిశౌగర్భచ్యుతేతథా।
సపిండానాంతుసర్వేషా మహోరాత్రిమశౌచకం ॥

తా॥ దంతములురాని కుమారుఁడు మృతినొందినను గర్భము పతనమైనను సపిండులకందరకహోరాత్రిమాశౌచము. అను యముని వచనము గ్రామాన్తరమున గర్భపాతమైనను దంతములురాని శిశువు మృతినొందగా దహనముజేసినను చెల్లదగు

## —♦ స్రావపాతాశౌచసంగ్రహము. ♦

తండ్రికీనాల్గుమాసములయందును స్నానమాత్రము. నాల్గవమాసమున కొంచెము కఠినస్రావమైనచో త్రిరాత్రము మృదుస్రావమైనచో స్నానమాత్రము, జ్ఞాతులకు మూడు మాసములలోగానైనచో స్నానమును లేదు. నాల్గవమాసమున స్నానము కలదు. సోదరులకు తండ్రివలె నాశౌచము కొంచము కఠినముగా స్రవించినచో సోదరులకు స్నానమాత్రము తండ్రికి త్రిరాత్రము అనునది మాత్రము విశేషము ఐదు ఆరు మాసముల గర్భము పతనమగుచో తల్లికైదు ఆరు దినములును తండ్రి మొదలగు సపిండులకు త్రిరాత్రమును జాతాశౌచము. స్రావాశౌచము స్నానమాత్రమున నివర్తించును. గ్రామాన్తరమున గర్భపాతమగుచో తండ్రి మొదలగు సపిండులకొకరాత్రి యాశౌచము. ఇది స్రావపాతాశౌచనిర్ణయము.

## — ప్రసవాశౌచము. —

శ్లో॥ ప్రసూతౌతుసపిండానాం పూర్ణాశౌచముదీరితం ।
ఏకోదరాణాంత్రిదినం సగోత్రాణాంనకించన ॥
స్త్రీపుంసప్రసవేమాతు ర్మాసవింశత్యహాక్రమాత్ ।
అస్పృశ్యత్వంతునైవాస్తి సూతకేసూతికాంవినా ॥
శావాశౌచేతుసర్వేషా మస్పృశ్యత్వంసదాభవేత్ ।
సూతకీమృతకీచైవ నస్పృశేతాంపరస్పరం॥

తా॥ ఏడు మొదలగు మాసములయందగు ప్రసవమున తండ్రి మొదలగు సపిండులకు, దశాహాది పూర్ణాశౌచమును, సమానోదకులకు త్రిరాత్రాశౌచమును కలదు. సగోత్రులకేమియు లేదు. సూతికకు పుత్రికజన్మించినచో మాసమును, పుత్రుడుజనించుచో నిరువదిదినములు నాశౌచము జాతాశౌచమున సూతికకుదక్క మిగిలిన సపిండుల కస్పృశ్యతలేదు. సూతికకుమాత్రము పదిరోజులవరకు అస్పృశ్యత కలదు. శావాశౌచమునందరకు నాశౌచము నివర్తించువరకస్పృశ్యత కలదు. జాతాశౌచముకలవాడును మృతాశౌచముకలవాడును ఒకరి నొకరు తాకజనదు. సపిండులవిషయమైన వచనములిదివరలో నుదహరింపబడినవి. ఇక సమానోదకులవిషయమై యుదహరించెద.

శ్లో॥ జన్మన్యేకోదకానాంతు త్రిరాత్రాచ్ఛుద్ధిరిష్యతే॥

తా॥ ఏకోదరులకు జననమున మూఁడురాత్రులతో శుద్ధిచెప్పబడెనని జాబాలివచనము సగోత్రులవిషయమై జననాశౌచమెచ్చటను జెప్పబడలేదు, కాన వారికేమియు లేదని దెలియదగు.

సూ॥ సూతికాం పుత్రజననీం వింశతి రాత్రేణ కర్మాణి కారయేన్మాసేన స్త్రీజననీం॥

తా॥ పుత్రునిగనిన సూతిక నిరువదిదినములకును పుత్రికనుగనిన సూతికను మాసమునకును కర్మలజేయు పదగునని పైఠీనసి పలికె. ఈలెక్క పదునొకండవదినమాదిగానని ద్రావిడులును, ప్రసవదినమాదిగానని తదితరులును జెప్పెదరు. అస్పృశ్యతవిషయమై ఆదిపురాణమున.

శ్లో॥ పతితం సూతికామంత్యాం శవం స్పృష్ట్వాచకామతః।
స్నాత్వాసచేలం స్పృష్ట్వాగ్నిం ఘృతంప్రాశ్యవిశుద్ధ్యతి॥

తా॥ పాపాత్ముని ప్రసవించిన స్త్రీని, చండాలుని శవమును తాకినచో కట్టువస్త్రముతో స్నానముజేసి యగ్నిని స్పృశించి ఘృతప్రాశనముజేసి పరిశుద్ధుడగునని తాత్పర్యము.

శ్లో॥ సూతకేసూతికావర్జం సంస్పర్శోననిషిద్ధ్యతి।
స్పర్శేసూతికాయాస్తు స్నానమేవవిధీయతే॥

తా॥ జాతాశౌచమున సూతికకుదక్క మిగిలినవారికస్పృశ్యత లేదు. సూతికను స్పృశించినచో స్నానముమాత్రము విధింపఁబడినది. అగ్నిస్పర్శనఘృతప్రాశనములక్కఱలేదని యంగీరసుఁడు జెప్పె అబుద్ధిపూర్వకముగా స్పృశించినచో నీవచనము ప్రవర్తించు ఈయస్పృశ్యత పదిదినములవరకేకాదగు.

శ్లో॥ సూతికాసర్వవర్ణానాం దశరాత్రేణశుద్ధ్యతి।
ఋతౌచనపృథక్ఛౌచం సర్వవర్ణేష్వయంవిధిః॥

తా॥ అన్నివర్ణములయందును సూతిక పది రాత్రులచే శుద్ధినొందు, ఋతుకాలమునందు స్త్రీకి మూఁడు రాత్రులుఁడి ౪ దినంబున శుద్ధినొందునని శాతాతపుడుపలికె.

శ్లో॥ ద్విజాతిసూతికాయాస్స్యా త్సాదశాహేనశుద్ధ్యతి।
త్రియోదశేఽహ్ని సంప్రాప్తే శూద్రాశుద్ధ్యత్యసంశయః॥

తా॥ ద్విజాతిస్త్రీ ప్రసవించినచో పదిరాత్రులును శూద్రస్త్రీ పదమూడురాత్రులునుండి పిమ్మట శుద్ధినొందునని పారస్కరుడుపల్కె.

శ్లో॥ అజగావోమహిష్యశ్చ బ్రాహ్మణ్యశ్చప్రసూతికాః।
దశరాత్రేణశుద్ధ్యంతి భూమిష్ఠంచనవోదకం॥

తా॥ ప్రసవించిన మేకలు, ఆవులు, గేదలు, బ్రాహ్మణస్త్రీలును భూమియందుపడిన క్రొత్తనీరును పదిరాత్రులచే శుద్ధినొందునని సంవర్తుడు వక్కాణించె. సూతికకంటె నితరులగు తండ్రిమొదలగు వారి కస్పృశ్యత లేదు.

శ్లో॥ బ్రాహ్మణానాంప్రసూతౌతు దేహస్పర్శోవిధీయతే।

తా॥ జాతాశౌచమున బ్రాహ్మణులొకరినొకరు తాకవచ్చును అని పరాశరుడుచెప్పె.

శ్లో॥ సూతకేసూతికావర్జం సంస్పర్శోననిషిధ్యతే॥

తా॥ సూతకము సూతికదక్క తదితరులను స్పృశింపనిషేధము లెదు అని యంగిరసుడు పలికెను.

శ్లో॥ సూతకేతుసపిండానా మగస్పర్శోనదూష్యతే॥

తా॥ సూతకమున సపిండుల స్పృశించిన దోషములేదు. అని కూర్మపురాణవచనము. ప్రసవదినమున తండ్రికి స్నానము జేయుటకు పూర్వమస్పృశ్యతకలదు పిమ్మట లేదు.

శ్లో॥ జాతేపుత్రేపితుస్స్నానం సచేలంతువిధీయతే।
మాతాశుద్ధ్యేద్దశాహేన స్నానాత్తుస్పర్శనంపితుః॥

తా॥ పుత్రుడు జనించినపుడు తండ్రి కట్టుబట్టలతో స్నానము జేయదగు, తల్లిపదిరోజులచే శుద్ధినొందు, స్నానాంతరము తండ్రికస్పృశ్యతతొలగునని సంవర్తుని వచనము.

శ్లో॥ సూతకేతుముఖందృష్ట్వా జాతస్యజనకస్తతః।
కృత్వాసచేలంస్నానంతు శుద్ధోభవతితత్క్షణాత్ ॥

తా॥ సూతకమున తండ్రి జనించిన కొమరుని ముఖమునుజూచి పిమ్మట సచేలస్నానము జేసి వెంటనే శుద్ధుడగునని యాదిత్యపురాణ వచనము.

శ్లో॥ నాశౌచంవిద్యతేపుంస స్సంసర్గంచేన్నగచ్ఛతి।
రజస్తత్రాశుచివిజ్ఞేయం తచ్చపుంసోనవిద్యతే॥

తా॥ సూతికను స్పృశింపనిచో తండ్రికాశౌచములేదు. ఆశౌచమునకు నిమిత్తము రజస్సు అది పురుషునకులేదు. కాన యాశౌచమును వర్తింపదని వసిష్ఠుఁడు చెప్పెను.

శ్లో॥ జనౌసపిండాశ్శుచయో మాతాపిత్రోస్తుసూతకం।
సూతకంమాతురేవస్యా దుపస్పృశ్యపితాశుచిః॥

తా॥ జాతమున సపిండులు పరిశుద్ధులేయగుదురు. తలిదండ్రులకుమాత్రము సూతకము అందును సూతకము తల్లికి మాత్రమేయగు ఆమెను స్పృశించినచో తండ్రికిగూడ సూతకము, అని పైఠీనసిపలికెను. సూతకమన నస్పృశ్యత అనియర్థము.

—♦ ద్రావిడవిషయమున ప్రసవాశౌచము. ♦—

ద్రావిడులు జననాశౌచమున నాల్గుదినములవరకస్పృశ్యకలదని చెప్పెదరు.

శ్లో॥ అంతంశావేఽంగసంస్పర్శం త్యజేత్సూతౌచతుర్దినం॥

తా॥ శావాశౌచమున ఆశౌచమతిక్రమించువరకు నస్పృశ్యత కలదు జాతాశౌచమునందు నాల్గుదినములు మాత్రమస్పృశ్యతకలదు. పిదప స్పృశింపదగునని ద్రావిడశతకమునందు జెప్పబడె స్మృతిముక్తాఫలమునందీ ద్రావిడశతకవచనమునకు మూలభూతమగు స్మృతివచనము గనబడమిచేతను, "ఉపస్పృశ్యపితాశుచిః" "స్నానాత్తుస్పర్శనంపితుః" "కృత్వాసచేలంస్నానంతు శుద్ధోభవతితత్క్షణాత్" ఇవి మొదలగుబహుస్మృతులకు విరుద్ధమగుటవలనను ఆద్రావిడశతకవచనమప్రమాణమని

చెప్పఁబడె, శతకకారుఁడు తనవచనమునకీ క్రింది స్మృతివచనమాధార మగునని యుదహరించె.

శ్లో॥ నస్పృశేయురనాసన్నాః ప్రేతస్యాసన్న బాంధవాన్ ।
జన్మన్యపివిపత్తౌచ యావచ్చతురహంభవేత్ ॥

తా॥ జననమునందును మరణమునందును మొదటి నాల్గుదినములు గడచువరకు, జన్మించినవానియొక్కగాని మరణించినవానియొక్క గాని అసన్నిహితజ్ఞాతులు సన్నిహితజ్ఞాతుల స్పృశింపజనదు. ఈ వచనము విజాతీయాశౌచముగలవారొకరి నొకరు తాకజనదను నభిప్రాయముగలదని చెప్పబడె ఆశతకమునందే.

శ్లో॥ దశాహందర్శనంవాక్యం సూతికాయా స్త్యజేత్తతః ।
అఘాంతంస్పర్శమేవేత్థం పితుస్తుయమళోద్భవే ॥

తా॥ పదిదినములవరకు సూతికనుచూచుట, సూతికతో మాట్లాడుట విడువదగు, పిమ్మట యాశౌచము నివర్తించువరకు స్పర్శను మాత్రము వర్జింపదగు. కవలపిల్లలు జనించుచో నీవిధి తండ్రికిగూడ వర్తించును, అనునీవచనము.

శ్లో॥ "మాతాశుద్ధ్యేద్దశాహేన స్నానాత్తుస్పర్శనంపితుః."
బ్రాహ్మణీక్షత్రియావైశ్యా ప్రసూతౌదశభిర్దినైః ॥
గతైశ్శూద్రాచసంస్పృశ్యా త్రయోదశభిరేవచ ॥

తా॥ ఇవి మొదలగు సంవర్తస్మృతి బ్రహ్మపురాణము మొదలగువాని వచనములకు విరుద్ధమగుటవలన నప్రమాణమని చెప్పబడె. మరియు "సూతికాం పుత్రజననీంవింశతిరాత్రేణ కర్మాణికారయేత్" అనువచనమిరువదిరాత్రులవరకు సూతికకు కర్మలయందధికారము లేకపోవుటనుమాత్రము బోధించుచున్నది కాన యస్పృశ్యతను శంకించుట కెంతమాత్రమవకాశము లేదు.

సూ॥ జననేతావన్మాతా పితరౌర్దశాహ మాశౌచం మాతురిత్యేకే॥

తా॥ జననమున తలిదండ్రులకు పదిదినములవరకాశౌచము. తల్లికి మాత్రమేనని కొందరనిరి. అను బోధాయనుని వచనమునుగూర్చి చంద్రికయందు 'తలిదండ్రులిరువురకస్పృశ్యతకలదు' అని పూర్వపక్షముగా నీవచనము ప్రవర్తించెనని 'తావత్' అను శబ్దమువలన తెలియవచ్చుచున్నదనియు పదిదినములవరకు తల్లికిమాత్రమస్పృశ్యతకలదను పక్షమే బాగుగానున్నదనియు వ్యాఖ్యానము జేయబడె అఖండాదర్శమునందు తలిదండ్రులకస్పృశ్యత స్త్రీపురుషశిశువులు కవలలుగా జనించినపుడు మాత్రము చెల్లునని చెప్పబడె, లేక పదిదినములవరకు తలిదండ్రుల స్పృశ్యులేయని మరియొకపక్షముండుగాక, నాల్గుదినములవరకస్పృశ్యత యను శతకకారునివచనమన్నివిధములచే తనయుక్తమేయగు పది దినములలోగా భర్తగాని సపిండుడుగాని తదితరుడుగాని సూతికను స్పృశించినచో నాస్పృశించువలన జేయదగిన స్నానాదికము జేయుపరకు వారికస్పృశ్యతకలదు

—♦ సంపర్కాశౌచము. ♦—

శ్లో॥ యదిపత్న్యాంప్రసూతాయాం ద్విజసంపర్కమిచ్ఛతి।
సూతకంతుభవేత్తస్య యదివిప్రష్షడంగవిత్ ॥

తా॥ భార్య ప్రసవించియుండగా బ్రాహ్మణుడామెను స్పృశించెనేని ఆబ్రాహ్మణుడు షడంగయుక్తమగు వేదము దెలసినవాడైనను సూతకము వానికిగల్గును అని పారస్కరుండు జెప్పె. ఈ వచనమున ద్విజుండు అని సామాన్యముగా నుచ్చరించుటచే భర్తకంటె నితరుడును సూతికను స్పృశింపజనదనిభావము.

సూ॥ సూతకంమాతురేవ తాంస్పృశతాంనేతరేషాం ॥

తా॥ జాతాశౌచము తల్లికిమాత్రమేకలదు ఆమెను స్పృశించినను ఇతరులకులేదు, అని సుమంతుడుపలికె. అనగా స్నానము జేసినచో వారికస్పృశ్యతలేదు. సూతికతోగూడ శయనాదికమును జేసినచో నాదినమంతయు సూతకము గలుగు. పది దినములు నట్టిశయనాదికమును జేసినవారు పదిదినములాశౌచముగలవారగుదురు.

శ్లో॥ తయాసహాసపిండోఽపి ప్రకుర్యాచ్ఛయనాసనం ।
బాంధవోఽబాంధవోవాపి సదశాహేనశుద్ధ్యతి ॥

తా॥ ఆసూతికతోగూడ సపిండుడుగాని బంధువుడుగాని తదితరుడుగాని పరుండినను కూర్చుండినను పదిదినములచే శుద్ధుడగునని బృహస్పతివచనము మృతాశౌచమునందుమాత్రమాశౌచము నివర్తించు వరకందరకస్పృశ్యతకలదు.

శ్లో॥ స్వాశౌచకాలేవిజ్ఞేయం స్పర్శనంతుత్రిభాగతః॥

తా॥ ఆశౌచకాలమును మూడుభాగములు జేయగా నందు మొదటిభాగమతిక్రమించిన పిదప స్పృశింపదగునని తెలియదగు.

శ్లో॥ దశాహాదిత్రిభాగేన కృతేసంచయనేక్రమాత్ ॥
అంగస్పర్శనమిచ్ఛన్తి వర్ణానాంతత్త్వదర్శినః ॥

తా॥ ఆయావర్ణములకు జెప్పబడిన యాశౌచమున మొదటి మూడవభాగమున క్రమముగా సఞ్చయనాదికము జేయబడినదగుచుండగా పిమ్మట యస్పృశ్యతలేదని శాస్త్రిజ్ఞులు చెప్పిరి. అను దేవలుడు మొదలగువారి వచనములచే మృతాశౌచమును మూడుభాగములుగా జేయనందు మొదటిభాగమునదక్క రెండుమూడు భాగములయందస్పృశ్యతలేదని భాసించుచున్నది కాని చంద్రికయందు.

శ్లో॥ అస్థిసంచయనాదూర్ధ్వ మంగస్పర్శనమేవచ ॥

తా॥ అస్థిసంచయనమైన పిమ్మట నాశౌచవంతుల స్పృశింపదగుటయు, అని మరికొన్ని ధర్మముల జెప్పి.

శ్లో॥ కలౌయుగేత్విమాన్ధర్మా న్వర్జ్యానాహుర్మనీషిణః॥

తా॥ కలియుగమునందీ ధర్మముల వర్జింపదగునని జెప్పబడెను ఇట్లెమాధవీయాదులయందుగూడ జెప్పబడినది. కాన మృతాశౌచమున నాశౌచాన్తమస్పృశ్యతగలదని సిద్ధాన్తము తానుశావాశౌచము గలవాడై యుండి జాతాశౌచవంతుడగు సపిండుడుగాని వానిని బుద్ధిపూర్వముగ స్పృశించినచో నపుడు సాన్తపనవ్రతముచరింపనగు. అబుద్ధి

పూర్వముగ స్పృశించిన నాసాంతస్నానవ్రతమున సేగమాచరింపనగు. సంచయనమైనపిదప బుద్ధిపూర్వముగ స్పృశించిన పాదకృచ్ఛ్రమును అబుద్ధిపూర్వముగ స్పృశించిన నొకరాత్రి యుపవాసమును జేయనగు, తానుజాతాశౌచముగలవాడై యుండి శావాశౌచముగల సపిండుడు గాని వానిని బుద్ధిపూర్వకముగ స్పృశించినచో కృచ్ఛ్రద్వయమును అబుద్ధిపూర్వకముగ స్పృశించినచో నొకకృచ్ఛ్రము నాచరింపనగు, సంచయనమైన పిమ్మటసంభవించితే వెనుకటివలె జేయఁదగు.

శ్లో॥ శావాశౌచేసముత్పన్నే సూతకంతుయదాభవేత్ ।
అన్యాశౌచవతాంస్పర్శో నకర్తవ్యోద్విజన్మనాం॥

తా॥ తానుశావాశౌచముగలవాడై యుండి జాతాశౌచముగల మరియొకనిని తాకజనదు అని భృగుమహర్షి వచనము.

శ్లో॥ పరస్యాశౌచినస్పర్శే శావాశౌచంకథంభవేత్।
మత్యాస్నానంకుర్యా దమత్యాతుతదర్ధకం ॥
అస్థిసంచయనాదర్వా గేవంశుద్ధిర్విధీయతే।
ఊర్ధ్వంత్రిరాత్రంవిజ్ఞేయ మమత్యాతుదినంభవేత్ ॥
సూతకేశావసంస్పర్శే మత్యాకృచ్ఛ్రద్వయంచరేత్।
అమత్యాకృచ్ఛ్రమేకంస్యా దిత్యువాచబృహస్పతిః ॥

తా॥ తానుశావాశౌచముగలవాడైయుండి జాతాశౌచముగల మరియొకనిని స్పృశించిన బుద్ధిపూర్వకముగానైనచో స్నానమును అబుద్ధిపూర్వకముగానైనచో నర్ధస్నానమును వాచరింపనగు, అస్థి సంచయనమునకు పూర్వమైనచో నీపూర్వము చెప్పబడినరీతిని శుద్ధుడగు. పిమ్మటనేమైనచో బుద్ధిపూర్వకముగానైన త్రిరాత్రమును అబుద్ధిపూర్వకముగానైన నొకరాత్రియు నుపవసింపదగు, తానుజాతాశౌచముగలవాడైయుండి శావాశౌచముగల మరియొకనిని స్పృశించినచో బుద్ధిపూర్వకముగానైన రెండు కృచ్ఛ్రములును అబుద్ధిపూర్వకముగానైన నొకకృచ్ఛ్రమును నాచరింపదగునని బృహస్పతిజెప్పెనని స్మృత్యంతరమున జెప్పబడె.

—♦ ఇక సపిండాదులయొక్క స్వరూపము. ♦—

ఒకగోత్రమునందొక పురుషుని కూటస్థునిగాజేసి పుత్రపౌత్రాది క్రమముగా ముందుకు పరిగణింప నేడు పురుషాన్తరములవారు సపిండులనబడుదురు. అట్లె పితృపితామహాదిక్రమముగా వెనుకకు పరిగణించినను నేడు పురుషాన్తరములకు లోబడినవారి సంతతియగువారు. పరస్పరము సపిండులనబడుదురు. ఏపురుషుడు మొదలుగా రెండుగాని అంతకుమించిగాని సంతానములు (తెగలు) ప్రవర్తించినవో ఆపురుషుడు కూటస్థుడనబడు అట్టికూటస్థుని మొదలుగాజేసి పరిగణింప నొకగోత్రముగలిగి సప్తపురుషాన్తరములకు లోబడిన ఆయా తెగలవారందరు నొకరికొకరు సపిండులనబడుదురు. దౌహిత్రుడు మొదలగువారు భిన్నగోత్రులగుటచే సపిండులు కానేరరు. ఎనిమిదవ పురుషుడు మొదలు పదునాల్గవపురుషునివరకు నేకగోత్రులగువారు సమానోదకులనబడుదురు. అటుపిమ్మట నిరువదియొకటవ పురుషునివరకు సగోత్రులేయనబడుదురు. పదునాల్గవపురుషునకు లోబడి సమానోదకులు కాదగినవారును జన్మనామముల రెంటియొక్కగాని వానిలో నొకదానియొక్కగాని మరపుగల్గినపుడు సగోత్రులేయనబడుదురు. ఆదేవదత్తుడు మన వంశమున బుట్టినవాడు అను స్మృతిలేకపోవుట జన్మవిస్మృతియనబడు. మనమాదేవదత్తుని వంశమున బుట్టినవారమను స్మృతిలేకపోవుట నామవిస్మృతియనబడు. స్త్రీలకు పితృవంశమున మూడు పురుషాన్తరముల వరకే సాపిండ్యముగలదు. పిమ్మట మూడు పురుషాన్తరములవరకు సమానోదకత్వము. పిమ్మట సగోత్రతయుకలదు. వివాహమైన పిదప నీసాపిండ్యాదికము లేదు. అపుడు భర్తవంశమున సప్తపురుషపర్యన్తము సాపిండ్యముగల్గియుండు.

శ్లో॥ సపిండతాతునిర్దిష్టా గోత్రతస్సప్తపూరుషాః॥

తా॥ సగోత్రులకు కల్గియుండు సాపిండ్యము ఏడు పురుషాన్తరములవరకు వర్తించును అని శంఖుడుపలికె.

శ్లో॥ సపిండతాతుపురుషే సప్తమేవినివర్తతే।
సజాతీయేషువర్ణేషు చతుర్థేభిన్నజాతిషు॥

తా॥ బ్రాహ్మణత్వాది ధర్మములచే సజాతీయులగువారియందు సాపిండ్యమేడవ పురుషునితో నివర్తించు, భిన్నజాతీయులకు నాల్గవ పురుషునితోనే నివర్తించునని పరాశరునివచనము.

శ్లో॥ పుత్రాణాంచాసవర్ణానా మదత్తానాంచయోషితాం ।
సపిండతాతునిర్దిష్టా పితృపక్షేత్రిపూరుషాత్ ॥

తా॥ అసవర్ణస్త్రీయందు జనించిన పుత్రులకును వివాహాము గాని స్త్రీలకును తండ్రి వంశమున మూడు పురుషాన్తరముల వరకే సాపిండ్యముకలదని శాతాతపుడుపలికె.

శ్లో॥ సపిండతాతుకన్యానాం సవర్ణానాంత్రిపూరుషే ।
ఏకోదకాస్తతశ్చోర్ధ్వం నిర్దిష్టాస్తుత్రిపూరుషాః ॥

తా॥ సవర్ణస్త్రీయందు జనించిన కన్యలకు మూడుపురుషాన్తరములవరకు సాపిండ్యమును, పిమ్మట మూడు పురుషాన్తరములవరకు సమానోదకత్వమున్ను కలదని బ్రహ్మపురాణమున జెప్పబడె. కాన కన్యకజనించుచో మూడుపురుషాన్తరములకు లోబడినవారికే పూర్ణాశౌచము గలదని విజ్ఞానేశ్వరుడు మాధవాచార్యులు మొదలగువారు చెప్పిరి. అందును భిన్నోదరులగు పెదతండ్రి, పినతండ్రుల కొమరుల కాశౌచములేదు.

శ్లో॥ భిన్నోదరస్యభార్యాతు స్త్రీప్రసూతాభవేద్యది ।
భ్రాతుర్దశాహమాశౌచం తత్పుత్రస్యనవిద్యతే ॥

తా॥ భిన్నోదరుడగువాని భార్యకు స్త్రీజనించినచో భిన్నోదర భ్రాతలకుమాత్రము పదిదినములాశౌచముకలదు, వారిపుత్రులకు లేదు అనుస్మృతి పైవిషయమునకు ప్రమాణము. కమలాకరుడు మొదలగు వారీ త్రిపూరుషసాపిండ్యముకానీనకన్యా పరమని చెప్పిరి. తదితరకన్యలకు సప్తపూరుషసాపిండ్యమేకాదగు అట్లుకాదేని.

శ్లో॥ అప్రత్తానాంతథాస్త్రీణాం సాపిండ్యంసప్తపూరుషం ॥
ప్రత్తానాంభర్తృసాపిండ్యం ప్రాహదేవఃప్రజాపతిః ॥

తా॥ అవివాహితలగు స్త్రీలకు పితృవంశమున సప్తపూరుష సాపింద్యముగలదు. వివాహితలగు వారలకు భర్తతో సమానమగు సాపింద్యము భర్తృవంశమున గల్గియుండునను కూర్మపురాణమునందలి వచనమునకు విరోధముకలుగునని చెప్పిరి.

"అతిరాత్రేషోడశినంగృహ్ణాతి" అతిరాత్రమను క్రతువున షోడశినిగ్రహింపదగు 'నాతిరాత్రేషోడశినంగృహ్ణాతి' అతిరాత్రమున షోడశినిగ్రహింపజనదు. అనురీతిగా రెండు విరుద్ధవిషయములు శాస్త్రముచే విధింపబడినచో నదివికల్పమనబడు. ప్రకృతమున అవివాహిత కన్యకు పితృవంశమున త్రిపూరుషసాపింద్యము సప్తపూరుష సాపింద్యమును పరస్పరవిరుద్ధములగుచు శాస్త్రములచే విధింపబడుటవలన నిచట వికల్పము ఇట్టి వికల్పవిషయముల శిష్టాచారము ననుసరించి నడువవలయు. వికల్పము, వ్యవస్థితము, అవ్యవస్థితము అని రెండు రకములు అందు విషయభేదముననుసరించి వ్యవస్థజేయబడినది వ్యవస్థితమనబడు అట్లు కానిది అవ్యవస్థితము ఈ అవ్యవస్థితవికల్పమున ఎవని యిచ్ఛవచ్చినట్లు వాడాచరింపదగు. ప్రకృతమున విజ్ఞానేశ్వరుని మతముననుసరించిద్రావిడుల యాచారముకనబట్టుచున్నది తదితరుల యాచారము కమలాకరుని మతానుసారము కనబట్టుచున్నది కాన నెవరియాచారప్రకారము వారాచరింపదగునని వ్యవస్థచేయబడినది. కొన్నివచనములయందు కన్యలకు పంచపూరుషసాపింద్యము చెప్పబడినది. ఆవిధివివాహమాడనని వివాహమును నిషేధించిన స్త్రీవిషయమైమాత్రము చెల్లదగియుండు. ఆశౌచమున త్రిపూరుషపర్యంతమేవర్తిం.చు.

శ్లో॥ సమానోదకభావస్తు సువరేతాచతుర్దశాత్।
జన్మనామ్నోస్స్మృతేరేకే తత్పరంగోత్రముచ్యతే ॥

తా॥. సమానోదకత్వము పదునాల్గవపురుషునివరకు మాత్రము వర్తించును. ఇది జన్మనామములయొక్క స్మృతియున్న పక్షమునవే వర్తింపదగు. పిమ్మట యిరువదియొకటవ పురుషునివరకు సగోత్రత యనువర్తించునని వ్యాఘ్రునివచనము ఏడవపురునికంటె పైవారు

జన్మనామములస్మృతిలేనిచో సగోత్రులేయగుదురని చంద్రికయందు గూడ జెప్పబడినది

శ్లో॥ సపిండతాతుపురుషే సప్తమేవినివర్తతే।
సమానోదకభావస్తు జన్మనామ్నోరవేదనే॥

తా॥ ఏడవపురుషునియందు సపిండత్వము నివర్తించు. సమానోదకత్వముగూడ జన్మనామముల గుర్తెరుగనిచో నాసప్తమపురుషుని యందే నివర్తించునని మనువుపలికె.

శ్లో॥ దాయాద్విచ్ఛేదమాప్నోతి పంచమేవాత్మవంశజః ।

తా॥ ఐదవ పురుషునియందైనను ఏడవ పురుషునియందైనను సాపిండ్యమునివర్తించు. "సపిండనివృత్తిః సప్తమేపంచమేవా" ఏడవ పురుషునితోగాని ఐదవపురుషునితోగాని సాపిండ్యము నివర్తించునను పరాశరుడు గౌతముడు మొదలగువారివచనములచే పంచమపురుషుని యందే సాపిండ్యము నివర్తించుట నంగీకరించి

శ్లో॥ చతుర్థేదశరాత్రంస్యాత్ షణ్ణిశాఃపుంసిపంచమే ।
షష్ఠేచతురహాచ్ఛుద్ధిః సప్తమేతుదినత్రయాత్ ॥

తా॥ నాల్గుపురుషాన్తరములకు లోబడినవారికి దశరాత్రాశౌచము ఐదవపురుషునకు లోబడినవారికారుదినములు నారవపురుషుని యందు నాల్గుదినములు ఏడవపురుషునియందు దినత్రయము అని చెప్ప బడిన యాశౌచముయొక్క సంకోచమున్నూ మరియు.

శ్లో॥ గ్రన్థార్థతోవిజానాతి వేదమంగైస్సమన్వితం ।
సకల్పంసరహస్యంచ క్రియావాంశ్చేన్నసూతకం ॥
ఏకాహాచ్ఛుద్ధ్యతేవిప్రః యోగ్నివేదసమన్వితః ॥

తా॥ షడంగయుక్తమగునట్టియు, కల్పశాస్త్రముతోగూడినట్టియు రహస్యసహితమగు వేదమునె వడుగ్రన్థార్థములచే దెలసినవాడో వాడు కర్మలగూడ నాచరించుచున్నచో వానికి సూతకము లేదు. అగ్ని వేదములతోగూడిన బ్రాహ్మణుడు ఆశౌచముప్రాప్తించినపుడొక దిన ముననే శుద్ధుడగునను నివి మొదలగు వచనములచేజెప్పబడిన విద్యాది

తారతమ్యము నిమిత్తముగాగల యాశౌచసంకోచము కలియుగమున నిషేధింపబడె.

శ్లో॥ దశాహాదేవవిప్రస్య సపిణ్డమరణేసతి।
కల్పాన్తరాణికుర్వాణః కలౌవ్యామోహకిల్బిషీ॥

తా॥ సపిండుడు మృతినొందినపుడు బ్రాహ్మణునకు దశాహాశౌచమేకాదగు, కలియుగమున మఱియొకరీతినియనుష్ఠించుచో పాపాత్ముడగును. అనుహారీతవచనముచే, శావాశౌచముకంటె వేరగు. క్రమాశౌచము. (పురుషాన్తరముల వ్యవధానమునబట్టి సంకోచించు యాశౌచము) గాని గుణాశౌచము విద్య కర్మానుష్ఠానము మొదలగు వానిచే సంకోచించెడి యాశౌచముగాని కలియుగమున తగవని చెప్పబడె. మరియు,

శ్లో॥ అసవర్ణాసుకన్యాసు వివాహశ్చద్విజాతిషు।
వృత్తస్వాధ్యాయసాపేక్ష మఘసంకోచనంతథా॥
అస్థిసంచయనాదూర్ధ్వ మంగస్పర్శనమేవచ॥

తా॥ బ్రాహ్మణుల సవర్ణస్త్రీలవివాహమాడుట సత్కర్మానుష్ఠానము విద్య వీటినిబట్టి యాశౌచము తగ్గుట. అస్థిసంచయనమైన పిదప శావాశౌచముగలవారికస్పృశ్యతలేకుండుట అని యిట్లు కొన్ని విషయముల జెప్పి,

శ్లో॥ ఏతానిలోకగుప్త్యర్థం కలేరాదౌమహాత్మభిః।
నివర్తితానికర్మాణి వ్యవస్థాపూర్వకంబుధైః॥

తా॥ ఈ కర్మలు లోకరక్షణార్థమై మహాత్ములగు పండితులచే కలియుగముయొక్క ప్రారంభమున వ్యవస్థాపూర్వకముగ నిషేధింపబడినవి అని చంద్రికాదులయందు జెప్పబడె.

## —♦ యావజ్జీవాశౌచనింద. ♦—

మరియు, శ్లో॥ క్రియాహీనస్యవిప్రస్య మహారోగిణఏవచ।
యథేష్టాచరణస్యాహు ర్మరణాన్తమశౌచకం॥

తా॥ సంధ్యాదికర్మలవదలినవానికిని, దీర్ఘరోగముగలవానికిని, స్వేచ్ఛాప్రవర్తనముగలవానికిని చనిపోవువరకు నాశౌచమేనని కూర్మపురాణమున జెప్పఁబడె.

శ్లో॥ వ్యాధితస్యకదర్యస్య ఋణగ్రస్తస్యసర్వదా ।
క్రియాహీనస్యమూర్ఖస్య స్త్రీజితస్యవిశేషతః ॥
వ్యసనాసక్తచిత్తస్య పరాధీనస్యనిత్యశః ।
భక్తిశ్రద్ధావిహీనస్య భస్మాన్తంసూతకంభవేత్ ॥
నసూతకంకదాచిత్స్యా ద్యావజ్జీవంతుసూతకం ॥

తా॥ దీర్ఘవ్యాధికలవాడును లుబ్ధుడును, ఎల్లపుడు ఋణగ్రస్తుడగువాడు, సన్ధ్యాదికర్మలులేనివాడు, మూర్ఖుడు, స్త్రీలకులోబడినవాడు ద్యూతము మొదలగు దుర్వ్యసనములయందాసక్తికలవాడు ఎప్పుడును పరాధీనమగు జీవనముగలవాడు, గురుదైవములయందును తత్సపర్యలయందును భక్తిశ్రద్ధలులేనివాడును, వీరికిభస్మమగువరకును సూతకము శాస్త్రమున జెప్పబడినవిధమున యొకానొకప్పుడే సూతకముకానేరదు. ఇకనేమన జీవించియున్నంతవఱకు సూతకమేనని దక్షునివచనము. ఈవచనములనుబట్టి సత్కర్మహీనులకాశౌచము కర్మిష్ఠులకువలె చెప్ప దగదు ఎట్లన,

శ్లో॥ జన్మకర్మపరిభ్రష్ట స్సన్ధ్యోపాసనవర్జితః ।
నామధారకవిప్రస్తు దశాహంసూతకీభవేత్ ॥

తా॥ గర్భాధానపుంసవనాదికము జేయబడకుండుటచే జన్మకర్మభ్రష్టుడును సన్ధ్యోపాసనములేనివాడునై "బ్రాహ్మణుడు" అను నామమునుమాత్రము ధరించిన బ్రాహ్మణుడు పదిదినములాశౌచము గలవాడగునను పరాశరవచనము. కర్మభ్రష్టుడగు నామధారక బ్రాహ్మణునకు పదిదినములాశౌచమని విధించుచున్నది. కాన లుబ్ధుడు మొదలగువారలకు, యావజ్జీవాశౌచము మిక్కిలి యుక్తముకానిది యగు ఇక కూర్మపురాణాదివచనములకు గతియేమన ఇవినిందార్థవాదములని మాధవీయాదులయందు జెప్పబడె.

—♦ నామధారకబ్రాహ్మణునిలక్షణము. ♦—

వ్యాసః॥ శ్లో॥ బ్రహ్మబీజసముత్పన్నో మంత్రసంస్కారవర్జితః।
జాతమాత్రోపజీవీచ సభవేన్నామధారకః ॥
గర్భాధానాదిభిర్ముక్త స్తథోపనయనేనచ।
నకర్మకృన్నచాధీతే సభవేన్నామధారకః ॥

తా॥ బ్రాహ్మణబీజమునకుజనించి, మన్త్రసంస్కారములు లేని వాడై పుట్టినవాడు పుట్టినట్లెయుండిజీవించువాడును, జనింపకపూర్వము గర్భాధానాది సంస్కారములులేక జనించినపిదప నుపనయనాది సంస్కారములులేక కర్మలజేయక వేదముల జదువక నుండువాడు నామధారకబ్రాహ్మణుడనబడునని పరాశరుడుజెప్పె. పుత్రజననమున జాతకర్మాదులజేయుటకై తాత్కాలికశుద్ధి పుత్రుడుజనించినపిదపజాతకర్మ చేయుటకై యొకముహూర్తకాల మాశౌచములేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ నాభికృన్తనతఃపూర్వం సూతకంనవిధీయతే ॥

వ్యా॥ నాభిచ్ఛేదాత్పూర్వంజాతకర్మకరణాయ తత్సాహాయ్యకరణాయచమాతాపిత్రోర్భ్రాతౄణాం జ్ఞాతీనాంచసూతకంనాస్తీత్యర్థః॥

తా॥ నాభిచ్ఛేదమునకు పూర్వము జాతకర్మచేయుటకొరకును, అందుసహాయపడుటకొరకును, తలిదండ్రులకు సోదరులకు జ్ఞాతులకును సూతకములేదనియర్థము

శ్లో॥ యావన్నచ్ఛిద్యతేనాళం తావన్నాప్నోతిసూతకం।
ఛిన్నేనాళేతతఃపశ్చా త్సూతకంతువిధీయతే ॥

తా॥ నాళము ఛేదింపబడనంతవరకు సూతకములేదు ఛేదింపబడిన పిదప సూతకము విధింపబడెనని జైమినిచెప్పె. దానవిషయమై జన్మదినమునందంతటను సూతకములేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ పుత్రజన్మదినేపిత్రా ధనధాన్యగవాదికం।
పక్వమన్నంవినాదేయం ప్రతిగ్రాహ్యంతథేతరైః॥

తా॥ పుత్రుడు జనించిన దినమున తండ్రి పక్వమగు అన్నము దక్క, ధనము ధాన్యము గోవులు మొదలకునవి దానముజేయదగు. ఇతరులు ప్రతిగ్రహింపదగు. అనగా దానవిషయమున మాత్రము తండ్రి శుద్ధుడు. ఇతరులకు ప్రతిగ్రహమునందు మాత్రము దోషము లేదు.

శ్లో॥ జాతేకుమారేతదహః కామంకుర్యాత్ప్రతిగ్రహం।
హిరణ్యధాన్యగోవాస స్తిలానాంమధుసర్పిషాం॥

తా॥ కుమారుడు జనించిన దినమున సువర్ణము, ధాన్యము, గోవులు, వస్త్రములు, నువ్వులు, తేనె, ఆజ్యము వీనిని స్వేచ్ఛగా ప్రతిగ్రహింపదగునని మనువచనము.

సూ॥ కుమారప్రసవే నాభ్యామచ్ఛిన్నాయాంగుడతిల వస్త్రహిరణ్య ప్రావరణధాన్యాదిప్రతిగ్రహేష్వ దోష స్తదహరిత్యేకే॥

తా॥ కుమారుడు జనించినపుడు నాభిచ్ఛేదమునకు పూర్వము బెల్లము, నువ్వులు, వస్త్రము, సువర్ణము, ఉత్తరీయము, ధాన్యము మొదలగునవి ప్రతిగ్రహించినచో దోషములేదు. ఆదినమంతయు దోషములేదని కొందరియభిప్రాయము అనిశంఖలిఖితులవచనము.

శ్లో॥ కుమారజన్మదివసే విప్రైఃకార్యఃప్రతిగ్రహః।
హిరణ్యభూగజాశ్వాజ వాసశ్శయ్యాసనాదిషు॥
తత్రసర్వ్రాప్రతిగ్రాహ్యం కృతాన్నంతునభక్షయేత్।
భక్షయిత్వాతుతన్మోహా ద్ద్విజశ్చాన్ద్రాయణంచరేత్॥

తా॥ కుమారుడు జనించినదినమున సువర్ణము, భూమి,ఏనుగు, గుఱ్ఱము, మేక, వస్త్రము శయ్య ఆసనము మొదలగువాని నన్నిటిని బ్రాహ్మణులు ప్రతిగ్రహింపదగు. వండినయన్నముమాత్రము భక్షింపజనదు. ప్రమాదవశమున భక్షించినచో చాన్ద్రాయణవ్రతము నాచరింపదగునని వృద్ధయాజ్ఞవల్క్యుడుచెప్పెను. ఏదినమునపక్వాన్నమును భుజించునో అదిమొదలు సూతకదినములెన్ని మిగిలియుండెనో అన్ని దినములవరకు నాశౌచముగూడ గలదు. ఈ విషయము ముందు

శ్లో॥ గుడతైలహిరణ్యానాం గోధాన్యానాంచవాససాం।
తస్మిన్నహనివాన్యస్య విప్రైఃకార్యఃప్రతిగ్రహః॥
ప్రాఙ్నాభిచ్ఛేదనాద్గ్రాహ్యాణ్యేతానీత్యపరేజగుః॥

తా॥ కుమారుడు జనించినదినమున బెల్లము, నూనె, సువర్ణము గోవులు, ధాన్యము, వస్త్రము మొదలగునవి ప్రతిగ్రహింపదగు. ఈ ప్రతిగ్రహము నాభిచ్ఛేదమునకు పూర్వము మాత్రమే చేయదగునని కొందరుచెప్పిరి అని బోధాయనునివచనము.

శ్లో॥ ఖలేయజ్ఞేవివాహేచ సంక్రాన్త్యాగ్రహణేతథా।
పుత్రేజాతేవ్యతీపాతే దత్తంభవతిచాక్షయం॥
శర్వర్యాందానమస్తీతి నాన్యత్రతువిధీయతే॥

తా॥ కళ్లమునందు, యజ్ఞమునందు, వివాహమునందు, సంక్రాన్తియందు, గ్రహణమునందు, పుత్రజననదినమందు వ్యతీపాతయోగమునందు జేయబడిన దానమక్షయమగు. పైన చెప్పబడిన నిమిత్తములయందుదక్క రాత్రికాలమున దానమెచ్చటను విధింపబడదు అని పరాశరుడుపల్కె.

శ్లో॥ పుత్రజన్మనియాత్రాయాం శర్వర్యాందత్తమక్షయం॥

తా॥ పుత్రుడు జనించినదినమునను యాత్రయందును రాత్రియందు జేయబడిన దానమక్షయమగునని స్మృతిసంగ్రహమున జెప్పబడె ఈరాత్రిదానము రాత్రిప్రసవించినపుడు జెప్పబడెనని తెలియదగు.

— పితృగృహమందు పుత్రిక ప్రసవించినచో జాతాశౌచము. —

శ్లో॥ ప్రసూతాచేత్పితుర్గేహే పుత్రీపిత్రోస్త్రిరాత్రకం।
భ్రాతౄణాంచత్రిరాత్రంస్యాత్ జ్ఞాతీనామేకరాత్రకం॥

తా॥ తండ్రియింట పుత్రికప్రసవించినచో తలిదండ్రులకు సోదరులకు త్రిరాత్రమును జ్ఞాతులకేకరాత్రమును జాతాశౌచము.

శ్లో॥ దత్తానారీపితుర్గేహే ప్రసూయేతమ్రియేతవా।
తద్బంధువర్గస్త్వేకేన శుద్ధ్యేత్సజనకస్త్రిభిః॥

తా॥ వివాహామైనపిదప పుత్రిక తండ్రియింట ప్రసవించినను మృతినొందినను వానిబంధువర్గమేకరాత్రమునను తండ్రిత్రిరాత్రమునను శుద్ధులగుదురని బ్రహ్మపురాణమున జెప్పఁబడె.

శ్లో॥ శేషతశ్శుచయస్సర్వే దశాహాన్తర్జనిశ్రుతౌ ॥

తా॥ పదిదినములమధ్య జననము వినబడినచో తండ్రి సోదరులు జ్ఞాతులు దశాహశేషమున శుద్ధులగుదురు.

శ్లో॥ దేశాన్తరగతంశ్రుత్వా కల్యాణంమరణంతథా।
యచ్ఛేషందశరాత్రస్య తావదేవాశుచిర్భవేత్ ॥

తా॥ మరియొక దేశమునందు జరిగిన జాతమునుగాని మృతమునుగాని వినినపుడు దశాహశేషమువరకాశౌచము అని శంఖవచనము.

శ్లో॥ అన్యదేశమృతంజ్ఞాతిం శ్రుత్వాపుత్రస్యజన్మచ।
అనిర్గతదశాహంతు శేషాహోభిర్విశుద్ధ్యతి ॥

తా॥ ఇతరదేశమున జరిగిన జ్ఞాతిమరణమునుగాని పుత్ర (జ్ఞాతి) జననమునుగాని పదిదినములలోగడ వినినచో దశాహశేషమున శుద్ధియని బృహస్పతివచనము.

శ్లో॥ స్నానంపితురతిక్రాన్తే జ్ఞాతీనాన్తునకించన ॥

తా॥ పదిదినములు గడచినపిదప జననమువినబడినపుడు తండ్రికి సచేలస్నానముమాత్రము చెప్పబడె జ్ఞాతులకదియును లేదు.

శ్లో॥ నిర్దశంజ్ఞాతిమరణం శ్రుత్వాపుత్రస్యజన్మచ।
సవాసాజలమాప్లుత్యశుద్ధోభవతిమానవః ॥

తా॥ పదిదినములు గడచినపిదప జ్ఞాతిమరణమునుగాని పుత్రుని జననమునుగాని వినినపుడు సచేలస్నానమున శుద్ధుడగుననిమనువచనము ఈశ్లోకమున "పుత్రునియొక్క" అని చెప్పుటవలన జననమున తండ్రికి మాత్రము సచేలస్నానమని భావము.

శ్లో॥ నాశౌచంస్వల్పమప్యస్తి వ్యతీతేషుదినేష్వపి।

తా॥ శాస్త్రవిహితములగు దినములతిక్రమించినపిదప వినినచో జ్ఞాతులకేమాత్రమాశౌచములేదు "ఏమాత్రము" అనుటవలన స్నానముగూడ లేదని తోచుచున్నది.

—◆ దశాహమధ్యమున శిశువుమృతినొందినప్పుడు. ◆—

శ్లో॥ అచ్ఛిన్ననాభేర్మరణే జనన్యాఃపూర్ణసూతకం ।
పితాదీనాంసపిండానాం త్రిరాత్రంమునిభిఃస్మృతం ॥
ఛిన్ననాభిర్యదిమృతో మృతోవాజాయతేయది ।
పూర్ణాశౌచంజనన్యాశ్చ పిత్రాదీనాంచనిశ్చితః ॥

తా॥ పుట్టిన శిశువు నాభిచ్ఛేదముకాకపూర్వము మృతినొందినచో తల్లికిపూర్ణముగాను తండ్రిమొదలగు సపిండులకు త్రిరాత్రమును జాతాశౌచము చెప్పబడె. ఇది చెప్పబోవు దశరాత్రాశౌచముతో వికల్పించును మృతాశౌచము స్నానముమాత్రమున నివర్తించునని శావాశౌచప్రకరణమున చెప్పబడును. నాభిచ్ఛేదమైనపిమ్మట శిశువు మృతినొందినచో తలిదండ్రులకును సోదరులకును దశాశేషమువరకు మృతాశౌచము అనగా జననదినమున మృతినొందినచో పూర్తిగాదశాహమున్ను రెండు మొదలగు దినములయందు మృతినొందినచో తొమ్మిదిమొదలగు దశాహశేషదినములుమాత్రము మృతాశౌచము. మృతినొందిన శిశువు జనించినచో తల్లికి పూర్ణముగ మృతాశౌచము తండ్రికి పూర్ణముగ జాతాశౌచము. మృతప్రసవముననను నాభిచ్ఛేదానంతరము మృతినొందినపుడును జ్ఞాతులకు పూర్ణముగ జాతాశౌచమే యగు. మృతాశౌచము స్నానమాత్రమున నివర్తించునని చెప్పగలము ఇట్లు విభజించి పైశ్లోకముయొక్క అర్థము తెలియదగు.

శ్లో॥ జీవన్జాతోయదితతో మృతస్సూతకఏవతు ।
సూతకంసకలంమాతుః పితాదీనాంత్రిరాత్రకం ॥

తా॥ జీవముతో జనించిన శిశువు పిమ్మట సూతకమునందే మృతినొందినచో తల్లికి పూర్ణముగ జాతాశౌచము తండ్రిమొదలగు వారికి త్రిరాత్రమేయగునను వృద్ధమనువచనము నాభిచ్ఛేదమునకు పూర్వము మృతినొందినపక్షమున వర్తింపదగునని జ్ఞానేశ్వరాదులు పలికిరి

శ్లో॥ జాతేమృతేమృతేజాతే సపిండానాందశాహకం ॥

తా॥ శిశుప్రజనించి మృతినొందినను, మృతినొంది జనించినను, సపిండులకు దశాహము జాతాశౌచమను హారీతునివచనము నాభిచ్ఛేదమైనపిదప మృతినొందినపక్షమున వర్తింపదగునని వారేచెప్పిరి.

శ్లో॥ గర్భేయదివిపత్తిస్స్యా ద్దశాహంసూతకంభవేత్ ॥

తా॥ గర్భమునందు శిశువునకు విపత్తిసంభవించినచో తండ్రి మొదలగువారికి పదిదినములు జాతాశౌచమని పారస్కరుడు పలికె. ఈవిషయమున మృతాశౌచమును ప్రతిపాదించెడి వచనములు ముందు దహరింపబడగలవు.

శ్లో॥ అథస్తాన్నవమాన్మాసా చ్ఛుద్ధిస్స్యాత్ప్రసవేసదా ।
మృతేజీవతివాతస్మి న్నహోభిర్మాససంఖ్యయా ॥

తా॥ తొమ్మిదవమాసమునకు లోగడ ప్రసవమైనచో శిశువు జీవించియున్నను మృతినొందినను మాససంఖ్యతోసరియగు సంఖ్యగల దినములతో శుద్ధియగు. చతుర్వింశతివచనమునుసరించి ఏడు ఎనిమిది మాసములయందు ప్రసవమైనచో వరుసగా ఏడు ఎనిమిది దినములాశౌచమని జెప్పబడినది. వైకల్పికమని మాధవీయాదులయందు వ్యవస్థ చేయబడినది కాన శిష్టాచారముననుసరించి చేయదగు. ఇట్లుముందుగా నుద్దేశింపబడిన జాతాశౌచము బాగుగా నిరూపింపబడినది. ఇందే కొన్నివిషయములైనను మరపున చెప్పబడనిచో నవి ధర్మచింతామణియందు జూడదగునని సుబ్రహ్మణ్యపండితుడువ్రాసెను.

—♦ ప్రసవాశౌచసంగ్రహము. ♦—

పితృ పితామహ ప్రపితామహులు మొదలగు వెనుకటిపురుషు లేడుగురును పుత్రుడు పౌత్రుడు మొదలగు ముందుపురుషులేడుగురును సపిండులనబడుదురు సంతానము భేదించినపుడు ఎవని మొదలుకుని రెండు మూడు తెగలు బయలువెడలెనో వాడు కూటస్థుడనబడు. కూటస్థుని మొదలుగాజేసి లెక్కించ నాయాతెగలనుండు సగోత్రులు నగు సప్తపురుషాంతరముల వారొకరికొకరు సపిండులు జ్ఞాతులు అనబడుదురు. భిన్నగోత్రులైన దౌహిత్రాదులు సపిండులు కానేరరు.

ఎనిమిదవపురుషుడు మొదలుకొని పదునాల్గవ పురుషునివరకుగల ఏక గోత్రికులు సమానోదకులనబడుదురు పదునేనవపురుషుడు మొదలు కొని ఇరువదియొకటవ పురుషుని పర్యన్తముగలవారు సగోత్రులేయన బడుదురు. పదునేనవపురుషునకు లోగడవారును "వీడు మనవంశమున జనించినవాడు" "మనమాదేవదత్తుని వంశమునబుట్టితిమి" అను జన్మ నామస్మృతులలో నొకటిలేకున్నను సగోత్రులేయగుదురు. అవివాహిత లగు స్త్రీలు కూటస్థునిమొదలు ముప్వురు పురుషులపర్యన్తము సపిం డులుపై ముప్వురు పురుషుల పర్యన్తము సమానోదకులు పిమ్మట సగోత్రులునగుదురు. అందు ప్రసవమున సపిండులకు దశరాత్రాశౌ చము. క్షత్రియులకు ద్వాదశరాత్రము. ఇట్లు వెనుక జెప్పబడిన విధ మున యాశౌచము. సంకీర్ణులలో అనులోములకు తల్లివర్ణము ననుస రించియు, ప్రతిలోములకు తండ్రివర్ణము ననుసరించియు నాశౌచనిర్ణ యము. శూద్రబీజమున జనించిన ప్రతిలోముల కాశౌచమేలేదు. మృతమున స్నానముమాత్రముజేయదగు. సమానోదకులకు త్రిరా త్రాశౌచము. క్షత్రియులు మొదలగు వారికిగూడ సమానోదకులకు త్రిరాత్రమే యాశౌచము సగోత్రులకేమియులేదు.

సూతికకు "అస్పృశ్యత" "మూడుకాడులమితిగలదూరము పరి హరింపదగుట" వీటికి కారణమగు అత్యన్తాశౌచము పదిదినములు. పిమ్మట కర్మలయందధికారము లేకయుండుటకు కారణమగు సామా న్యాశౌచము. స్త్రీజననమున మాసమును పురుషజననమున నిరువది దినములునగు. తండ్రిగృహమున పుత్రికప్రసవించినచో తలిదండ్రులకు సోదరులకు త్రిరాత్రమును జ్ఞాతులకేకరాత్రము నాశౌచము. మరియొక గృహమున ప్రసవించినచో నేమియునులేదు. తలిదండ్రుల ద్రవ్యదాన మున్నచో త్రిరాత్రముకలదని కొందరిరి. దూరమున జరిగిన పుత్రజన నమునుగాని జ్ఞాతిజననమునుగాని వినినపుడు దశాశేషమున శుద్ధియగు. పదిదినములకు పిమ్మట వినబడినచో తండ్రి సచేలస్నానము మాత్రము చేయదగు సోదరులకును జ్ఞాతులకును నేమియులేదు. సమానోదకు లకు త్రిరాత్రమధ్యను జననమువినబడినచో త్రిరాత్రశేషమునశుద్ధియగు

త్రిరాత్రానంతరము వినబడినచో నేమియునులేదు. జనించిన శిశువు నాభిచ్ఛేదమునకు పూర్వము మృతినొందినచో తల్లికి జాతాశౌచము అస్పృశ్యతయు దశరాత్రిపర్యన్తముకలదు కర్మాధికారము స్త్రీజనించినచో మాసము పురుషజననమున నిరువదిదినములు గడచువరకులేదు. తండ్రిమొదలగు జ్ఞాతులకు త్రిరాత్రిము జాతాశౌచము మరియొక పక్షమున దశరాత్రజాతాశౌచము మృతాశౌచము స్నానమాత్రమున నివర్తించు. నాభిచ్ఛేదమైన పిమ్మట శిశువు మృతినొందినచో తలిదండ్రులకును సోదరులకును జన్మదశాహశేషపర్యన్తము మృతాశౌచము అనగా జనించిన దినమున మృతినొందినచో దశరాత్రిమును రెండు మొదలగు దినములయందు మృతినొందినచో తొమ్మిది మొదలగు దశాహశేషదినము మృతాశౌచము జ్ఞాతులకు దశరాత్రము జాతాశౌచము మృతాశౌచము స్నానమాత్రమున నివర్తించు. మృతినొందిన శిశువు జనించినపుడు తల్లికి దశరాత్రిము మృతాశౌచము తండ్రి మొదలగు సపిండులకు దశరాత్రము జాతాశౌచము మృతాశౌచము స్నానమాత్రముననివర్తించు. జాతాశౌచమున సూతికకుదక్క తదితరులగు (తండ్రి మొదలగు సపిండులకు) అస్పృశ్యతలేదు తండ్రికి పుత్రిజననానంతరము జేయదగు సచేలస్నానము జేయకపూర్వమస్పృశ్యత గల్గియుండు. పిమ్మట అస్పృశ్యతలేదు. మృతశాశౌచమునందరకు నాశౌచము నివర్తించువరకస్పృశ్యతగలదు. భర్తగాని పుత్రుడుగాని జ్ఞాతిగాని తదితరుడుగాని పురుషుడుగాని స్త్రీగాని పదిదినములోగడ సూతికను స్పృశించినచో వారికిసచేలస్నానము అగ్నిస్పర్శనము ఘృత ప్రాశనము జేసిన పిదప శుద్ధిగల్గు. సూతికను స్పృశించిన స్త్రీనిగాని పురుషునిగాని స్నానాదులచే శుద్ధిగలుగకపూర్వము మరియొకడు స్పృశించినచో వానికి స్నానమాత్రమునశుద్ధి. సూతికతోగూడి శయనాసనాదికమును జేసినచో యేదినమున జేయబడెనో నాయహోరాత్రమంతయు నాశౌచము. పుట్టినశిశువునకప్పుడే జాతకర్మముజేసెడిపక్షమున తండ్రి మొదలగువారందరకు జాతకర్మ సమాప్తినొందువరకు నాశౌచములేదు. దానవిషమునమాత్ర మాదినమంతయు సూతకములేదు.

తదితరకర్మలయందు సూతకముకలదు. ఆజన్మదినమున పక్వాన్నము దక్క తదితరములనన్నిటిని దానముజేయదగు. అవిప్రతిగ్రహించుట వలన బ్రాహ్మణులకు దోషములేదు. సూతకముగలవానియింట పక్వాన్నమును భుజించినచో వానిసూతకము నివర్తించువరకు భోక్తకు గూడ నాశౌచముగలదు. అజ్ఞానవశమున సూతకాన్నమును భుజించినచో పురీషోత్సర్జనమువరకు భోక్తకాశౌచము. మరియు లఘుపదార్థముల భుజించినచో త్రిరాత్రాశౌచము భక్ష్యములు మొదలగు గురుపదార్థముల భుజించినచో నేడురాత్రులాశౌచము. ఈయాశౌచాంతమున సచేలస్నానముజేసి చాన్ద్రాయణవ్రతము నాచరింపవలయు మృతాశౌచముగలవాడు జాతాశౌచముగల వానిని సంచయనమునకు పూర్వము బుద్ధిపూర్వకముగా స్పృశించినచో సాన్తపనమును అబుద్ధిపూర్వకముగా స్పృశించినచో నర్ధసాన్తపనమును నాచరింపదగు. సంచయనమైన పిమ్మట బుద్ధిపూర్వముగ స్పృశించినచో పాదకృచ్ఛ్రమును అబుద్ధిపూర్వముగ స్పృశించనచో నేకరాత్రముపవాసమును జేయదగు. జాతాశౌచముగలవాడు మృతాశౌచముగలవానిని సంచయనమునకు పూర్వము బుద్ధిపూర్వకముగ స్పృశించినచో రెండు కృచ్ఛ్రములును అబుద్ధిపూర్వకముగ స్పృశించినచో నొకకృచ్ఛ్రమును నాచరింపదగు. సంచయనమైనపిదప బుద్ధిపూర్వకముగ స్పృశించిన పాదకృచ్ఛ్రమును అబుద్ధిపూర్వకముగ స్పృశించిన నేకరాత్రముపవాసమును జేయదగు. ద్రావిడులకు కన్యజనించుచో తలిదండ్రులకు సోదరులకు వారిపుత్రులకు పితామహునకు వానిసోదరులకుమాత్ర మాశౌచముగలదు. తదితరులకేమాత్రమును లేదు. పినతండ్రులు పెదతండ్రులు భిన్నోదరులైనచో వారికేగాని వారిపుత్రులకాశౌచములేదు. జాతాశౌచముగల వారికి నాల్గుదినములవరకస్పృశ్యత గలదని ద్రావిడశతకకారుడే చెప్పె. అట్టియస్పృశ్యతలేదని స్మృతిముక్తాఫలకారుడుచెప్పె. సూతికకు స్త్రీ జనించినచో నలుబదిదినములును పురుషుడు జనించినచో ముప్పదిదినములును ఆశౌచమనియు అంతవరకు నస్పృశ్యతగలదనియు శతకకారుడనుడివె. పదిదినములవరకే యస్పృశ్యత పిదప కర్మలయందధి

శారము లేకపోవుటమాత్రమే కలదని స్మృతిముక్తాఫలకారుడు చెప్పెను తండ్రియింట పుత్రికప్రసవించినచో నామెతలిదండ్రులకు త్రిరాత్రము. సోదరునకేకరాత్రము జాతాశౌచము జ్ఞాతులకేమియు లేదు. పదిదినములోగడ శిశువుమృతినొందినచో తలిదండ్రులకు దశాహశేషపర్యన్తము మృతాశౌచము సోదరునకు జాతాశౌచమేయగు పదవదినమునశిశువు మృతినొందినచో తలిదండ్రులకు దశాహమైన పిదప ద్విరాత్రామాశౌచము. ఆపదియవదినమునందెనిమిదవజామున శిశువు మృతినొందినచో త్రిరాత్రము మిగిలినదంతయు సమానమేయగు.

—♦ పాతాశౌచమునవిశేషము. ♦—

శ్లో॥ పాతేమృతస్యప్రసవే దశాహోన్తర్మృతౌతథా ।
శావాశౌచంతుబంధూనాం విజ్ఞాతవ్యమనేకధా ॥

తా॥ ఐదు ఆరు మాసములయందు గర్భము పతనమైనపుడును ఏడు మొదలగు మాసములయందు మృతినొందిన శిశువు జనించినపుడును ప్రసవానంతరము నాభిచ్ఛేదమునకుపూర్వము శిశువు మృతినొందినను జ్ఞాతులకు శిశుమరణనిమిత్తకమగు స్నానముమాత్రము జేయదగు మృతప్రసవమున తల్లికి పదిదినములు మరణాశౌచముకలదు. నాభిచ్ఛేదమైన పిదప శిశువు మృతినొందినచో తలిదండ్రులకును సోదరులకును జననదశాహశేషమువరకు మృతాశౌచము అనగా జన్మదినమందైనచో పదిదినములు రెండవదినమందైనచో తొమ్మిదిదినములు నిర్ణేయాహి పదగు జ్ఞాతులకు స్నానము మాత్రము చెప్పబడెను. వీరికి జాతాశౌచము వెనుకనే శెప్పబడినది.

శ్లో॥ స్త్రీణాంతుక్షతితోగర్భః సద్యాజాతోమృతోథవా।
అజాతదంతోమాసైర్వా మృతశ్షడ్భిర్గతైస్తథా॥
వస్త్రాద్యైర్భూషితంకృత్వా క్షేప్తవ్యస్సతుకాష్ఠవత్।
ఖనిత్వాతుశనైర్భూమిం సద్యశ్శౌచంవిధీయతే ॥

తా॥ స్త్రీలకు గర్భపతనమైనను జనించిన శిశువాక్షణముననే మృతినొందినను ఆరవమాసము ప్రాప్తించిన పిదప నుదన్తములు రాక

పూర్వమును శిశువు మృతినొందినను వస్త్రాదులచే నాశిశువునలంకరించి భూమినిత్రవ్వి కాష్ఠమునువలె స్థాపింపదగు. జ్ఞాతులకు సద్యశ్శౌచము అని యాదిత్యపురాణమున జెప్పబడె.

సూ॥ మృతేజాతేకులస్యసద్యశ్శుద్ధిః॥

తా॥ మృతినొందిన శిశువు జనించినచో వంశమునకు తత్కాలమునందే శుద్ధికలుగునని వృద్ధవిష్ణువచనము.

శ్లో॥ జాతేమృతేసపిండానాం సద్యశ్శుద్ధిర్విధీయతే ।
దశాహేనైవదంపత్యోః సోదరాణాంతథైవచ॥

తా॥ జనించిన శిశువు మృతినొందినచో సపిండులకు తత్కాలమునందేశుద్ధిగల్గు తలిదండ్రులకు సోదరులకు పదిదినములచే శుద్ధియగునను వ్యాఘ్రవచనము నాభిచ్ఛేదమైన పిదప మృతినొందు పక్షమున వర్తించు. ఇచ్చట పదిదినములనగా జనించిన దినము మొదలు పదిదినములు ఇచ్చట సోదరశబ్దమున భిన్నోదరులుగూడ గ్రహింపబడుదురు. సద్యశ్శౌచమనగా నెపుడు మరణము నిశ్చయింపబడునో అపుడే స్నానము జేసి శుద్ధుడగునని భావము

శ్లో॥ అంతర్దశాహేజాతస్య శిశోర్నిష్క్రమణంయది ।
సూతకేనైవశుద్ధిస్స్యాత్పిత్రోః శాతాతపోబ్రవీత్ ॥

తా॥ జనించిన శిశువు పదిదినములోగా మృతినొందినచో తలిదండ్రులకు సోదరులకు శేషించిన సూతకదినములతో శుద్ధిగల్గునని శాతాతపుడు చెప్పెనని వ్యాఘ్రుడుచెప్పె. కాన నాభిచ్ఛేదమైనపిదప శిశువు మృతినొందినచో తలిదండ్రులకు సోదరులకుగల్గెడి మరణనిమిత్తకమైన యాశౌచము సూతకదినములతో నివర్తించునని చంద్రికా మాధవీయాదులయందు వ్యాఖ్యానముజేయబడె. ఓయీ "జాతేమృతేసపిండానాం" అను వ్యాఘ్రవచనము. పదిదినముల పిమ్మట శిశువు మృతినొందినపుడు చెల్లదగు కాదేని "గర్భస్థేప్రేతేమాతుశ్శేవస్యాదాశౌచం జాతఉభయోః కృతేనామ్నిసోదరాణాం భిన్నోదరాణామప్యేవం శిశువు గర్భమునందుండియే మృతినొందినచో తల్లికి మాత్రమే

యాశౌచము. జనించి మృతినొందినచో తలిదండ్రులకు నామకరణా నంతరము మృతినొందిన సోదరులకు భిన్నోదరులకు నాశౌచమను పైంగునివచనము నామకరణకాలమునగు పదునొకండవదినము మొదలు కొని సోదరులకు మృతాశౌచమును విధించుచున్నది. కాన యీ రెం టికి విరోధముగల్గు కావున సోదరులకు తండ్రితోసమముగ నాశౌచ మును విధించు వ్యాఘ్రవచనము పదిదినములపైన శిశువు మృతినొం దినపక్షముననే వర్తింపదగుగాని నాభిచ్ఛేదమైనపిదప పదిదినములలో .మృతినొందినపక్షమున వర్తింపదగదను వాదమసమంజసము ఎట్లన.

శ్లో॥ జాతమాత్రేమృతేచాపి దశాహాత్పితరౌశుచీ।
కృతేనామ్నిసనాభీనాం దశరాత్రమఘంభవేత్ ॥
భిన్నోదరాణాంభ్రాతౄణాం జాతదంతేమృతేత్వఘం।
దశాహంకృతచౌలేతు దత్తాదీనాంవిధీయతే ॥

తా॥ జనించినతోడనే శిశువు మృతినొందినచో తలిదండ్రులకు పదిదినములాశౌచము నామకరణమైన పిదప మృతినొందినచో సోదరు లకు పదిదినములాశౌచము దంతములు జనించినపిదప మృతినొందినచో భిన్నోదరులగు అన్నలకు దశాహమృతాశౌచము చూడాకర్మమైన పిదప మృతినొందినచో దత్తులు మొదలగు జ్ఞాతులకాశౌచము విధింప బడెనను బృహస్పతివచనముతో పైంగవచనమునకు విరోధము గలుగు చున్నదికాన దంతములు జనించిన పిదప మృతినొందినపుడే పైంగవచ నము వర్తించునని చెప్పవలసివచ్చును ఏలనన ఈబృహస్పతివచనమున భిన్నోదరులకు దంతములు జనించిన పిమ్మటనే మృతాశౌచము విధింప బడె ఆయాకాలముల నుదహరించుచు వారివారికాశౌచమును విధిం చిన పైంగవచనము ప్రమాణము అందు "కృతేనామ్ని" అని నామ కరణానంతరము సోదరభిన్నోదరులకు మృతాశౌచమును విధించుట వలన మరియొకకాలమున నిది వర్తింపదగునని దగదనినచో అట్లైన "జాతేమృతే" అను వ్యాఘ్రవచనము జననమైనవెంటనే శిశువు మృతి మృతినొందినపుడు సోదరులకు మృతాశౌచమును విధించుచున్నదికాన

నిదియు మరియొకకాలమున వర్తింపదగుననుట యసమంజసము కాన నీ వ్యాఘ్ర, పైంగ, బృహస్పతి వచనములు మూటికి వికల్పము కాన వారివారి యాచారముననుసరించి యాచరింపఁదగు. అందు ఆన్ధ్రులు వ్యాఘ్రవచనముననుసరించి దశాహమధ్యమున శిశువుమృతినొందినచో తలిదండ్రులు సోదరులు దశాహశేషపర్యన్తమాశౌచము నాచరింతురు పదిదినములకు పిమ్మటనేమృతినొందిన త్రిరాత్రముమాత్రమాచరింతురు.

ద్రావిడులు దశాహమునకుపిమ్మట మృతినొందినచో సోదరులు మృతాశౌచమునాచరింతురు. దశాహమధ్యయందైనచో జాతాశౌచమునుమాత్రమాచరింతురు. అందును కొందరు తమతమ కులాచారమున బృహస్పతివచనానుసారముగ భిన్నోదరులగు అన్నదమ్ములు దంతజననమైన పిమ్మటనే మృతాశౌచమును దశాహమాచరింతురు. కాన ఆయాదేశము కులము, ధర్మము, వీటిననుసరించి యాచరింపదగునని నిర్ణయము "శిశువు గర్భమునందే మృతినొందిన తల్లికిమాత్రమా శౌచము" అను పైంగవచనమునకీక్రింద జెప్పబడిన యర్థముజెప్పదగును. మృతప్రసవాదినిమిత్త భేదములననుసరించి తల్లి మొదలగు వారికి వ్యవస్థాపూర్వకముగ విధింపబడినయాశౌచము మృతాశౌచమే కాదగును. జాతాశౌచమగుచో నది తండ్రి మొదలగు వారికిగూడ సాధారణమైయుండ "తల్లికిమాత్రమేయగు"నని నిది మొదలగు వ్యవస్థాపూర్వకములగు విధులు సంగతములుకానేరవు. బృహస్పతివచనమునందలి "సనాభి" శబ్దమునకు సోదరభ్రాతలు అని యర్థము. దత్తుఁడు మొదలగు పుత్రులకు శిశువు చౌలకర్మమైనపిదప మృతినొందినపుడు దశాహము విధింపబడిన యాశౌచము. దానము మొదలగువానిచే పుత్రుని పరిగ్రహించినపిదప జనించిన యౌరసభ్రాతమృతినొందినసందర్భమున కాదగునని తెలియదగు ఆంధ్రులకీసందర్భమున తుల్యన్యాయమున త్రిరాత్రమేయగులు.

శ్లో॥ దశాహాన్తర్మృతేబాలే శుద్ధిస్స్యాజ్జన్మనాసహ॥

తా॥ పదిదినములలోగా శిశువు మృతినొందినచో జన్మదశాహముతో శుద్ధియని శంఖుఁడుచెప్పె లేక జ్ఞాతులకుగల జననాశౌచము నివర్తించుసరికి తలిదండ్రులకు మృతాశౌచమునివర్తించును.

సూ॥ సూతకేచోత్థానాదాశౌచం ॥

తా॥ సూతకము నివర్తించులోఁగడ శిశువు మృతినొందినచో సూతకమునివర్తించుపర్యన్తమే మృతాశౌచము అని యాపస్తంబుడు పలికె. పదవదినమున శిశువు మృతినొందినచో నాదినముమాత్రమే యాశౌచము పగటిభాగము విస్తారముగా నతిక్రమించిన పిదప యగుచో రెండుదినములు. ప్రభాతకాలమునయగుచో మూఁడుదినములునను విశేషము చన్ద్రికయందు జెప్పఁబడె.

శ్లో॥ సూతకాన్తస్తుజాతస్య మృతౌశిష్టాహమిష్యతే।
పితుస్తుద్వ్యహమన్త్యాహే తత్ప్రభాతేత్ర్యహంభవేత్ ॥

తా॥ జనించిన శిశువు జాతాశౌచము గడచుటకులోఁగడ మృతినొందినచో శేషించినసూతకదినములతో మృతాశౌచమునివర్తించును తండ్రికిమాత్రము పదవదినమందైనచో రెండుదినములును ఆ ప్రభాతముననైనచో మూఁడుదినములును మృతాశౌచము అను శతకకారుని వచనము దశాహమధ్యమున శిశువు మృతినొందినచో తలిదండ్రులకు పూర్ణాశౌచమైనను.

శ్లో॥ సూతకేనైవశుద్ధిస్స్యాత్పిత్రోశ్శాతాతపోబ్రవీత్ ॥

తా॥ అనువచనబలమున చెప్పబడె ఇచ్చట సోదరులకీయాశౌచములేదు "కృతేనామ్ని సోదరాణాం" అనువచనమున దశాహానంతరముననే సోదరులకు మృతాశౌచము విధింపబడె. ఇది ద్రావిడునిచే జెప్పబడెగాన ద్రావిడులవిషయమున చెల్లదగు. చంద్రికాదులయందు "కృతేనామ్ని సోదరాణాం" అనువచనము మరియొకరీతిగ వ్యాఖ్యానము జేయబడినది.

సూ॥ ఆసూతకోత్థానాదాశౌచంసూతకవత్ ॥

తా॥ అను పారస్కరవచనమునకు పదిదినములకులోఁగడశిశువు మృతినొందినచో సూతకము నివర్తించువరకు శిశుమరణనిమిత్తకమగు ఉదకదానాదులతో నిమిత్తములేని మృతాశౌచముకలదను నర్థము విజ్ఞానేశ్వరాదులచే వర్ణింపబడె.

శ్లో॥ దశాహాభ్యన్తరేబాలే ప్రమీతేతస్యబాన్ధవైః ।
శావాశౌచంనకర్తవ్యం సూత్యాశౌచంసమాచరేత్ ॥

తా॥ శిశువు దశాహమునకులోగడ మృతినొందినచో వానిబంధువులు శావాశౌచము నాచరింపదగదు. జాతాశౌచము నాచరింపదగునను వృద్ధమనువచనము జ్ఞాతులవిషయమునవర్తించు.

శ్లో॥ దశాహాభ్యన్తరేబాలః కదాచిత్ మ్రియతేయది ।
శావాశౌచంనకర్తవ్యం సూత్యాశౌచంవిధీయతే ॥

తా॥ ఒకానొకప్పుడు శిశువు పదిదినములకులోగడ మృతినొందినచో శావాశౌచములేదు. జాతాశౌచము విధింపబడుచున్నదని యముఁడుచెప్పె అనగా మృతాశౌచము స్నానమునవర్తించు ఈసందర్భమున కొందరు,

—♦ సద్యశ్శబ్దార్థనిరూపణము. ♦—

శ్లో॥ సూతిమధ్యేమృతేబాలే శావంసద్యఃపరాకృతం ॥

తా॥ పదిదినములోగడ శిశువు మృతినొందినచో సద్యస్కాలమున శావాశౌచము నివర్తించునను ప్రాచీనషడశీతివచనమునకు వ్యాఖ్యానమున సద్యశ్శబ్దము అహస్సును బోధించునని ప్రతిపాదించుటవలన అస్తమయపర్యన్తమాశౌచము నవలంబించుచుండిరి కొందరు "ఏకత్రనిర్ణీతశ్శాస్త్రార్థః" ఒకచోట నిర్ణయింపబడిన శాస్త్రార్థమాశాస్త్రమందంతటను చెల్లునను న్యాయముననుసరించి "అదన్తజన్మనస్సద్యః" అను నిది మొదలగు వచనముల విషయమునగూడ సూర్యాస్తమయపర్యన్తమాశౌచము నాచరించుచుండిరి.

శ్లో॥ గర్భేయదివిపత్తిస్స్యాద్దశాహంసూతకంభవేత్ ।
మృతకేస్నానతశ్శుద్ధి స్సపిండానాంవినిశ్చయః॥
నాభికృన్తనతఃపశ్చాద్దశాహంసూతకంభవేత్ ॥

తా॥ ఎవరు దశాహములోగా శిశువుమృతినొందినవిషయమున సద్యశ్శబ్దమునకు పగలు అను యర్థము నంగీకరించిరో వారికి మృతప్రసవమునందుపదిదినములు సపిండులకుజాతాశౌచము. మృతాశౌచము

స్నానమున నివర్తించు. నాభిచ్ఛేదమైన పిమ్మట శిశువు మృతినొందిన సపిండులకందరకు పదిదినములు జాతాశౌచము.

శ్లో॥ నాభికృన్తనతఃపూర్వం శిశోర్నిష్క్రమణంయది।
జాతాశౌచంతుసర్వేషాం త్రిరాత్రమితినిశ్చయః॥
సద్యశ్శుద్ధిస్తుమృతకే పిత్రాదేఃపూర్ణముచ్యతే।
పిత్రోస్తుమరణాశౌచం సద్యఏవసపిండవత్ ॥

తా॥ నాభిచ్ఛేదము కాకపూర్వము శిశువు మృతినొందినచో సపిండులకు త్రిరాత్రము తలిదండ్రులకు సోదరులకు పూర్ణముగాను జాతాశౌచము. మృతాశౌచము వీరందరకు స్నానముననే నివర్తించు నను పారస్కరవచనముతో విరోధముగలుగు నెట్లన ఇచట 'సద్యః' అను శబ్దమునకు వెంటనే స్నానశబ్దము ప్రయోగింపబడెను. నాభిచ్ఛేదమునకు పూర్వము శిశువు మృతినొందినపుడు తలిదండ్రులకును సోదరులకును పూర్ణాశౌచవిధివైకల్పికమని తెలియవగు. అట్లేయాచార మచ్చటచటకనబడు మరియు సద్యశ్శబ్దమునకు 'అహస్సు' అనియర్థము జెప్పినచో,

శ్లో॥ బాలేదేశాన్తరస్థేచ పతితేచయతౌమృతే।
సద్యశ్శౌచంయథేచ్ఛాతో జలాగ్న్యుద్బంధనాదిషు॥

తా॥ శిశువు, దేశాన్తరమున నున్నవాడు, పాపాత్ముడు యతి బుద్ధిపూర్వముగ నీరు, అగ్ని, ఉరి మొదలగువానివలన బలవన్మృతి నొందినవారు వీరిమరణమున సద్యశ్శౌచము అనగా స్నానమున తత్కాలమందే శుద్ధి యను పరాశరవచనమునకు విరోధము ఎట్లన ఇచ్చట సద్యశ్శబ్దమునకు పగలు అని యర్థము చెప్పుట యసంభవము కావున శిశుమరణసందర్భమునగూడ సద్యశ్శబ్దమునకు తత్కాలము అనియే యర్థముచెప్పవలయు నట్లుకాక పగలు అను నర్థము జెప్పినచో దేశాన్తరమరణమునగూడ పగలు అనియర్థము జెప్పవలసివచ్చును అదియూ కిష్టాపత్తియేయనిన "స్నాత్వాదేశాన్తరేశుచిః" దేశాన్తరమున నున్నవాడు మృతినొందినపుడు స్నానముచేత శుద్ధుడగునను ప్రాచీనమడశీతి

వచనమునకు విరోధము మరియు యతిమరణమునందును దుర్మరణమందును ఒక పగలాశౌచమనవలసివచ్చును. అది యిష్టాపత్తియనినచో స్నానమాత్రమును విధించెడి యనేకస్మృతులకును ఆచారమునకును విరోధము ఎట్లన యతి మృతినొందినపుడెచ్చటను ఎవ్వరును జ్ఞాతులు ఒక పగలు ఆశౌచము నాచరింపరు అదియునుగాక,

శ్లో॥ సద్యశ్శౌచేతుతావత్స్యా దాశౌచంసంస్థితస్యతు॥
యావత్స్నానంకుర్వంతి సచేలంబాన్ధవాబహిః ॥

తా॥ సద్యశ్శౌచము చెప్పబడినతావున బంధువులు సచేలస్నానముచేయువరకు వారికి మృతాశౌచమను యంగిరసుని వచనమునకు విరోధము అచట సద్యశ్శౌచమనగా తత్కాలమున జేయబడు స్నానమునగలుగు శుద్ధియని వ్యాఖ్యానముజేయబడె. విజ్ఞానేశ్వరుని వ్యాఖ్యానమునకుగూడ విరోధము. ఆ విజ్ఞానేశ్వరుడు దశాహమధ్యమున శిశువు మృతినొందినచో జ్ఞాతులకు జాతాశౌచమునుజెప్పి పిమ్మట ఈ క్రిందివిధముగజెప్పె. "వృద్ధవిష్ణునిచే జెప్పబడిన "జాతేమృతేమృతేజాతేవాకులస్యసద్యశ్శుద్ధిః" అను వచనము శిశుమరణనిమిత్తకమైన యాశౌచమునుగూర్చి స్నానమున నివర్తించునని ప్రతిపాదించుచున్నదిగాని ప్రసవనిమిత్తకమగు ఆశౌచమునుగూర్చికాదు" అని ఎవరు "ఆదంతజన్మనస్సద్యః" అను నిది మొదలగు ఆశౌచప్రకరణమునందంతటను సద్యశ్శబ్దమునకు పగలు అని యర్థమని తలచెదరో వారలకు,

శ్లో॥ అనుజాతస్యతావత్స్యా దాశౌచంసంస్థితస్యతు ।
యావత్ స్నానంనకుర్వంతి సచేలంబాన్ధవాబహిః ॥

తా॥ దన్తములురాని శిశువు మృతినొందినచో బంధువులకు సచేలస్నానము చేయువరకుమాత్రమేయాశౌచము అను అంగిరసుని వచనమునకు విరోధము.

శ్లో॥ ఋత్విజాందీక్షితానాంచ యజ్ఞీయంకర్మకుర్వతాం ।
సత్రివ్రతిబ్రహ్మచారి దాతృబ్రహ్మవిదాంతథా ॥
దానేవివాహేయజ్ఞేచ సంగ్రామేదేశవిప్లవే ॥
ఆపద్యపిచకష్టాయాం సద్యశ్శౌచంవిధీయతే॥

తా॥ యజ్ఞసంబంధమగు కర్మను జేయుచున్న దీక్ష బూనిన ఋత్విక్కులకును యజ్ఞదీక్షబూనిన యజమానులకున్ను వ్రతస్థులకును బ్రహ్మచారులకును దాననిరతులకును బ్రహ్మవేత్తలకును దానమునందును వివాహమునందును యజ్ఞమునందును యుద్ధమునందును దేశోపద్రవమునందును కష్టమగుఆపత్తునందును సద్యశ్శౌచము అను యాజ్ఞవల్క్యాదులవచనములకును విరోధము ఎట్లన కర్మలోపము కాకుండుటకై యజ్ఞదీక్షితులగు ఋత్విక్కులకు యజమానునకు సద్యశ్శౌచము జెప్పబడె. ఇచట సద్యశ్శబ్దమునకు పగలు అనియర్థమును జెప్పినచో నాదినమున ప్రవర్గ్యములు ఉపసదము మొదలగు కర్మకలాపమునకు లోపమేగలుగును కాన సద్యశ్శబ్దమునకు తత్కాలమని యర్థము. మరియు.

శ్లో॥ శిల్పినఃకారవోవైద్యాః దాస్యాదాసాశ్చనాపితాః ।
రాజానోరాజభృత్యాశ్చ సద్యశ్శౌచాఃప్రకీర్తితాః ॥

తా॥ కంసాలి, చాకలి, వైద్యుడు, దాసి, దాసుడు, మంగలి, రాజు వానిభృత్యులు వీరికి సద్యశ్శౌచము అను నివి మొదలగు బహు స్మృతివచనములకు విరోధము ఇచట సద్యశ్శబ్దమునకు పగలు అని యర్థమును జెప్పినచో వైద్యునకేదినమున యాశౌచము గల్గెనో యాదినమున దోషజ్వరాదులతోఁగూడినవానికి ధాతుపరీక్షాదులుచేయుటకు వీలులేక ప్రాణాంతకముకావలసివచ్చును ఇట్లే రాజునకు రాజభృత్యులకు యుద్ధముతటస్థించినపుడు ఆశౌచదినమునందు యుద్ధయాత్రారంభమున జేయదగిన హోమము ఇష్టదేవతాప్రార్థనము బ్రాహ్మణాశీర్వాదపరిగ్రహము మొదలగునవి చేయదగవు కాన యుద్ధము మానవలసివచ్చును. అపుడు దాసీనుడైన యారాజు శత్రువులచేహతుడగు కాన స్మృతివచనములయందు సద్యశ్శబ్దమునకు వెంటనే స్నానశబ్దమును ప్రయోగించుటవలనను కొన్నిస్మృతివచనములయందు సద్యః అను శబ్దమునకు తత్కాలమనుటయందు తాత్పర్యమని నిర్ణయించుటవలనను అంగిరసుని వచనమునందుగూడ సద్యశ్శబ్దము తత్కాలపరమని వ్యాఖ్యానము జేయుబడుటవలనను విజ్ఞానేశ్వరుడు మొదలగువారిచేగూడ

నిష్టి వ్యాఖ్యానము చేయబడుటచేతను సద్యశ్శబ్దమునకు ఆశౌచపరిక రణమునందంతటను తత్కాలముఅనియే అర్థము.

పైనచెప్పబడినవిధమున అనేకస్మృతులతోడ విరోధమును లోక మున సుప్రసిద్ధములగు ప్రౌఢనిబంధములు వ్యాఖ్యానములు మొదలగు వానితో విరోధమునున్ను ఆదరింపక ఊరును పేరునులేని ప్రాచీనషడ శీతి వ్యాఖ్యానకర్తయగు యొకానొకని యజ్ఞతయేకారణముగాగలిగి నట్టియు అప్రమాణమగు వ్యాఖ్యానము నవలంబించి స్మృతిపరిజ్ఞానము లేని కొందరు సద్యశ్శబ్దమునకు దినము అని యర్థమని భ్రమపడిరి. ఆ భ్రమననుసరించియే వారియాచరము అట్టి యీ యాచారము జాత్యంధుడగు వానికి రుచించిన రుచింపవచ్చును.

ఓయీ శ్లో॥ ద్విసన్ధ్యంసద్యఇత్యాహు స్త్రిసన్ధ్యమహ రేవతు ।
ద్విదినారాత్రిరేకాచ పక్షిణీత్యభిధీయతే॥

తా॥ రెండు సన్ధ్యలకాలము "సద్యః" అనఁబడు మూడుసన్ధ్యల కాలమహస్సనఁబడు రెండుదినములు నొకరాత్రియుగలకాలము పక్షిణి యనబడు అనుశ్లోకమున సద్యశ్శబ్దమునకు పగలు అనినిర్వచనముకలదు అనినచో ఆహా ఇట్టి పూర్వపక్షమును జేసెడి పండితసార్వభౌముఁడు నా భాగ్యవశమునలభించె. సద్యశ్శబ్దమునకు పగలు అను నర్థము కల్గియు న్నమాత్రమున నంతటను నాయర్థమునే కల్పించెడి యీపశుప్రాయుడు భుజించుచున్న బ్రాహ్మణులచే సైన్ధవము తెమ్మని యడుగబడినవాడై సైన్ధవశబ్దమునకు లవణమను నర్థమేగాక గుఱ్ఱమను నర్థముగూడ గల్గి యున్నందున గుఱ్ఱను పంక్తిమధ్యకు తేగలడు.

కావున నానార్థములగు శబ్దములకర్థవిశేషనిర్ధారణ జేయనేర నట్టియు శబ్దవ్యుత్పత్తి మర్యాదనెరుగని యీతని సమాధానపరచుట యశక్యము ఓయీ సద్యశ్శబ్దమునకు పగలనెడి యర్థముగాక మరియొక యర్థమున్నచో నీవనినిష్టియగు కాని సద్యశ్శబ్దమునకు తత్కాలము అను నర్థముగలదనుటకు ప్రమాణమే లేదు. నీచే యుపన్యసింపబడిన ప్రమాణములు స్మృతివచనరూపము లగుటవలన శక్తిగ్రాహకములు

కానేరవు. కాన శక్తిగ్రాహకమగు కోశము మొదలగు లౌకికప్రమాణమును జూపవలయుననినచో, ఆహా ఎంతకష్టము సర్వసాధారణముగ బాలురచేతగూడ చదువబడు కోశమునుగూడ నెరుగని నీతో మాకు వివాదము కల్పించిన భగవంతునేమనవచ్చు, "సద్యస్సపదితత్క్షణే" అను కోశము సద్యశ్శబ్దమునకు తత్కాలము అను నర్థమును బోధించుట యందు శక్తిగలదనియు ఘోషించుచున్నది. క్షణమనగా ముహూర్తమున పండ్రెండవభాగము అది మృతశ్రవణానంతరము సచేలస్నానము జేయుటకు సరిపోవును. ఈయమరకోశము విశ్వనిఘంటువు మొదలగు వానికంటె మిక్కిలి యుత్కృష్టమైనది.

శ్లో॥ పాణిన్యమరజైనేన్ద్రాజయన్త్యష్టాదిశాబ్దికాః ॥

తా॥ అను నభియుక్తవచనమున ఆదిశాబ్దికులయందు వ్యాకరణ సూత్రకర్తయగు పాణినితో సమముగ పరిగణింపబడిన యమరసింహునిచే వ్రాయఁబడిన యీకోశమే అర్థనిర్ణయముకొరకందరిచేతను పరిగ్రహింపబడు. ఈకోశమునకు వైయాకరణసార్వభౌములగు భట్టోజీదీక్షితుడు మొదలగు అనేకులచే వ్యాఖ్యానములు రచింపబడినవి. దీని ప్రచారముచేతనే విశ్వకోశము మొదలగు కోశాన్తరముల ప్రచారము పలచనైనది. కాన యీకోశముచంను ప్రసిద్ధమగు సద్యశ్శబ్దమునకు తత్కాలము అను నర్థమును వ్యుత్పన్నుడగు వాడాక్షేపింపనేరడు.

ఓయీ సద్యఃపరుత్పరాత్ అను వ్యాకరణ సూత్రమునందు భాష్యకారునిచే అహస్సు చెప్పబడునపుడుద్యన్ప్రత్యయము విధింపబడినది కాన నీవనినట్లుకానేరదనిన ఈసూత్రమునందే సప్తమ్యాఃకాలే అనిగూడ అనువర్తించునని వృత్తిమొదలగువానియందు జెప్పబడుట వలన తత్కాలము అను నర్థమును సద్యశ్శబ్దమునకు సిద్ధించు. అమరకోశవ్యాఖ్యానమునగూడ సద్యశ్శబ్దమునకు దినము తత్కాలము అను అర్థద్వయమును దానిని బలపరచెడి ప్రయోగభేదమును చెప్పబడె. కాని విచారింపగా తత్కాలముఅను నర్థమునందే విస్తారముగ ప్రయోగములు కన్పట్టు ఎట్లన.

శ్లో॥ కశ్చిద్ద్విషత్ఖడ్గ హృతోత్తమాంగ స్సద్యోవిమాన ప్రభుతాముపేత్య। వామాంగసంసక్తసురాంగనస్స్వం నృత్యత్కబంధంసమరేదదర్శ॥

తా॥ రెండు సైన్యములు కలియబడి యుద్ధము జేయుటలో నొకానొకడు శత్రువుయొక్క ఖడ్గముచే నరుకబడిన శిరస్సుకలవాడై తత్కాలమున విమానాధిపతియై వామాంగమునకలసియున్న దేవతాంగనకలవాడై యుద్ధరంగమున నృత్యముజేయుచున్న తనశిరములేని శరీరమునుచూచెను. ఇది మొదలగు సందర్భముల సద్యశ్శబ్దమున దినము అని యర్థము జెప్పుట మిక్కిలి యసంగతము. లౌకికప్రమాణమును వెదకుచుంటివి కాన నీనమ్మికకొఱకు లౌకికప్రమాణమును చూపితిని. ఆర్షప్రమాణము వెనుకనే మాచేనుదహరింపబడె కాన సద్యశ్శబ్దమునకు తత్కాలము అను నర్థముగలుగుటలో వివాదముతగదు. "తుష్యతుదుర్జనః" దుర్జనుడే సంతసించునుగాక అను న్యాయము ననుసరించి తత్కాలమను నర్థములేకుండునుగాక యినను ఆశౌచవిషయకములగు స్మృతివచనములతోటిన్నీ విజ్ఞానేశ్వరుడు మొదలగువారి వ్యాఖ్యానములతోటిన్నీ విరోధమును పరిహరించుటకొఱకు లక్షణావృత్తిచేతనైనను సద్యశ్శబ్దమునకు తత్కాలము అను నర్థము చెప్పదగు.

—♦ దశాహాసూర్ధ్వశిశుమరణాశౌచ అనుపనీతాశౌచ నిర్ణయః ♦—

శ్లో॥ అర్వాగుపనయాత్పిత్రోః భ్రాతౄణాంచదినత్రయా।
అర్వాగ్దన్తోద్గమాచ్చౌలా త్తథోపనయనాత్క్రమాత్ ॥
సద్యోదినంత్రిరాత్రంచ సపిండానాంప్రకీర్తితం ।
దహనేతుత్రిరాత్రంస్యా దాశౌచమపిగోత్రిణాం॥
అజాతదన్తదహనే త్యాగేచైకాహమిష్యతే।
అతిక్రాన్తంతూపనయా దర్వాఙ్నాస్త్యేవకస్యచిత్ ॥

తా॥ జనించిన పిదప పదిదినములతిక్రమించిన పిదప నుపనయనముగులోగా బాలుడు మృతినొందినచో ఖనన త్యాగ దహనములను సంస్కారములలో నేదియైనను తలిదండ్రులకును సోదరులకును త్రిరాత్రాశౌచము జ్ఞాతులకు మాత్రము దన్తములు రాకపూర్వము ఖన

నముచేసెడిపక్షమున స్నానమాత్రము. అటుపిమ్మట చౌలమునకు లోగానైనచో నేకరాత్రము. అటుపిమ్మట నుపనయనమగులోగానైన చో త్రిరాత్రము దహనము జేసెడి పక్షమున దన్తములు రాకపూర్వము ఏకరాత్రమును. అటుపిమ్మట త్రిరాత్రమును చెప్పబడె. దన్తములు వచ్చిన శిశువునకు త్యాగమను నొకసంస్కారమును జెప్పగలము. ఆసంస్కారము జేయబడినచో నేకరాత్రము దన్తజననము చౌలము అను నీశబ్దములగ్రహించుట ఆయాకాలములకు ఉపలక్షణము అనగా దన్తములువచ్చుట మొదలగు క్రియలు లేకపోయినను ఆయాకాలములు ప్రాప్తించినచో నాయా యాశౌచము కాదగును ఉపనయమునకు పూర్వము బాలుడు మృతినొందినచో తండ్రి మొదలగు వారందరకును అతిక్రాన్తాశౌచము లేదు.

శ్లో॥ యదినామక్రియాపూర్వం పంచత్వంహిసగచ్ఛతి।
గర్తఏవోపగూహ్యైనం స్నానాచ్ఛుధ్యంతిగోత్రిణః ॥
ఊర్ధ్వంనామక్రియాయాస్తు బాలోయదిభవేన్మృతః।
సద్యశ్శుద్ధిస్సపిండానాం భూమావిఖననేకృతే ॥
దహేద్వాకాష్ఠవత్ బాలం క్షిపేదేవాహమేవహి।
చౌలేకృతేఽకృతేవాపి జాతదన్తోమృతోయది ॥
ఆత్రివర్షాత్తుదహనే త్రిరాత్రేణవిశుద్ధ్యతి।
ఖననేనైకశుద్ధి స్సపిండానాంవినిర్ణయః ॥
తథాచాకృతచౌలస్య త్రివర్షాదూర్ధ్వపనాయనం ।
ఆశౌచంతుత్రిరాత్రంస్యా త్పిత్రోశ్చైవతుసర్వదా ॥

తా॥ శిశువు నామకరణమునకు పూర్వము మృతినొందినచో నాశిశువును గోతియందుపూడ్చి స్నానముచేయుటవలన జ్ఞాతులు శుద్ధులగుదురు. నామకరణమైన పిదప మృతినొందినచో భూమియందు పూడ్చినపక్షమున సపిండులకు స్నానమునశుద్ధి దహనమును జేసినపక్షమున నొకదినమాశౌచము. చౌలకర్మచేయబడినను లేకున్నను దన్తములు వచ్చినపిదప మూడువత్సరములలోగా మృతినొందినచో దహనము జేసినపక్షమున త్రిరాత్రమును ఖననము జేసిన పక్షమున నొక

రాత్రియు సపిండులకాశౌచము. చౌలకర్మమైనపిదప మూడుసంవత్సర ములతరువాత యుపనయనమగులోగా మృతినొందినచో జ్ఞాతులకు త్రిరాత్రాశౌచము తలిదండ్రులకీస్థితులన్నిటియందును త్రిరాత్రాశౌచము అని జమదగ్నివచనము.

శ్లో॥ నిరస్యతుపుమాన్ శుక్లముపస్పృశ్యవిశుద్ధ్యతి ।
బైజికాదపిసంబంధా దనురుంధ్యాదఘం త్ర్యహం ॥

తా॥ పురుషుఁడు శుక్లమును విడచినచో స్నానమున శుద్ధుడగు జన్యజనకభావమను సంబంధమువలన త్రిరాత్రాశౌచము అని మనువు చెప్పె ఈవచనమునకు "వయస్సుయొక్క తారతమ్యముతో నిమిత్తము లేకయే జన్యజనకభావమను సంబంధముమాత్రముననే తలిదండ్రులకు త్రిరాత్రాశౌచమని విజ్ఞానేశ్వరాదులచే వ్యాఖ్యానముజేయబడె.

సూ॥ బాలానామజాతదన్తానాంత్రిరాత్రేణ ॥

తా॥ దన్తములురాని బాలురు మృతినొందినచో త్రిరాత్రమాశౌచమని కశ్యపుడుచెప్పె. ఇది మాతాపితృవిషయమని విజ్ఞానేశ్వరాదులచే వ్యాఖ్యానముచేయబడె.

సూ॥ బాలేవాజాతదన్తేవాత్రిరాత్రం॥

తా॥ దన్తములు వచ్చినను రాకున్నను బాలమరణమున తలిదండ్రులకు త్రిరాత్రిమే యాశౌచమని వైవస్వతుడుపల్కె.

సూ॥ అకృతచౌలకానాంత్రిరాత్రం ॥

తా॥ చౌలకర్మకాని బాలుడు మృతినొందినపుడు తలిదండ్రులకు త్రిరాత్రాశౌచమని పైఠీనసిచెప్పెను.

శ్లో॥ అవిశేషేణవర్ణానా మర్వాక్సంస్కారకర్మణః ।
త్రిరాత్రేణభవేచ్ఛుద్ధిః కన్యాస్వహ్నావిధీయతే ॥

తా॥ సామాన్యముగ నన్నివర్ణములయందును సంస్కారకర్మ (ఉపనయనాదికము) కాకపూర్వము బాలుడు మృతినొందినచో త్రిరాత్రమును బాలిక మృతినొందినచో నేకరాత్రమును ఆశౌచమని యాది పురాణవచనము ఏకరాత్రాశౌచము దన్తములురాని కన్యవిషయము

ఈ త్రిరాత్రాశౌచమును విధించు వచనములన్నియు తలిదండ్రులు సోదరులు వీరినిగూర్చి చెప్పబడెనని తెలియదగును.

శ్లో॥ త్రిరాత్రందశరాత్రంవా శావమాశౌచమిష్యతే।
ఊనద్వివర్షఉభయో స్సూతకంమాతురేవహి ॥

తా॥ రెండువత్సరములకు కొంచెము లోబడిన వయస్సుగల బాలుడు మృతినొందినచో తలిదండ్రులకు త్రిరాత్రముగాని దశరాత్రముగాని శావాశౌచము సూతకము తల్లికేగాని తదితరులకు లేదను యాజ్ఞవల్క్యవచనము. అనుపనీతుడుమృతినొందినచో తలిదండ్రులకు దశరాత్రాశౌచము నాచరించుచున్న ద్రావిడ దేశమున మాత్రము వర్తింపదగు. కాని చంద్రికయందీవచనము రెండువత్సరములకు కొంచము తగ్గిన వయస్సుగలవాని మరణమున త్రిరాత్రమునువిధించుటయే యభిప్రాయముగాగలదని వ్యాఖ్యానముజేయబడె నైనను విజ్ఞానేశ్వరునిచే దశరాత్రాశౌచమును విధించుటయే నీ వచనాభిప్రాయమని వ్యాఖ్యానముజేయబడుటచే నిట్లుజెప్పవలసె ఇకజ్ఞాతులవిషయము.

శ్లో॥ అజాతదన్తే బాలేతు సద్యశ్శౌచంవిధీయతే ।
అహోరాత్రా త్తదాశుద్ధి ర్బాలేత్వకృతచౌలకే॥
తథైవానుపనీతేపి త్రిరాత్రముపదిశ్యతే ॥

తా॥ దన్తములురాని బాలుడు మృతినొందినచో సపిండులకు స్నానమునశుద్ధి. అటుపిమ్మట చౌలకర్మయగులోగా మృతినొందినచో నొకరాత్రింబవలును అటుపిమ్మట ఉపనయనమగులోగా మృతినొందినచో త్రిరాత్రమును ఆశౌచము అనిశంఖవచనము.

శ్లో॥ ఆదన్తజన్మనస్సద్య ఆచౌలాన్నైశికీస్మృతా।
త్రిరాత్రమావ్రతాదేశా ద్దశరాత్రమతఃపరం॥

తా॥ దన్తములు వచ్చుటకు లోగడ శిశువు మృతినొందినచో స్నానమునశుద్ధి పిమ్మట చౌలకర్మమగువరకు ఏకరాత్రము అటుపిమ్మట ఉపనయనమగువరకు త్రిరాత్రము అటుపిమ్మట దశరాత్రమును ఆశౌచమని యాజ్ఞవల్క్యమహర్షి చెప్పెను.

శ్లో॥ ఆదన్తజన్మనస్సద్య ఆచౌలాదేకరాత్రకం।
త్రిరాత్రముపనీతేః పాగ్దశరాత్రమతఃపరం ॥

తా॥ దన్తములువచ్చులోగా శిశువు మృతినొందినచో స్నానమునశుద్ధి అటుపిమ్మట చౌలకర్మమగులోగా నేకరాత్రము అటుపిమ్మట ఉపనయనమగులోగా త్రిరాత్రము పిమ్మట దశరాత్రమును మృతాశౌచమని వ్యాసుడుచెప్పెను. దహనము జేసినపక్షమున చౌలమునకు లోగడగూడ జ్ఞాతులకు త్రిరాత్రాశౌచము చెప్పబడెగాన నీవెనుకటి వచనములు ఖననము జేసెడిపక్షమునమాత్రము చెల్లదగు. దంతములు రాకపూర్వము దహనముజేసినచో నేకరాత్రము.

శ్లో॥ నామ్నోదన్తోద్గమాచ్చాలా దుపనీతేరధఃక్రమాత్ ।
సద్యశ్శౌచమహస్త్యహాన్ని యతాగ్న్యుదకఃపరః ॥

తా॥ నామకరణమునకు పూర్వము శిశువు మృతినొందినచో స్నానమునశుద్ధియగు అటుపిమ్మట దన్తములువచ్చులోగా నేకరాత్రము అటుపిమ్మట చౌలకర్మమగులోగా త్రిరాత్రమును ఆశౌచము అటుపిమ్మట ఉపనయనమగులోపలగూడ త్రిరాత్రాశౌచమేయగు కాని ఈ చౌలకర్మానంతరముపనయనములోగా మృతినొందినవానికి దహనము ఉదకదానము నియతములు అనగా క్రిందటి దశలుగలవారికివలె పాక్షికములుకావు అని సంగ్రహకారుడుచెప్పె.

శ్లో॥ ప్రాఙ్నామకరణాత్సద్యః ఏకాహందన్తజన్మనః ।
చూడాయాస్త్రిదినంప్రోక్తం తచ్చాగ్న్యుదకమాత్రతాత్ ॥

తా॥ ఈస్మృత్యన్తరవచనమునగూడ సంగ్రహకారుని భావమే యామోదింపబడినది. ఈ రెండువచనములు జ్ఞాతులవిషయమనిన్ని అందునుదహనముజేసెడిపక్షమున నే వర్తించదగుననిన్ని విజ్ఞానేశ్వరుడు మాధవాచార్యుడు మొదలగువారుచెప్పిరి. నామకరణమునకు పూర్వముదహనమేలేదు కాన ఖననవిషయమేయగును.

శ్లో॥ దన్తజాతేఽనుజాతేచ కృతచూడేచసంస్థితే।
అగ్నిసంస్కరణేతేషాం త్రిరాత్రమశుచిర్భవేత్ ॥

తా॥ దన్తములువచ్చినపిదపను రాదగినకాలము సమీపించిన పిదపగాని చూడాకర్మమైనపిదపగాని శిశువు మృతినొందినచో నాశిశువునకగ్నిసంస్కారము జేసినచో సపిండులకు త్రిరాత్రాశౌచము అని పరాశరుడుచెప్పె. ఇచట దన్తములు రానున్నవానివిషయమున త్రిరాత్రమును విధించుట చూడాకర్మమైనవానివిషయమని తెలియదగు.

శ్లో॥ యద్యప్యజాతదన్తస్స్యా త్కృతచూడస్తుసంస్థితః।
దాహయిత్వాతథాప్యేన మాశౌచంత్ర్యహమాచరేత్ ॥

తా॥ చూడాకర్మమైనపిదప మృతుడైనవానికి దన్తములు రాకపోయినను వానిని దహనము జేసినచో త్రిరాత్రాశౌచము అని షట్త్రింశన్మతమున జెప్పబడె ఇకత్యాగవిషయము చెప్పబడును.

శ్లో॥ జాతదన్తంమృతంత్యక్త్వా చరేదేకాహమేవతు ॥

తా॥ దన్తములు వచ్చిన పిదప మృతినొందినవానిని త్యాగము జేసి యొకదినము సపిండులాశౌచము నాచరింపదగునని యాదిపురాణమున జెప్పఁబడె.

శ్లో॥ అరణ్యేకాష్ఠవత్త్యక్త్వా ప్రక్షిపేత్త్ర్యహమేవతు॥

తా॥ దన్తములు వచ్చిన పిదప మృతుడైన శిశువును అరణ్యమునందు కాష్ఠమునువలె త్యాగముజేసి మూడు దినములాశౌచము నాచరింపదగునను మనువచనము తలిదండ్రులకు దినత్రయాశౌచబోధకమని మాధవీయాదులయందు వ్యాఖ్యానముజేయబడెను. త్యాగమనగా అరణ్యమునందు స్వతస్సిద్ధముగా గోయిగల భూమియందు కాష్ఠమునువలెనుంచి గడ్డలచేతను రాళ్లచేతను పూడ్చుట. ఖననమనగా భూమిని త్రివ్వి యందుంచుటయనిభేదము. "జాతదంతంమృతంత్యక్త్వా" అని విధించుటవలన నీత్యాగము దన్తములు వచ్చినవానికేచేయదగు. దహనము నామకరణమైనది మొదలు చౌలమగువరకు వైకల్పికము పిమ్మట నిత్యము, చౌలముకంటెపూర్వము దహనము, కొన్నివచనములచే విధింపబడి కొన్నివచనములచే నిషేధింపబడియున్నది.

శ్లో॥ ఊనద్వివార్షికంప్రేతం నిదధ్యుర్బాన్ధవాబహిః ।
అలంకృత్యశుచౌభూమౌ వస్థిసంచయనాదృతే ॥
నాస్యకార్యోగ్నిసంస్కారో నాపికార్యోదకక్రియా ॥

తా॥ రెండుసంవత్సరములకు కొంచెము లోబడిన వయస్సుగల బాలుడు మృతినొందినచో బంధువులు వానినలంకరించి యూరివెలుపల పవిత్రమైనటువంటిన్ని అస్థిసంచయనరహితమగు భూమియందు పూడ్చెదరు. వీనికగ్నిసంస్కారముగాని ఉదకక్రియగాని లేదు. అనుమనువచనముచేత మూడవసంవత్సరమునకు లోగడ దహనము నిషేధింపబడె. తృతీయవర్షముచేత చౌలముగూడనుపలక్షింపబడును.

శ్లో॥ నాత్రివర్షస్యకర్తవ్యా బాన్ధవైరుదకక్రియా ।
జాతదన్తస్యవాకుర్యా న్నామ్నివాపికృతేసతి ॥

తా॥ మూడవ సంవత్సరము రాని బాలుడు మృతినొందినచో బంధువులుదకక్రియ జేయనక్కరలేదు దన్తములు వచ్చిన పిదపగాని నామకరణసంస్కారమైన పిదపగాని చేయవచ్చునను మనువచనముచే నామకరణమైనపిదప దహనము విధింపఁబడె. ఉదకక్రియకును దహనమునకును అవినాభావసంబంధముకలదుకాన నుదకక్రియచేదహనముపలక్షింపబడు వికల్పములగు విషయములయందు శిష్టాచారము నియామకముగాన నీదహనము తమతమదేశాచారమునను సరించి చేయదగును ఖననప్రకారము యమునిచేజెప్పబడె.

శ్లో॥ ఊనద్వివార్షికంప్రేతం ఘృతాక్తంనిఖనేద్భువి ।
యమగాథాంగాయమానో యమసూక్తమనుస్మరన్॥

తా॥ రెండుసంవత్సరములకు కొంచెము లోబడిన వయస్సుగల శిశువు మృతినొందినచో యమగాథను అనగా "యోస్యకౌష్ఠ్యజగతః" అను నిది మొదలగు మూడుబుక్కలను జపువుచు యమసూక్తమును స్మరించుచు ఆజ్యముచే తడుపబడిన యాశిశుశవమును భూమియందు బూడ్చదగును. "పరేయువాగ్ంసం" అను నిది మొదలుకొని పదునారుబుక్కలు యమసూక్తమనబడు. "ప్రకేతునా" అను నిది

మొదలుకొని తొమ్మిది ఋక్కులవరకు యమసూక్తమని కొందరనిరి. మంత్రాంతమున ప్రణవమునుచ్చరించి యుంచదగును. మృతినొంది జనించిన శిశువునకు ప్రణవమవసరము లేదు.

శ్లో॥ శుచౌదేశేఽవటంఖాత్వా దర్భైఃపరిచ్ఛాద్యసర్వశః।
ఘృతాభ్యక్తంమృతంతత్ర ప్రణవేనవినిక్షిపేత్ ॥
మృతంజాతంతునిఖనే ద్భూమావప్రణవవర్జితమ్ ॥

తా॥ రెండుసంవత్సరములకు లోగడ శిశువు మృతినొందినచో శుచియగు ప్రదేశమున గోతిని త్రవ్వి అందంతటను దర్భలబఱచి ఆజ్యముచే తడుపబడిన యీశిశువును ప్రణవోచ్చారణపూర్వముగ నాగోతి యందుంచదగు మృతినొంది జనించిన శిశువు నుంచునపుడు ప్రణవము లేదు.

## —♦ ఖననప్రయోగము. ♦—

"ఇమంబాలంఖననేనసంస్కరిష్యే" యని సంకల్పించి శ్మశానమునకుగాని మఱియొకశుచిప్రదేశమున గోతినిత్రవ్వి అందవోక్షణముచేసి దక్షిణాగ్రములగు దర్భలపరచి "యోస్యకౌష్ఠ్యజగతః" అను నిది మొదలుకొని "యమోరాజాభితిష్ఠతి" అనునంతవరకుగల యమగాథను గానముజేయుచు "పరేయువాగ్ంసం" అను నిది మొదలుకొని పదునారుఋక్కులు (యమసూక్తమును) మనసునస్మరించుచు మృతుడగు బాలుని కడిగి ఆజ్యమున తడపి యలంకరించి యాగోతియందు ప్రణవోచ్చారణపూర్వకముగానుంచి దుమ్ముచే నాగోతినిపూడ్చి స్నానముజేసి గృహమునకు పోవలయును. ఇందు బంధువులకు శవానుగమనము ఆవశ్యకముకానేరదు. ఉదకదానము లేకపోవుటచే ప్రయోజనము లేదుకాన,

సూ॥ ఉదకదానంసపిండైఃకృతజటస్య॥

తా॥ చూడాకర్మమైనపిదప సపిండులుదకదానము జేయదగునను గౌతముని వచనముచే చౌలాన్తరమే జ్ఞాతులకుదకదానము విధింపఁబడె.

## —♦ రెండుసంవత్సరములు నిండినవానిని దహించువిధి. ♦—

శ్లో॥ ఆస్మశానాదనువ్రజ్య ఇతరోజ్ఞాతిభిర్వృతః ।
యమసూక్తంతథాగాథాం జపద్భిర్లౌకికాగ్నినా ॥
సదగ్ధవ్యఉపేతశ్చే దాహితాగ్న్యావృతార్థవత్ ॥

తా॥ రెండుసంవత్సరములు నిండినతరువాత మృతినొందినచో యమసూక్తమును యమగాధను పఠించుచున్న జ్ఞాతులుతోడ స్మశానమునకుగానిపోయి లౌకికాగ్నిచే దహనముచేయదగునని యాజ్ఞవల్క్యుడుచెప్పెను ఇందు బంధువులుదకదానముజేయదగుకానకూడపోదగును. లౌకికాగ్నియనఁగా చండాలాగ్నికానిదని తెలియదగు.

శ్లో॥ చండాలాగ్నిరమేధ్యాగ్నిః సూతకాగ్నిశ్చకర్హిచిత్ ।
పతితాగ్నిశ్చితాగ్నిశ్చ నశిష్టగ్రిహణోచితః ॥

తా॥ చండాలుని సంబంధమైనట్టియు అపవిత్రములగు వస్తువులతోకలిసినట్టియు సూతకుడు, పతితుడు వీరిసంబంధమైనట్టియు శ్మశానసంబంధమైనట్టియు అగ్నిశిష్టులచే పరిగ్రిహింపదగదని దేవలుడుచెప్పె. అనుపనీతుడైనచో ఎంతవరకు తంత్రముజరుపబడునో అంతవరకు ఆహితాగ్నితంత్రముతో పాత్రచయనాదిరహితముగ కపాలాగ్నిచేదహనము జేయదగును. లోకాక్షి అమన్త్రికముగా దహనమును జెప్పెను.

శ్లో॥ తూష్ణీమేవోదకందద్యా తూష్ణీంసంస్కారమేవచ।
సర్వేషాంకృతచూడానా మన్యత్రాపిచ్ఛయాద్వయం ॥

తా॥ చూడాకర్మమైన పిదప అమంత్రకముగా నుదకదానము సంస్కారముచేయదగు. చూడాకర్మ కాకపోయినను ప్రేతయొక్క అభ్యుదయమునుగోరి దహనమును ఉదకదానమును చేయవచ్చును ఈ పక్షమున యమగాధనుచ్చరించుట మొదలగునవి లేవు. స్త్రీలకుగూడ చౌలమైనది మొదలుగాని చౌలముగానిచో మూడవ సంవత్సరము మొదలుగాని దహనము జేయదగును. ఆపస్తంబుడు "అస్మాత్త్వమధిజాతోసి" అనుపునర్దహనమంత్రముచే దహనముచేయవలయునని జెప్పె.

సూ॥ అనుపేతాన్కన్యాశ్చపునర్దహనమంత్రేణదహేయుః ॥

తా॥ ఉపనయనము కానివారలను అవివాహితలగు కన్యలను పునర్దహనమంత్రముచే దహనము జేయవలయునని సూత్రార్థము. కాన తమతమసూత్రముననుసరించి యాచరింపదగును ఈ దహనము రెండు వత్సరములు నిండినవానికేనని తెలియదగు. రెండవసంవత్సరము నిండుటకొకదినము తక్కువయైనను ఈదహనము వైకల్పికమేగానినిత్యము కానేరదని విజ్ఞానేశ్వరాదులు వ్యాఖ్యానముజేసిరి. దహనసంస్కారమునుబోధించెడి "ఆశ్మశానాదనువ్రజ్య" అను శ్లోకమునందుగల ఇతర శబ్దమునకు రెండుసంవత్సరమును నిండినవాడు అని వ్యాఖ్యానముచేసిరి. కర్మప్రదీపికయందుమాత్రము,

శ్లో॥ కన్యాబాలకయోరూర్ధ్వం త్రియోవింశతిమాసతః ।
ఉపోషణంతుకర్తవ్యం తత్పూర్వంఖననంతయోః ॥

తా॥ కన్యకుగాని బాలునకుగాని ఇరువదిమూడుమాసములపైన దహనము జేయదగు. అంతకుపూర్వము ఖననమేచేయదగును అను వచనమునుదహరించి యిరువదినాల్గవమాసమున దహనము జెప్పబడెను స్మృతిముక్తాఫలమునందుగూడ,

శ్లో॥ త్రయోవింశతిమాసాత్తు మృతయోర్బాలకన్యయోః ।
ఏకర్చాదహనంత్వస్తి పంచమాత్సరమావ్రితాత్ ॥

తా॥ ఇరువదిమూడవ మాసమునకు పిమ్మట మృతులగుబాలునకును బాలికకును నొకబుక్కుచే దహనము చెప్పబడెను. అనువచనమునుదహరించి పైవిధముగనే చెప్పబడెను కాని మూడవసంవత్సరము మొదలుకొని యేదహనము నిత్యమగు, "నాత్రివర్షస్య" అనిమనువుచే మూడవ సంవత్సరమునకు పూర్వము దహనము నిషేధింపబడెను. ఆమూడవసంవత్సరమే చౌలమునకుకాలము చౌలకర్మగాని చౌలకర్మ కాలముగాని దహనమునకు నిమిత్తము ఈవిషయము ముందు చెప్పబడును. ఇరువదినాల్గవ మాసము చౌలమునకు కాలమని యేస్మృతి యందును చెప్పబడదు. కాన మూడవసంవత్సరము మొదలుకొని యే దహనము నిత్యమగు, అందు త్రిరాత్రాశౌచము "క్షత్రియస్యద్వాదశా

హాని" అను నిది మొదలగు పూర్ణాశౌచవిధాయక వచనములయందు వలె వర్ణవిశేషమునుబట్టి విధింపబడలేదుకాన నీ త్రిరాత్రాశౌచము అన్నివర్ణములకు సమానమేయగును వయోవస్థనిమిత్తముగాఁగల యీ యాశౌచము అన్నివర్ణములకు సమానమని విజ్ఞానేశ్వరుడు చెప్పెను.

మరియు,

శ్లో॥ క్షత్రేషడ్భిఃకృతేచౌలే వైశ్యేనవభిరుచ్యతే ।
ఊర్ధ్వంత్రివర్షాచ్ఛూద్రేతు ద్వాదశాహోవిధీయతే॥

తా॥ చౌలకర్మమైనపిదప క్షత్రియుడు మృతినొందినచో నారు దినములును వైశ్యుడైనచోతొమ్మిదిదినములును మూడుసంవత్సరముల పిదప శూద్రుడు మృతినొందినచో పండ్రెండుదినములును మృతాశౌచ మని చెప్పబడెను.

శ్లో॥ యత్రత్రిరాత్రంవిప్రాణా మాశౌచంసంప్రదృశ్యతే ।
తత్రశూద్రేద్వాదశాహం షణ్ణవక్షత్రవైశ్యయోః ॥

తా॥ ఏసందర్భమున బ్రాహ్మణునకు త్రిరాత్రాశౌచము చెప్ప బడెనో యాసందర్భమున శూద్రునకు పండ్రెండుదినములు క్షత్రియున కారుదినములు వైశ్యునకు తొమ్మిదిదినములు ఆశౌచమని ఋశ్యశృం గుడు మొదలగువారిచే జెప్పబడెను మేధాతిథి మొదలగువారిచే వెనుక చెప్పబడిన సర్వసాధారణపక్షమంగీకరింపబడెను వీరందరును ఋషుల గుటచేవీరివచనములన్నిటికి సమానబలముకాన వికల్పమనితాత్పర్యము.

శ్లో॥ అవిశేషేణవర్ణానా మర్వాక్సంస్కారకర్మణః ।
త్రిరాత్రాత్తుభవేచ్ఛుద్ధిః కన్యాస్వహ్నావిధీయతే॥

తా॥ సామాన్యముగా నన్నివర్ణములయందును సంస్కారకర్మ కాకపూర్వము త్రిరాత్రాశౌచము కన్యలవిషయమై యొక దినము మాత్రమాశౌచము అని యంగిరసుడు చెప్పెను.

శ్లో॥ తుల్యంవయసిసర్వేషా మతిక్రాన్తేతథైవచ ।
ఉపనీతేతువిషమం తస్మిన్నేవాతికాలజం ॥

తా॥ అవస్థాభేదమునుపట్టి వచ్చెడి యాశౌచమును అతిక్రాన్తాశౌచమును అన్నివర్ణములకును సమానమేయగు. ఉపనయనమైన పిదప మృతుడైనపుడు బ్రాహ్మణాదివర్ణభేదముననుసరించి దశాహము ద్వాదశాహము మొదలగు ఆశౌచభేదముగల్గును. ఆ యుపనీతుడు మృతుడైనపుడే అతిక్రాన్తాశౌచముగూడకలదు. కాన అనుపనీతుడు మృతినొందినచో తండ్రి మొదలగువారికతిక్రాన్తాశౌచము లేదని తెలియదగును.

శ్లో॥ ఆశౌచమసపిండేషు ప్రోషితేశ్రోత్రియేగురౌ ।
అతీతేనృపతౌతద్వ ద్రితకాలేచయోషితాం॥
అపత్యజాసు తథాస్త్రీషు మాతులేబాన్ధవేషుచ ।
ఏవమాదావశౌచస్య చతుర్ణామపితుల్యతా ॥

తా॥ సపిండులు కానివారు, పరదేశగతుడు, శ్రోత్రియుడు, గురువు, మేనమామ, తదితరబాంధువులు, రాజు వీరినిమిత్తమున గల్గినట్టి యాశౌచమును, అతిక్రాన్తాశౌచమును, ఋతుకాలమున స్త్రీలకుగల్గెడి యాశౌచమును, గర్భస్రావము మొదలగువానిచే నశించిన సంతానముగల స్త్రీలకుగల్గు ఆశౌచమును ఇవి మొదలగువానియందు అన్నివర్ణములకును సమానమని చంద్రికయందు జెప్పఁబడినది కాన ఉపనయనాదులకుపూర్వము వయస్సుయొక్క తారతమ్యము నిమిత్తముగాగల యాశౌచము సర్వవర్ణసాధారణము. ఉపనయనాదులైన పిదప గల్గు పూర్ణాశౌచమునకు వర్ణభేదమునననుసరించి వ్యవస్థజెప్పబడియెను. ఉపనయనాదులు జేయబడకున్నను ఆయాసంస్కారములు జేయదగిన వయస్సు ప్రాప్తించినమాత్రమున పూర్ణాశౌచము నాచరింపదగును.

శ్లో॥ ఆమౌంజీబంధనాద్విప్రః క్షత్రియశ్చాధనుర్గ్రహాత్ ।
ఆప్రతోదగ్రహాద్వైశ్యః శూద్రోవస్త్రద్వయగ్రహాత్ ॥
మ్రియతేయత్రతత్రస్యా దాశౌచంత్ర్యహమేవతు ।
ద్విజన్మనామయంకాల స్త్రియాణాంతుషడబ్దికః ॥
పంచాబ్దికస్తుశూద్రాణాం స్వజాత్యుక్తమతఃపరం ॥

తా॥ ఉపనయనమగులోగా బ్రాహ్మణుడును ధనుస్సును గ్రహించులోగా క్షత్రియుడును త్రాసును గ్రహించులోగా వైశ్యుడును రెండువస్త్రములను గ్రహించుటకు లోగడ శూద్రుడును మృతినొందినచో వారివారిసపిండులకు త్రిరాత్రాశౌచము బ్రాహ్మణులు మొదలగు ద్విజులకే చెప్పబడిన యుపనయనాదుల కారుసంవత్సరముల వయస్సు నిండినపిదప కాలమగు. శూద్రులకైదుసంవత్సరములవయస్సు నిండిన పిదప కాలము. ఈకాలము గడచినపిదప నాయాజాతులకు జెప్పబడిన పూర్ణాశౌచము నాచరింపదగును అని బ్రహ్మపురాణమున జెప్పబడెను. ఇచ్చట షడబ్దములనగా జనించినదిమొదలారుసంవత్సరములు పూర్తిగా గడచుట, అనగా గర్భసప్తమము గడచి గర్భాష్టమము ప్రవేశించుట, ఇట్లె పంచాబ్దికశబ్దమునకుగూడ యర్థము తెలియదగు.

అనగా ఉపనీతులగు బ్రాహ్మణులకును ధనుర్గ్రహణము జేసిన క్షత్రియులకును త్రాసును గ్రహించిన వైశ్యులకును రెండువస్త్రముల ధరించిన శూద్రులకును మృతి సంభవించినపుడు పూర్ణాశౌచము బ్రాహ్మణ క్షత్రియవైశ్యులకుపనయనాదులు కాకపోయినను గర్భాష్టమవత్సరము ప్రాప్తించినచో పూర్ణాశౌచమెయగు. శూద్రులకు వస్త్రద్వయగ్రహణము లేకపోయినను గర్భసప్తమవత్సరము ప్రాప్తించిన పిమ్మట మృతినొందినచో పూర్ణాశౌచము గర్భాష్టమవత్సరము. బ్రాహ్మణులకుపనయనకాలము. అదియే క్షత్రియులకు ధనుస్సును గ్రహింపదగుకాలము వైశ్యులకు త్రాసును గ్రహింపదగుకాలము. ఉపనయనాదిక్రియలయందావశ్యకములగు మంత్రోచ్చారణము. నారినిలాగుట మొదలగునవి జేయదగిన దేహపాటవము జనించినది మొదలు ఆఱవ సంవత్సరము గడచుటకులోగడ సంభవించుట యసంభవము, శూద్రులకు గర్భసప్తమ వత్సరము వస్త్రద్వయమును గ్రహింపదగుకాలము. అంతకుపూర్వమతిబాల్యమగుటచే సిగ్గనునది తెలియకుకాన కట్టువస్త్రమునపేక్షింపరు. ఐదుసంవత్సరములతిక్రమించిన పిదప లజ్జ యుదయించుకాన కట్టువస్త్రము నపేక్షించెదరు శీతనివారణార్థముత్తరీయము గూడ ధరింపబడుగాన స్మృతియందు వస్త్రద్వయపరిగ్రహమని చెప్ప

బడెను. కొందరు శూద్రులకు పండ్రెండవసంవత్సరము వస్త్రద్వయ కాలమని చెప్పిరి. అది మరియొకదేశమున చెల్లదగును మరియు.

శ్లో॥ అనూఢభార్యశ్శూద్రస్తు షోడశాద్వత్సరాత్పరం ।
మృత్యుంసమధిగచ్ఛేచ్చే న్మాసాత్తస్యాపిబాన్ధవాః ॥
శుద్ధింసమధిగచ్ఛన్తి నాత్రకార్యావిచారణా॥

తా॥ వివాహముకాని శూద్రుఁడు పదునారవసంవత్సరమునకు పిమ్మట మృతినొందినచో వానిబాధువులు మాసమున శుద్ధులగుదురు. అనుశంఖునివచనముగూడ దేశభేదముననుసరించి వ్యవస్థాపింపదగినది. మరియు,

శ్లో॥ అష్టభ్యఊర్ధ్వంవర్షేభ్య శ్శుద్ధిశ్శూద్రస్యమాసికీ ॥

తా॥ ఎనిమిదిసంవత్సరములు గడచిన పిదప శూద్రుడు మృతి నొందినచో వానిబాధువులకు మాసమాశౌచమని మేధాతిథిచెప్పె. ఇదిగూడ దేశభేదముననుసరించి వ్యవస్థాపింపదగినది. ద్విజులవిషయమై విరుద్ధవచనములు లేవు కాన గర్భాష్టమవత్సరము ప్రాప్తించినచో బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు పూర్ణాశౌచము మరియు "త్రిరాత్రమావ్రతాదేశాత్" అను తావున వ్రతశబ్దము గర్భాష్టకాలమునకుపలక్షకమని మేధాతిథి, కమలాకరుడు, హరిదత్తుడు, మొదలగువారిచే జెప్పబడుటచేతనుఁ క్షత్రియుడు ధనుస్సును, వైశ్యుడు త్రాసును, గ్రహింపదగుకాలము గర్భాష్టమవత్సరమని కమలాకరునిచే జెప్పబడుటచేతను శూద్రులకువలె త్రైవర్ణికులకు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు) గర్భాష్టమముకంటె మరియొక పూర్ణాశౌచనిమిత్తకాలము స్మృతుల యందెచ్చటను కనబడకుండుటచేతను గర్భాష్టమవత్సరమే త్రైవర్ణికులకు పూర్ణాశౌచనిమిత్తకాలమని నిర్ణయము. గర్భపంచమవత్సరమునవే ఉపనయనము చేయబడిన పిదప మృతినొందినచో "ఆమౌంజీబంధనాద్విప్రః" "త్రిరాత్రమావ్రతాదేశాద్దశరాత్రమతఃపరం" అను నివి మొదలగువచనములచే ఉపనయనముగూడ పూర్ణాశౌచనిమిత్తమని చెప్పబడినదికాన పూర్ణాశౌచమేయగును. ఇట్లె క్షత్రియుడు ధనుస్సును, వైశ్యుడు త్రాసును గర్భాష్టమవత్సరమునకు లోగడనే ధరించి

నచో వారికిని పూర్ణాశౌచమేయగును. "క్షత్రియశ్చాధనుర్గ్రహాత్" "ఆప్రతోదగ్రహాద్వైశ్యః" అను వచనములచే ధనుఃప్రతోద గ్రహణ ములే వీరికి పూర్ణాశౌచనిమిత్తములని చెప్పబడెను. ఐదు మొదలగు వత్సరములుగూడ ఉపనయనకాలములు గనుక నా యైదు మొదలగు వత్సరములు ప్రాప్తించినను పూర్ణాశౌచమేయనదగదు ఎట్లన స్వేచ్ఛాధీనమగుకాలము ఆశౌచనిమిత్తముకానేరదు ఇకనేమన వచనాధీనమగుకాలమే యాశౌచనిమిత్తము "ద్విజన్మనామయంకాలః" అనునిది మొదలగు వచనములు గర్భాష్టమవత్సరమే పూర్ణాశౌచనిమిత్తమని బోధించుచున్నవి కాన గర్భాష్టమము మొదలుకొనియే పూర్ణాశౌచమని ప్రసిద్ధము. "జన్మనోథతృతీయేవర్షేచౌలం" జనించినది మొదలు మూడవ సంవత్సరమున చౌలముజేయదగును. అను నిది మొదలగువచనములచే జనించినదిమొదలు మూడవసంవత్సరము చౌలకర్మకుకాలమని చెప్పబడినది కాన చౌలముకాకున్నను మూడవ సంవత్సరము మొదలుకొని త్రిరాత్రాశౌచము.

శ్లో॥ ప్రథమేబ్దేతృతీయేవా కర్తవ్యాశ్రుతిచోదనాత్ ॥

తా॥ అను నిది మొదలగు వచనములచే మొదటిసంవత్సరము గూడ చౌలమునకు కాలమని చెప్పబడినది ఐనను.

శ్లో॥ తథాచాకృతచూడస్య త్రివర్షాదోపనాయనం ॥

తా॥ "ఆచౌచంతుత్రిరాత్రంస్యాత్" చూడాకర్మ జేయబడనిచో మూడవసంవత్సరము మొదలుకొని ఉపనయనమగువరకు త్రిరాత్రాశౌచము అనువచనము మూడవసంవత్సరమే త్రిరాత్రాశౌచనిమిత్తమని జెప్పుచున్నది. మరియు "ఆచౌలాన్నైశికీస్మృతా" "నిర్వృత్తచౌలకానాన్తుత్రిరాత్రాచ్ఛుద్ధిరిష్యతే" అను నివి మొదలగువచనములు చౌలకర్మముగూడ త్రిరాత్రాశౌచనిమిత్తమని బోధించుచున్నవి కాన మొదటిసంవత్సరముననే చౌలకర్మము జేయబడినచో నది మొదలుకొని త్రిరాత్రాశౌచము మరియు ""అజాతదన్తోమాసైర్వామృతషడ్భిర్గతైస్తథా" అను నిది మొదలగు వచనములు దన్తములురాని

యవస్థయు, ఆరుమాసములకు లోబడినకాలమును సద్యశ్శౌచనిమిత్తము లని చెప్పుచున్నవికాన దన్తములువచ్చుటకు లోగడను ఆరుమాసము లకులోగడను సద్యశ్శౌచము. ఆరుమాసములు గడచిన పిదప దన్తములురాకపోయినను ఏకరాత్రాశౌచము ఐదవమాసమున దన్తములు వచ్చినచోగూడ నేకరాత్రాశౌచమేయగు. మరియు "ప్రాఙ్నామకరణాత్సద్యః ఏకాహందన్తజన్మనః" "నామ్నివాపికృతేసతి" అను నిది మొదలగు వచనములచే నామకరణము దహనమునకును ఏకరాత్రాశౌచమునకును నిమిత్తమని చెప్పబడుటచే "ఊర్ధ్వందశాహాదేకరాత్రం" జన్మదశాహము గడచినపిమ్మట శిశువు మరణించినచో జ్ఞాతులకేకరాత్రాశౌచము అను నిది మొదలగు వచనములచే నామకరణకాలమగు పదునొకండవదినముగూడ నాదహనమునకును ఏకరాత్రాశౌచమునకును నిమిత్తమని చెప్పబడెగాన నామకరణము చేయబడకున్నను పదునొకండవదినముమొదలుకొని వికల్పముగా దహనము ఏకరాత్రాశౌచమును కాదగును. ఓయీ "దశరాత్రేవ్యుష్టేశతరాత్రేసంవత్సరేవా" పదిదినములు గడచినపిదపగాని నూరుదినములు గడచినపిదపగాని సంవత్సరము గడచినపిదపగాని నామకరణము జేయదగునను వచనముచే నామకరణమునకు కాలములు చాలజెప్పబడినవి కాన నామకరణకాలములలో నొకటియగు పదునొకండవ దినమతిక్రమించినది మొదలుకొని ఏకరాత్రాశౌచమును దహనమును విధించుట యసంగతము అనినచో "ఊర్ధ్వందశాహాదేకరాత్రః" జన్మదశాహమునకు పిదప శిశువు మృతినొందినచో నేకరాత్రాశౌచమను వచనముచే పదునొకండవదినము ఆయేకరాత్రాశౌచమునకును దహనమునకును నిమిత్తమని చెప్పబడుచున్నది. నామకరణము దన్తజననము చౌలము ఉపనయనము వీనికనేకకాలములు చెప్పబడియున్నవి కాని అవన్నియు ఆశౌచనిమిత్తములు కానేరవు. ఏకాలము నిమిత్తముగునని స్మృతివచనమున తెలియబడునో ఆకాలమే నిమిత్తమగును. అట్లుకాక కేవలము కాలమే యాశౌచనిమిత్తమైనచో "శతాయుఃపురుషః" అను శ్రుతి వలన నూరుసంవత్సరములపైకాలము మరణకాలమని తెలియబడుచుం

డుటచే అటుపిమ్మట అదృష్టవశమున బ్రతికియున్నవానికి దహనము మొదలగు ప్రేతకృత్యములజేయవలసివచ్చును. మరియు దురదృష్టవశమును నూరుసంవత్సరములకులోగడ మృతినొందినవానికి ప్రేతకృత్యములు లేకపోవలసివచ్చును కాన ఇట్టి పూర్వపక్షము కేవలమసంగతము స్మృతులయందు ప్రేతకృత్యములకు మరణమునిమిత్తమని తెలియబడుచున్నదిగాని మరణకాలప్రాప్తికారణమని యెచ్చటను తెలియబడుట లేదు. కాన ప్రేతకృత్యములకు మరణమొకటియే నిమిత్తమగును. నూరుసంవత్సరములకు పిమ్మటగానిలోగాగాని ఆమరణము ప్రాప్తించినపుడే ప్రేతకృత్యమును చేయదగు. ఈ దృష్టాన్తమున చౌలకర్మ మొదలగువాని కాలములకుగూడ నిర్ణైనని యనదగదు అట్లైనచో "తథాచాకృతచూడస్య" అనునిది మొదలగు వచనములు వ్యర్థములు కావలసివచ్చును కాన అట్లనదగదు. అనుపనీతుని నిమిత్తమునగల్గు మరణాశౌచము " ఖనిత్వాతుశనైర్భూమిం " "జాతదంతంమృతంత్యక్త్వా" అను నిది మొదలగు వచనములయందు ఆనన్తర్యమును బోధించెడి "క్త్వా" ప్రత్యయముయొక్క సంబంధము కలుగుటచే ఖననదహనత్యాగములను సంస్కారములజేసిన పిదపనే ఆయాశౌచము ప్రాప్తించును. కొందరు మూడవ సంవత్సరమునకు లోగడ మృతినొందినపక్షమున ఆశౌచమును విధించు వచనములయందే "క్త్వా" ప్రత్యయము కాన్పించుచున్నది కాన ఆపక్షమునందే సంస్కారానంతమాశౌచము ప్రాప్తించుననిరి కాన యాచారానుసారముగ నాచరింపగును. నామకరణమైన పిదప దహనము జేసినపక్షమున తలిదండ్రులచే నుదకదానము పిండదానము చేయదగును

శ్లో॥ అగ్నినాసంస్కృతస్యోక్తా పిండదానోదకక్రియా ॥

తా॥ అగ్నిచే సంస్కరింపబడిన వానికి పిండదానము ఉదకదానము చేయదగునని చెప్పబడె. " అకృతచౌలస్యదర్భవర్జితం " చౌలకర్మకానివానికి దర్భలులేకుండునట్లుగా పిండదానాదికము చేయదగునని యఖండాదర్శనము జెప్పబడెను. "దత్తజననాదిమాతాపితృ

భ్యాం" దన్తములువచ్చినది మొదలుకొని తలిదండ్రులుదకపిండదానము చేయదగు అనుగౌతమవచనము దన్తములురాకపూర్వము వికల్పముగా ప్రాప్తించు దహనోదకదానముల నివర్తించుచున్నది. "నామ్నివాపికృతేసతి" అను మనువచనముచే నామకరణానంతరమే దహనమునకును ఉదకదానమునకును అనుజ్ఞ ఇవ్వబడినది. "ఉదకదానంసపిండైఃకృతజటస్య" అను గౌతమవచనమువలన మూడవ సంవత్సరము మొదలు జ్ఞాతులుకూడ యుదకదానము జేయదగును. సంస్కారము జేసిన వానిచే పిండదానముగూడ చేయదగును. ఐదవ సంవత్సరము మొదలుకొని అస్థిసంచయనము ఏకోద్దిష్టమునుచేయదగు.

శ్లో॥ మృతందగ్ధ్వాత్రిరాత్రేణ త్రివర్షాదుదకంబలిం ।
పంచమాద్యస్థిచయనం శ్రాద్ధంకుర్యాచ్చతుర్దినం ॥

తా॥ మూడుసంవత్సరములు గడచిన పిదప మృతుడయ్యెనేని దహనముజేసి మూడుదినములు ఉదకమును బలినియ్యదగును. ఐదవ సంవత్సరము మొదలుకొని అస్థిసంచయనము నాల్గుదినములు శ్రాద్ధమును చేయదగునని కాత్యాయనుడుచెప్పె.

శ్లో॥ అష్టమాత్పరమేవాస్య దృషత్స్థాపనపూర్వకం।
ఉదకంపిండదానంచ కుర్యాత్ప్రేతస్యశాన్తయే ॥

తా॥ ఎనిమిదవ సంవత్సరమునకు పిమ్మట శిలాస్థాపనపూర్వకముగా ప్రేతశాన్తికొరకు పిండదానమును ఉదకదానమును చేయదగునని చెప్పబడె "దర్భస్తంభేతతఃపూర్వం సర్వకర్మసమాచరేత్"-ఈయెనిమిదవ సంవత్సరమునకులోగడ పిండదానాదికము దర్భలయందు చేయదగుననిగూడ జెప్పబడె కాన మూడవసంవత్సరము మొదలుకొనిదర్భలయందుదకపిండదానము చేయదగునని చెప్పబడెను మరియు,

శ్లో॥ ఉదకంపిండదానంచ త్ర్యహంస్యాత్తుత్రివర్షతః।
దశాహపిండదానంస్యా దష్టమాబ్దాత్పరంస్మృతం॥
ప్రేతపిండంబహిర్దద్యా ద్దర్భమంత్రవివర్జితం॥

తా॥ మూఁడు సంవత్సరములపైన మృతినొందినవానికి మూఁడు దినములు ఉదకదానము పిండదానము చేయదగు. ఎనిమిదిసంవత్సరములపైనయగుచో పది దినములా పిండదానాదికము చేయదగును. ఆపిండదానము బాహ్యప్రదేశమున దర్భమంత్రవిరహితముగా జేయదగును. ఈ వచనము వికల్పముగా జెల్లదగునని యభిప్రాయము మరియు,

శ్లో॥ అష్టమాద్వత్సరాదర్వా జ్మృతయోర్బాలకన్యయోః।
పిండోదకంత్రిరాత్రేణ హ్యేకరాత్రేణసంకటె ॥
త్రీంపిండాన్ప్రథమేదద్యా ద్ద్వితీయేచతురస్తథా ।
త్రీంస్తుదద్యాత్తృతీయేహ్ని బాలానాంపిండకల్పనా ॥
శిశోస్త్రివత్సరాదూర్ధ్వ ముదకంపంచసప్తతి ॥

తా॥ గర్భాష్టమవత్సరమునకు లోగడ మృతినొందిన బాలునకును కన్యకును మూఁడుదినములు పిండదానము ఉదకదాదము చేయదగును. సంకటమునందు ఒకదినముమాత్రము చాలును అందు మొదటిదినమున మూఁడుపిండములు, రెండవదినమున నాల్గుపిండములు, మూఁడవదినమున మూఁడుపిండములు నివ్వదగును. మూఁడువత్సరముల పిదప మృతినొందిన బాలునకు డెబ్బదియైదుపర్యాయములుదకదానము జేయదగునని జెప్పబడియెను మరియు,

శ్లో॥ త్రిరాత్రంపిండదశకం త్రింశద్దద్యాత్తిలోదకం ॥

తా॥ మూఁడుదినములయందును పదిపిండములు ముప్పదితిలోదకములు నివ్వదగునను వచనము దేశభేదమున చెల్లదనును. ఐదవసంవత్సరము మొదలుకొని యుపనయనముగువరకును అమంత్రకముగా సంచయనాంగములగు కర్మలచేయదగు. హోమముచేయదగదు. ప్రధానమగు సంచయనముమాత్రము సమంత్రకముగానే చేయదగును.

శ్లో॥ జలేనపయసాచైవ సంప్రోక్ష్యాస్థీన్యమంత్రకం ।
తానికుంభేసమాప్యాథ పయసాపూరయేద్ఘటం ॥
ఇదంతఇతిమంత్రేణ ఘటంకుర్యాత్సురక్షితం ॥

తా॥ మూడవదినమున దహనప్రదేశమునకు క్రొత్తకుండ గొని పోయి అస్థికలనుదకముచేతను పాలచేతను అమంత్రకముగా ప్రోక్షించి "ఇదం తే" అను మంత్రముచే నాయస్థికలను ఘటమునందుంచి పిమ్మట నాఘటమును పాలచే పూరించి యాఘటమును సురక్షితము జేయ దగును అనియాపస్తంబుడుపల్కె.

శ్లో॥ తుషాగ్నినాదహేత్ప్రేత మస్మాత్త్వమధిమంత్రతః।
కుర్యాత్సంచయనంత్వస్థ్నా మేకర్చాప్రవతబంధనాత్॥

తా॥ ఉపనయనమగుటకులోగడ మృతినొందినప్రేతను "అస్మాత్త్వమధి" అనుమంత్రమున తుషాగ్నియందు దహనముజేసి "ఇదం తే" అను నొకమంత్రముచే నస్థిసంచయనము జేయవలయును. అని మరియొక స్మృతియందు జెప్పబడెను. ఐదవసంవత్సరమునకు లోగడ మృతి నొందినవానికి సంచయనమున ప్రధానకర్మముగూడ అమంత్రకముగానే జేయందగును.

శ్లో॥ పంచమాద్వత్సరాదర్వా జ్మృతయోర్బాలకన్యయోః।
అస్థిసంచయనంతూష్ణీం కుర్యాదిత్యాహగౌతమః॥ అని గౌతమ స్మృతియందు జెప్పబడెను

శ్లో॥ బాలాన్మృతాన్ ద్వివర్షా ద్వ్యతీతాన్ యజ్ఞోపవీతస్యవిధేః పురస్తాత్। అమంత్రకం చౌలవిధింవిధాయ మంత్రేణ సంస్కారవిధింవిదధ్యాత్॥

తా॥ మూడవసంవత్సరము ప్రాప్తించినపిదప ఉపనయనమగు లోగా మృతినొందిన బాలురను అమంత్రకముగా చౌలకర్మమునుజేసి పిమ్మట సమంత్రముగ సంస్కరింపదగునని బోధాయనుడు చెప్పెను. అనగా చౌలకర్మముకాకపూర్వము సమంత్రముగ సంస్కరింపదగుటకు యోగ్యతలేదనిభావము. ఇట్టివారికి నాల్గవదినమున నేకోద్దిష్టముజేసి యైదవదినమున నారాయణబలిజేయదగు.

శ్లో॥ తథాబాలస్యకన్యాయా షండస్యపతితస్యచ।
నారాయణబలిఃకార్యో హ్యస్యేషాంమోక్షకాంక్షిణాం॥

తా॥ ఉపనయనమునకులోగడ మృతినొందికబాలునకును అవివాహితయగు కన్యకును, నపుంసకునకును, పాపాత్మునకును, ఇంకను ఇట్టి మోక్షము గోరుచున్న వారికి నారాయణబలి చేయదగునని వ్యాసుడుపలికెను.

శ్లో॥ మృతందద్యాత్త్రిరాత్రేణ త్రివర్షాదుదకంబలిం ॥

తా॥ మూడుసంవత్సరములు గడచినపిదప మృతినొందినవానికి ఉదకాంజలులనిచ్చి త్రిరాత్రిమాశౌచము నవలంబించి పిమ్మట నారాయణబలి చేయదగునని గౌతముడుచెప్పె.

శ్లో॥ త్రివర్షాదుదకంపిండం చతుర్థాదుదకంబలిం॥

తా॥ మూడవసంవత్సరమునకు పిదప మృతినొందినవానికి ఉదకమును పిండమును నాల్గవసంవత్సరమునకు పిదప మృతినొందినవానికి ఉదకమును బలిని చేయదగునను బోధాయనునివచనము. బోధాయన సూత్రావలంబులకు మాత్రము చెల్లదగును. గర్భాష్టమ వత్సరము మొదలుకొని ఉపనీతునకును అనుపనీతునకును నవశ్రాద్ధములు షోడశ శ్రాద్ధములును చేయుదగును.

శ్లో॥ అష్టమాద్వత్సరాదూర్ధ్వం నవశ్రాద్ధానికారయేత్।
అబ్దాదేవాష్టమాదూర్ధ్వం ఏకోద్దిష్టానిషోడశ॥
త్రివర్షాదుదకంపిండం శ్రాద్ధాన్తంపంచమాత్పరం।
అష్టమాత్సకలంగ్రాహ్యం సపిండీకరణంవినా॥
సప్తమాద్ద్వాదశాదూర్ధ్వా గృహస్థబ్రహ్మచారిణోః।
సపిండీకరణంకుర్యా న్నప్రాగితియమోబ్రవీత్ ॥

తా॥ ఎనిమిదవ సంవత్సరము ప్రారంభించినపిదప మృతినొందినవానికి షోడశశ్రాద్ధములు నవశ్రాద్ధములు చేయదగును. మూడువత్సరములు గడచినపిమ్మట మృతినొందినచో నుదకదానము పిండదానము మాత్రము చేయదగు. ఐదవసంవత్సరమునకు పిమ్మట శ్రాద్ధాన్తము చేయదగు. ఎనిమిదవసంవత్సరముకు పిమ్మట సపిండీకరణముదక్క మిగిలిన సమస్తకర్మమును జేయవచ్చును. గృహస్థునకుగాని బ్రహ్మ

చారికిగాని పండ్రెండవసంవత్సరమునకుపైన సపిండీకరణము జేయదగును అంతకులోగడ చేయదగదని యముడు చెప్పెను. ఇచట ఎనిమిదవ సంవత్సరమనగా గర్భాష్టమసంవత్సరమని గ్రహింపదగు. సాపిండ్యము నిషేధింపబడినవారికి నారాయణబలిచేయదగును గర్భాష్టమవత్సరము మొదలుకొని అనుపనీతుని మరణమున నవశ్రాద్ధములు షోడశశ్రాద్ధములును అమంత్రకముగ నామద్రవ్యముచేజేయదగును. ద్రావిడులకు గర్భాష్టమవత్సరమునకులోగడ బాలుడు మరణించినచో తలిదండ్రులకును సోదరులకును పదిదినములాశౌచము కాన దహన సంస్కారము జేసినవాడు మొదటి మూడుదినములయందే పిండోదక దానమును సమాప్తినొందించి పదునొకండవదినమున నేకోద్దిష్టముజేసి పండ్రెండవ దినమున నారాయణబలిని జేయదగును.

శ్లో॥ త్రివర్షాద్యుదకంపిండం సర్వేషాంతర్పణంభవేత్ ।
త్రిరాత్రింపిండదశకం త్రింశద్దద్యాత్తిలోదకం॥
ఆదితస్త్రిదినేకుర్యా ద్బాలానాంత్సుద్గరీయసీ ॥

తా॥ మూడవసంవత్సరము మొదలుకొని ఉదకాంజలులు పిండ ప్రదానము జేయదగును. తర్పణమునందు జేయవలయు బాలుర కాకలి యెక్కుడుకాన మొదటిమూడుదినములయందు పదిపిండములు ముప్పతిలోదకములు నివ్వదగును మఱియు,

శ్లో॥ కన్యాబాలకుమారేభ్య స్త్ర్యహంపిండోదకక్రియాః ।
కుర్యాద్దశాహమాశౌచం వర్తతేనాత్రసంశయః ॥
కన్యాబాలకుమారాణా మష్టమాదిదినత్రయే ।
పిండోదకేచనిర్వర్త్య ద్వాదశేబలిమాచరేత్ ॥

తా॥ కన్యలకు, బాలురకు, కుమారులకు, మూడు దినములు పిండోదకక్రియలజేయదగు. ఆశౌచముమాత్రము పదిదినములుకలదు వీరలకెనిమిదవదినము మొదలుకొని మూడుదినములయందు పిండోదక క్రియలనిర్వర్తించి పండ్రెండవదినమున నారాయణబలి జేయదగునను నది వికల్పముగావర్తింపదగును. జ్ఞాతికర్తయగుచో వానికి త్రిరాత్రా

శౌచమేకాన ఆంధ్రులవలె నాచరింపదగును. శతకమునందాజ్ఞాతికి దశరాత్రాశౌచము చెప్పబడెను. స్మృతిముక్తాఫలమున నదిదూషింపబడెను కాన యాచారముననుసరించి యాచరింపదగును. సపిండుడు కానివాడు సంస్కరించినపక్షమున పిండోదకదానములేనిచో తత్కాలమునందేశుద్ధిగల్గు. సపిండుడుకానివాడు ఉపనీతునకు దహనసంస్కారము జేసినచో విషయభేదముననుసరించి సద్యశ్శౌచము త్రిరాత్రాశౌచము మొదలగునవి చెప్పబడినవి కాన గ్రామమునకు వెలుపలనుండదగు ఈగ్రంథమాశౌచమునుమాత్రము వివేచించుటకు బయలువెడలినను బాలురయొక్క సంస్కారము మొదలగువానిని నిరూపించుట స్మృతుల యందును నిబంధములయందును అరుగగుటచే నివి ప్రసిద్ధములుగా నుండకపోవుటవలననని దెలియదగు. కన్యామరణమున విశేషమును జెప్పుచున్నాడు.

—♦ కన్యామరణాశౌచనిర్ణయము. ♦—

శ్లో॥ అనూఢాయామృతౌపిత్రోః భ్రాతౄణాంచదినత్రయం।
దినమాదన్తజననా దితిధర్మవిదోవిదుః॥
జ్ఞాతీనాంస్నానమాచౌలా దావాగ్దానందినంభవేత్।
వాగ్దానేతుత్రిరాత్రంస్యా త్పితృభర్తృకులద్వయే॥
అనూఢాచేద్రజఃపశ్యే ద్దశాహంతన్మృతౌభవేత్॥

తా॥ అవివాహితయగు కన్య దన్తములురాకపూర్వము మృతినొందినచో తలిదండ్రులకును సోదరులకును ఏకరాత్రాశౌచము త్రిరాత్రమని కొందరనిరి. దన్తములు వచ్చినపిదప వివాహముగువరకు త్రిరాత్రము జ్ఞాతులకు చౌలమునకు లేక మూడవ సంవత్సరమునకు లోగడ యగుచో స్నానమునశుద్ధి. అటుపిమ్మట వాగ్దానముగువరకు నేకరాత్రము వాగ్దానమైనపిమ్మట వివాహముగులోగానైనచో పితృకులమునకును భర్తృకులమునకును రెంటికిని త్రిరాత్రాశౌచము. వివాహమునకు పూర్వము రజస్వలయై మృతినొందినచో నందరికిని దశరాత్రాశౌచము.

సూ॥ ఏకేపరిత్తానాం॥

తా॥ వాగ్దానము జేయబడిన కన్యలకునుదకదానము జేయదగు నని కొందరు పలికిరి. అని గౌతముఁడు వికల్పముగా చెప్పుటవలన కన్యలవిషయమున ఉదకదానము వైకల్పికము.

శ్లో॥ పిత్రోరుపరమేస్త్రీణా మాశౌచంతుకథంభవేత్।
త్రిరాత్రేణవిశుద్ధిస్స్యా దిత్యాహభగవాన్యమః॥

తా॥ అవివాహితలగుస్త్రీలు మృతినొందినచో తలిదండ్రులకు త్రిరాత్రముచే శుద్ధియని యముఁడుచెప్పెను.

శ్లో॥ పరిత్తాప్రత్తాసుయోషిత్సు సంస్కృతాసంస్కృతాసుచ।
మాతాపిత్రోస్త్రిరాత్రంస్యా దితరేషాంయథావిధి॥

తా॥ వాగ్దానము జేయబడిన కన్యగాని, చేయబడనికన్యగాని, వివాహమైనకన్యగాని, కానికన్యగాని తండ్రిగృహమునమృతినొందినచో తలిదండ్రులకు త్రిరాత్రాశౌచము అని కార్ష్ణాజనిపలికె. ఈత్రిరాత్రము దంతములు వచ్చిన పిదపయని తెలియదగును. అంతకు పూర్వము "అజాతదన్తాసుపిత్రోరేకరాత్రం" దంతములురాకపూర్వము కన్యమృతి నొందినచో తలిదండ్రులకేకరాత్రమని శంఖకార్ష్ణాజనులచే విశేష వచనము చెప్పబడుటవలన నేకరాత్రమేయగునని మాధవీయమునజెప్పబడె అది కమలాకరునిచేగూడ యామోదింపబడె. ఈవిషయము మరియొక గ్రంథమునందెచ్చుటను దూషింపబడలేదు ఇక జ్ఞాతివిషయమున,

సూ॥ ఆచూడాయాంకన్యాయాంసద్యశ్శౌచం॥

తా॥ చూడాకర్మకాని కన్య మృతినొందినచో సద్యశ్శౌచము అని యాపస్తంబుడు పలికె.

శ్లో॥ ఆజన్మనస్తుచౌలాన్తా కన్యాయత్రవిపద్యతే।
సద్యశ్శౌచంభవేత్తత్ర సర్వవర్ణేషునిత్యశః॥
తతోవాగ్దానపర్యన్తం యావదేకాహమేవహి।
తతస్తత్రప్రవృత్తాయాం త్రిరాత్రమితినిశ్చయః॥

వాగ్దానేతుకృతేయత్రి తత్రిహ్యుభయత స్త్రిహం ।
పితుర్వరస్యచతతో దత్తానాంభర్తురేవహి ॥
స్వజాత్యుక్తమశౌచంస్యా స్మృతకేజననేపిచ॥

తా॥ అన్నివర్ణములయందును కన్య జనించినది మొదలుకొని చౌలకర్మముగులోగా మృతినొందినచో జ్ఞాతులకు సద్యశ్శౌచము. చౌలకర్మమైనపిదప వాగ్దానముగువరకు నేకరాత్రము అటుపిమ్మట త్రిరాత్రాశౌచము ఈ వాగ్దానమైనపిదప మృతినొందినచో వరుని జ్ఞాతులకుగూడ త్రిరాత్రాశౌచము. వివాహమైనపిదప భర్తయొక్క జ్ఞాతులకుమాత్రమే ఆయాజాతికి చెప్పబడిన పూర్ణాశౌచమని తెలియదగు. రెండుసంవత్సరములకులోగడ వివాహమైనపిదప మృతినొందిన స్త్రీకి విశేషము చెప్పబడె.

శ్లో॥ ఊనద్వివర్షకన్యాయాః పాణిగ్రిహణకర్మణి ।
ఖనిత్వానిక్షిపేద్యామం పశ్చాద్దాహోవిధీయతే॥

తా॥ రెండుసంవత్సరములకు లోగడనే వివాహమై పిదపమృతినొందినస్త్రీని ఒకజాము పూడ్చిపెట్టియుంచి పిదప దహనము చేయదగును మరియు,

శ్లో॥ పితృవేశ్మనియానారీ రజఃపశ్యత్యసంస్కృతా.
తస్యాంమృతాయాంనాశౌచం కదాచిదపిశామ్యతి॥

తా॥ అవివాహితయగుస్త్రీ తండ్రి యింటనుండి రజస్వలయై పిదప మృతినొందినచో నాయాశౌచము పదిదినములలోగాని వర్తింపదు అని శంఖుడుపలికెను. సంగ్రహము అనుపనీతునకు ఖననము, త్యాగము, దహనము అను మూడుసంస్కారములు అందు జనించినది మొదలుకొని పదిదినములలోగా మృతినొందినచో ఖననము మాత్రము చేయదగును. అటుపిమ్మట నారుమాసములకులోగడమృతినొందినచో ఖననము లేక దహనము చేయదగును. ఏడవమాసము మొదలుకొని రెండవసంవత్సరము పూర్తియగులోగానైనచో ఖననముగానిత్యాగము గాని దహనముగాని చేయదగును. మూడవసంవత్సరము మొదలుకొని

దహనము మాత్రము చేయదగును. ఐదవమాసమున దన్తములువచ్చినను ఏడవమాసమున దన్తములు రాకపోయినను ఈమూడుసంస్కారములు వికల్పముగా చేయదగును. మొదటి సంవత్సరముననే చౌలకర్మము జేయబడినచో చౌలమైనది మొదలు దహనసంస్కారమే జేయదగును. రెండువత్సరములపిదప చౌలము చేయబడకపోయినను దహనసంస్కారమే చేయదగును.

—♦ ఇక కన్యామరణమునందువిశేషము ♦—

రెండుసంవత్సరములలోగడ వివాహితయగు కన్య మృతినొందినచో నొక యామమాత్రము భూగర్భమున స్థాపించి పిమ్మట దహనముజేయవలయు. రెండువత్సరముల లోగడ చౌలము జేయబడిన బాలునకుగాని బాలికకుగాని ముందుఖననమునుజేసి పిమ్మట పెకలించి దహనముజేయదగు చౌలముజేయబడినవానికి రెండుసంవత్సరములకు లోగడ దహనము దేశాచారమునుసరించి చేయదగినది. దహనము జేసిన పక్షమున మూడవసంవత్సరమువరకు తలిదండ్రులు దర్భరహితమగు భూమియందుదకదానముజేయదగు. సంస్కరించినవాడు దర్భరహితమగు భూమియందే పిండదానమును జేయవలయు. సంచయనము మంత్రకముగా జేయవలయు. మూడవ సంవత్సరము మొదలుకొని జ్ఞాతులుకూడ యుదకదానము చేయదగు. దర్భలకువికల్పము ఐదవ సంవత్సరము మొదలుకొని యేడవసంవత్సరమువరకు ప్రధానసంచయనము సమంత్రకముగాను అస్థిప్రోక్షణాదులమంత్రకముగాను చేయవలయు. హోమమమంత్రముగగూడ జేయదగదు నాల్గవదినముననేకోద్దిష్టము. ఐదవదినమున నారాయణబలియు జేయవలయు. ఏడవసంవత్సరము గర్భాష్టమముగాన నది మొదలుపనీతునకుగాని యనుపనీతునకుగాని నవశ్రాద్ధములు షోడశశ్రాద్ధములు జేయదగు. అనుపనీతునకామశ్రాద్ధములమంత్రకముగ జేయదగునని కొందరనిరి. పండ్రెండు సంవత్సరములు గడచినపిదప మృతినొందినవానికి సపిండీకరణము ఆబ్దికముగూడ జేయదగు. గృహస్థుడైనచో నెనిమిదవసంవత్సరమునకు పైన సపిండీకరణము ఆబ్దికము జేయదగును. స్త్రీలకు వివాహమునకు

లోగడ పిండదానమును ఉదకదానమును వైకల్పికములు అటుపిమ్మట భర్త సర్వమును జేయదగును. రెండుసంవత్సరములకుపైనను గర్భాష్ట మవత్సరమునకు లోగడనను త్రిరాత్రాశౌచమైనను పది పిండములు డెబ్బదియైదు తిలోదకములు మూడుదినములులోగా సమాప్తినొందింప దగినవి. మొదటిదినమున మూడుపిండములు ఇరువదియొక్క తిలోదకములు, రెండవ దినమున నాల్గుపిండములు ముప్పదిమూడు తిలోదకములు, మూడవదినమున మూడుపిండములు ఇరువదియొక్క తిలోదకములు, ఆశౌచాన్తమున నేకోద్దిష్టము మరియొక దినమున నారాయణబలియుజేయవలయు. ఐదవసంవ్సరములోగా మృతినొందినవాని కేకోద్దిష్టము మొదలగునవి లేవు కాన బ్రహ్మచారిని భుజింపజేయదగు. ద్రావిడులలో అనుపనీతుడుమృతినొందినచో తలిదండ్రులకు సోదరులకు పదిదినములాశౌచమైనను మొదటి మూడుదినములయందుగాని ఎనిమిదవదినము మొదలుకొని మూడు దినములందుగాని పిండదానాదికము జేయవలయును. జన్మదశాహామునకు పిమ్మట గర్భాష్టమ వత్సరము లోగా బాలుడు మృతినొందినచో ఖనన త్యాగ దహనసంస్కారములలో నేదియొనర్చినను ద్రావిడులకుదక్క తలిదండ్రులకును సోదరులకును త్రిరాత్రాశౌచము. జ్ఞాతులకు జనించినది మొదలు పదిదినములైనపిమ్మట నారుమాసములలోగా ఖననముజేయు పక్షమున స్నానమాత్రము. అటుపిమ్మట రెండు సంవత్సరములు పూర్తియగువరకు ఏకరాత్రము. అటుపిమ్మట గర్భాష్టమవత్సరమునకు లోగడ త్రిరాత్రము. ఐదవ మాసముననే దన్తములు వచ్చినచో నదిమొదలుకొని యేకరాత్రము. దన్తములు రాకపోయినను నేడవమాసము మొదలుకొని యేకరాత్రము. మొదటి వత్సరముననే చౌలము జేయబడినచో నదిమొదలుకొని త్రిరాత్రము. చౌలముజేయబడకపోయినను మూడవవత్సరము మొదలుకొని త్రిరాత్రము. ఐదవసంవత్సరమున నుపనయనమైనచో నదిమొదలుకొని జ్ఞాతులందరకు దశరాత్రము. ఉపనయనము జేయబడకున్నను గర్భాష్టమవత్సరము మొదలుకొని దశరాత్రము. పుట్టినదిమొదలు పదిదినములు గడచినపిదప దన్తములువచ్చుటకు లేక

ఆఱవమాసమువచ్చుటకు లోగడ దహనముజేయుపక్షమున జ్ఞాతులకేక రాత్రము. అటుపిమ్మట త్రిరాత్రము. త్యాగముజేసినపక్షమున నేక త్రము. కన్యామరణమున జన్మదశాహామునకు పిమ్మట దన్తములు వచ్చుటకుగాని యాఱవమాసమువచ్చుటకుగాని లోగడ ఖననముజేసిన పక్షమున తలిదండ్రులకును సోదరులకును ఏకరాత్రము. కొందరుత్రిరాత్రమనిరి. అటుపిమ్మట వివాహమగువరకు త్రిరాత్రము. ఐదవమాసమున దన్తములు వచ్చినచో నదిమొదలు త్రిరాత్రము. దన్తములు రాకపోయినను ఏడవమాసముమొదలుకొని త్రిరాత్రము. దహనము జేసెడి పక్షమున దన్తములురాకున్నను త్రిరాత్రము. ఇట్లె త్యాగము జేసినపక్షమునగూడత్రిరాత్రము. జ్ఞాతులకు జన్మదశాహామునకుపిమ్మట రెండుసంవత్సరములు పూర్తియగులోగా ఖననముజేసినపక్షమున స్నానమాత్రము. అటుపిమ్మట వాగ్దానమగువరకుఏకరాత్రము. అటుపిమ్మట వివాహమగువరకు తండ్రియొక్కయు భర్తయొక్కయు కులములవారికి త్రిరాత్రము. దహనముగాని త్యాగముగాని జేయబడుపక్షమున పురుషునకువలె నాచరింపదగు. అనుపనీతుడు మృతినొందినచో సమానోదకులకు స్నానమాత్రము అతిక్రాన్తాశౌచము తండ్రి మొదలగువారికి గూడ లేదు స్నానముమాత్రము చేయదగు. క్షత్రియవైశ్యశూద్రులకు క్రమముగా ధనుస్సును, త్రాసును, వస్త్రద్వయమును గ్రహించుటకు లోగడ బ్రాహ్మణులకువలెనే యాశౌచము. అటుపిమ్మట వరుసగా ద్వాదశాహము పంచదశాహము మొదలగు సంపూర్ణాశౌచము. ధనుర్గ్రహణాదికము లేకున్నను క్షత్రియవైశ్యులకు గర్భాష్టమము మొదలుకొని పూర్ణాశౌచము. శూద్రునకు గర్భసప్తమవత్సరముమొదలుకొని యేపూర్ణాశౌచము. కొన్నిదేశములయందెనిమిదవ సంవత్సరమునకు పైనను మరికొన్నిదేశములయందు పన్రెండవసంవత్సరమునకుపైనను మరికొన్నిదేశములయందు పదునారవసంవత్సరమునకుపైనను ఆచరింపబడుచుండు, క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులవలెనేయగు. ద్రావిడులకు జన్మదశాహామధ్యమున బాలుడు మృతినొందినచో తలిదండ్రులకును సోదరులకును దశరాత్రము. భిన్నోదరభ్రాతలకు దన్తజననమైన పిదప దశరాత్రము శేషముసమానము.

## —♦ ఉపనీతమృతాశౌచనిర్ణయము. ♦—

శ్లో॥ ఉపనీతమృతౌపూర్ణం సర్వేషాంమృతకంభవేత్ ।
ఏకోదకానాంత్రిదినం సగోత్రాణాన్తుమజ్జనం॥

తా॥ ఇచట యుపనీతశబ్దము వివాహితలగు స్త్రీలకుగూడ నుపలక్షణము.

శ్లో॥ స్త్రీణాముపనయస్థానే వివాహఃపరికీర్తితః ॥

తా॥ స్త్రీలకుపనయనస్థానమున వివాహము జెప్పబడెను కాన. ఉపనీతుడగు పురుషుడుగాని వివాహితయగుస్త్రీగాని మృతినొందినచో జ్ఞాతులందరకు పూర్ణాశౌచము ఏకోదకులకు త్రిరాత్రమాశౌచము. సగోత్రులకు స్నానమాత్రము.

శ్లో॥ దశాహంశావమాశౌచం సపిండేషువిధీయతే॥

తా॥ ఉపనీతుడు మృతినొందినచో సపిండులకు దశరాత్రము శావాశౌచమని మనువుచెప్పెను.

శ్లో॥ దశాహంశావమాశౌచం సపిండేషువిపశ్చితః ॥

తా॥ ఉపనీతజ్ఞాతిమరణమున సపిండులకు పదిదిములు శావాశౌచమని కూర్మపురాణవచనము.

శ్లో॥ దశాహేనసపిండాస్తు శుద్ధ్యన్తిప్రేతసూతకే ।
త్రిరాత్రేణసకుల్యాస్తు స్నాత్వాశుద్ధ్యన్తిగోత్రజాః॥

తా॥ ప్రేతాశౌచమున సపిండులు పదిదినములచేతను సమానోదకులు మూడుదినములచేతను సగోత్రులు స్నానమాత్రమునను శుద్ధులగుదురని బృహస్పతిచెప్పెను

శ్లో॥ సమానోదకానాంత్ర్యహం గోత్రజానామహఃస్మృతం ॥

తా॥ సమానోదకులకు త్రిరాత్రము. సగోత్రులకేకదినమును, ఆశౌచమనువచనము జన్మనామములయొక్క స్మృతిగల సగోత్రుల విషయమని తెలియదగును. సమానోదకులకు ఉపనీతునిమరణమునందే త్రిరాత్రము అనుపనీతునిమరణమున స్నానమాత్రము.

శ్లో॥ బాలేదేశాన్తరస్థేచ పృథక్పిండేచసంస్థితే।
సవాసాజలమాప్లుత్య సద్యఏవవిశుద్ధ్యతి ॥

తా॥ బాలుడు, దేశాన్తరగతుడు, సపిండుడుకానివాడు వీరు మృతినొందినపుడు సచేలస్నానముజేసి తత్కాలమున శుద్ధుడగును అని మనువచనము.

సూ॥ బాలదేశాన్తరితప్రవ్రజితా సపిండానాంసద్యశ్శౌచం ॥

తా॥ బాలుడు, దేశాన్తరగతుడు, సన్యసించినవాడు సపిండుడు కానివాడు వీరు మృతినొందినచో సద్యశ్శౌచమని గౌతమవచనము ఇచట అసపిండుడనగా సమానోదకుడు. స్మృతిసారసర్వస్వకారుడు మొదలగువారీవచనము అనుపనీతుడగు సమానోదకునివిషయమనిరి. మితాక్షరియందుగూడ "త్ర్యహాత్తూదకదాయినః" అను మనువచనము చేత సమానోదకులకు త్రిరాత్రాశౌచముజెప్పి ఇది యుపనీతునివిషయ మనియు అంతకుపూర్వము స్నానమాత్రమనియు జెప్పబడెను మరియు "పక్షిణీమసపిండయోనిసంబంధః" అను గౌతమవచనమునకువ్యాఖ్యానము జేయుటలో సమానోదకులకు జెప్పబడిన పక్షిణ్యాశౌచము ఉపనీతుడు పరోక్షమున మృతినొందినవిషయమున వర్తించునని స్మృతిసారసర్వస్వకారునిచే జెప్పబడెను.

—♦ అసపిండాశౌచము. —

శ్లో॥ బహుప్రకారమాశౌచ మసపిండమృతౌభవేత్ ॥

తా॥ మేనమామమొదలగు అసపిండులు మృతినొందినపుడనేకతీరులుగా నాశౌచము చెప్పదగు.

శ్లో॥ త్ర్యహంమాతామహాచార్య శ్రోత్రియేష్వశుచిర్భవేత్ ॥

తా॥ మాతామహుడు, ఆచార్యుడు, శ్రోత్రియుడు వీరు మృతినొందినచో మూడుదినములాశౌచము.

శ్లో॥ ఉపనీయతుయశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః ।
సకల్పంసరహస్యంచ తమాచార్యంప్రచక్షతే ॥

తా॥ ఏ బ్రాహ్మణుడు శిష్యునకుపనయనము జేసి కల్పశాస్త్రి ముతో రహస్యములతోగూడ వేదమునంతను జెప్పనో ఆ బ్రాహ్మణు డాచార్యుడనబడును.

సూ॥ ఏకాంఖామధీత్యశ్రోత్రియోభవతి ॥

తా॥ ఒకశాఖను పూర్తిగా నధ్యయనము జేసినచో శ్రోత్రియు డనబడును అని బోధాయనుడుచెప్పెను. మరియు "శ్రోత్రియేచోపసం పన్నే" మైత్రిచేతగాని, తనగృహమున నివసించుటచేతగాని, ద్రవ్యము నిచ్చుటచేతగాని యుపకరింపబడిన శ్రోత్రియుడు మృతినొందినపుడు డే త్రిరాత్రాశౌచమని గౌతముడుపలికెను. దౌహిత్రునకును శిష్యునకును త్రిరాత్రవిధానము ఇతరునిచే దహనముజేయబడినపుడని తెలియదగు స్వయముగా దహనముజేసినపక్షమున దశరాత్రమని తెలియదగు. అట్లు ముందు చెప్పగలము.

సూ॥ ఆచార్యతత్పుత్రస్త్రీయాజ్యశిష్యేషుచైవం ॥

తా॥ ఆచార్యుడు, వానిపుత్రుడు, వానిభార్య, యాజ్యుడు అనగా తనవలన నార్త్విజ్యముగొనువాడు శిష్యుడు వీరు మృతినొందిన పుడు త్రిరాత్రాశౌచమని గౌతమవచనము.

సూ॥ మాతామహ మాతుల మాతామహీమాతులానీనాం త్రిరాత్రేణశ్వశురస్యచ॥

తా॥ మాతామహుడు మేనమామ వీరిభార్యలు మామ వీరు మృతినొందినపుడు త్రిరాత్రాశౌచమని యంగిరసుడుపల్కె.

శ్లో॥ మాతృష్వసామాతులయోః శ్వశ్రూశ్వశురయోర్గురో।
మృతేచర్త్విజియాజ్యేచ త్రిరాత్రమశుచిర్భవేత్ ॥

తా॥ పినతల్లి పెదతల్లులు మేనమామ అత్త మామ ఋత్విక్కు యాజ్యుడు వీరుమృతినొందినపుడు త్రిరాత్రాశౌచము. ఇచ్చట కులక్ర మముగా వచ్చుచున్న ఋత్విగ్యాజ్యులనే గ్రహింపదగును. అట్లు కాని వారికి పక్షిణ్యాశౌచము ముందు చెప్పబడును మరియు,

శ్లో॥ ఆశౌచంతుత్రిరాత్రంస్యా చ్ఛ్వశ్రూశ్వశురయోర్మృతౌ ।
జీవంత్యామేవభార్యాయాం మృతాయాందివసాచ్ఛుచిః ॥
తత్సంతతౌస్థితాయాన్తు త్రిరాత్రమశుచిర్భవేత్ ॥

తా॥ భార్యజీవించియున్నను ఆమెసంబంధమగుసంతతియున్నను అత్తమామలు మృతినొందినపుడు త్రిరాత్రాశౌచము అట్లుకానిపక్షమున నొకదినమునకే శుద్ధియని వ్యాసవచనము మరియు,

శ్లో॥ పురోహితేమృతేరాజ్ఞః త్రిదినాచ్ఛుద్ధిరిష్యతే।
పురోహితోమృతేరాజ్ఞి త్రిదినాదేవశుద్ధ్యతి ॥

తా॥ పురోహితుడు మృతినొందినచో రాజునకును, రాజుమృతినొందినచో పురోహితునకును, త్రిరాత్రాశౌచమని గాలవుడుచెప్పెను. ఇచట రాజశబ్దము వైశ్యునకుగూడ ఉపలక్షకము మఱియు,

శ్లో॥ పిత్రోరుపరమేస్త్రీణాం ఊఢానాన్తుకథంభవేత్ ।
త్రిరాత్రేణవిశుద్ధిస్స్యా దిత్యాహభగవాన్యమః॥

తా॥ వివాహితలగు స్త్రీలకు తలిదండ్రులు మృతినొందినచో త్రిరాత్రాశౌచమని యముడు చెప్పెనని వృద్ధమనువచనము మరియు,

శ్లో॥ సంస్థితేపక్షిణీకార్యా దౌహిత్రేభగినీసుతే ।
సంస్కృతేతుత్రిరాత్రంస్యా దితిధర్మోవ్యవస్థితః॥

తా॥ దౌహిత్రుడు మేనల్లుడు వీరు ఉపనీతులై మృతినొందినచో త్రిరాత్రాశౌచము. అట్లుకానిచో పక్షిణియని ఆవృద్ధమనువేచెప్పెను. అనుపనీతులగు అసపిండులకు సద్యశ్శౌచము ముందు చెప్పబడును ఐనను ఈవిశేషవిధిననుసరించి అనుపనీతులగు దౌహిత్రుడు మేనల్లుడు వీరివిషయమునమాత్రము పక్షిణ్యాశౌచము చెల్లదగును.

సూ॥ శిష్యసతీర్థ్యస బ్రహ్మచారిషు త్రిరాత్రమహోరాత్రమేకరాత్రం॥

తా॥ శిష్యుడు, తీర్థ్యుడు, సబ్రహ్మచారి వీరిమరణములయందు వరుసగా త్రిరాత్రము, అహోరాత్రము, ఏకరాత్రము, ఆశౌచము. తనవద్ద విద్యజదివినవాడు శిష్యుడు. తనగురువువద్ద తాను జదివినకాల

మునందుకాక మరియొకకాలమున విద్యజదివినవాడు సతీర్థ్యుడు. ఒక యాచార్యునివలన ఉపనీతులుగాని ఏకకాలమున వేదాభ్యాసము జేసిన వారుగాని సబ్రహ్మచారులు.

శ్లో॥ పరపూర్వాసుభార్యాసు పుత్రేషుకృతకేషుచ ।
మాతామహేత్రిరాత్రంస్యా దేకాహస్తుసపిండతః ॥

తా॥ మరువివాహమాడినస్త్రీ మృతినొందినచో పూర్వాపర భర్తలకును దత్తపుత్రుడు మృతినొందినచో పూర్వాపరపితరులకును. మాతామహుడుమృతినొందినచో దౌహిత్రునకును త్రిరాత్రాశౌచము వారివారిసపిండులకేకరాత్రము. అనిహారీతుడు చెప్పెను ఈవచనము నందు "పూర్వాపరపిత్రోః" అని యధ్యాహారమునున్నా "సపిండతః" అనుపదమున కనువృత్తినిన్నియంగీకరించి దత్తునకు పూర్వాపరపితరులు మృతినొందినచో త్రిరాత్రము వారిసపిండులు మృతినొందినచో నేక రాత్రమును ఆశౌచమని స్మృతిసారసర్వస్వకారుడు వ్యాఖ్యానము జేసెను. అదియౌరసపుత్రునిచే దహనాదికము జేయబడినపక్షమునని తెలియదగును దత్తుని స్వీకరించినపిదప యౌరసుడు జనించుటగూడ కలదని యిటు చెప్పబడె. దత్తుడు స్వయముగా సంస్కరించినచో యౌరసునితో సమానుడేయగుగాన దశరాత్రాశౌచము అదియెట్లన.

శ్లో॥ దశాహమధ్యేయదిదర్శ ఆపతేద్దద్యుర్దశాహంతిలవారిపిండాన్
పుత్రీసుతోదత్తకఔరసశ్చ శేషాస్సుతాస్తత్రసమాపయేయుః॥

తా॥ మృతినొందిన పదిదినములలోపల దర్శ వచ్చిన (చన్ద్రద్వయదోషమున్నను) దౌహిత్రుడు దత్తుడు ఔరసుడు వీరు పదిదినములు తిలోదకములు పిండములు నివ్వదగు. క్షేత్రజులు మొదలగువారు ఆయమవదినాడే కర్మశేషమును సమాప్తినొందింపదగును. ఈవచనమున దత్తుడు ఔరసునితోసాటిగ పరిగణింపబడె. ఇట్టి దత్తపుత్రుడు మృతినొందినచో స్వీకరించిన తండ్రికిగూడదశరాత్రాశౌచము. దత్తుని మరణమున పూర్వాపరసపిండులకేకరాత్రాశౌచవిధి ఉపనీతునివిషయమని తెలియుదగును. అనుపనీతుడైనచో స్నానమాత్రము.

శ్లో॥ పరాశ్రితేషుదారేషు పరనారీసుతేషుచ ।
గోత్రిణస్స్నానశుద్ధాస్స్యుః త్రిరాత్రేణైవతత్పితా ॥

తా॥ మరియొకని నాశ్రయించిన భార్యయు దత్తపుత్రుడును మృతినొందినచో క్రమముగా భర్తకును తండ్రికిని త్రిరాత్రాశౌచము. వారిసపిండులు స్నానమున శుద్ధులగుదురు అని ప్రజాపతివచనము. ఈ వచనమునుపనీతుని విషయమని స్మృతిసారసర్వస్వకారుడుపలికె. పరోక్షమున మృతుడైన యుపనీతుని విషయమని గ్రన్థాన్తరమున జెప్పబడెను. ఈవ్యవస్థలు రెండును న్యాయసిద్ధములుగానుండె గాన అనుపనీతుడగు దత్తునిమరణమునందును ఉపనీతుడగు దత్తునిపరోక్షమరణమునందును పూర్వాపరసపిండులకు స్నానమాత్రము. దత్తుడుపరోక్షమున మృతినొందినచో పూర్వాపరపితరులకేకరాత్రిశౌచమనునది. ముందు చెప్పబడును వ్యభిచారిణి మృతినొందినచో వెనుకటిభర్తకుత్రిరాత్రము.

శ్లో॥ అసౌరసేషుపుత్రేషు భార్యాస్వన్యగతాసుచ ।
పరపూర్వాసుచస్వాసు త్రిరాత్రాచ్ఛుద్ధిరిష్యతే॥

తా॥ ఔరసులుకాని పుత్రులు వ్యభిచారిణులగు భార్యలు పూర్వమొకనిని వివాహమాడి పిమ్మట తనవద్దచేరిన ఉంపుడుకత్తెలు వీరుమృతినొందినచో త్రిరాత్రాశౌచము అని శంఖుడుచెప్పెను. ఈస్వైరిణి (వ్యభిచారిణి) మొదలగువారు ప్రసవించినపుడు త్రిరాత్రిజాతాశౌచముకలదు.

శ్లో॥ అసౌరసేషుపుత్రేషు జాతేషుచమృతేషుచ ।
పరపూర్వాసుభార్యాసు ప్రసూతాసుమృతాసుచ ॥

తా॥ క్షేత్రజులు పౌనర్భవులు మొదలగు పుత్రులు జనించినను మృతినొందినను వ్యభిచారిణులు ప్రసవించినను మృతినొందినను త్రిరాత్రాశౌచమని విష్ణువచనము ఇచ్చట వ్యభిచారమనగా అనులోమవ్యభిచారమని తెలియదగు. ప్రతిలోమ వ్యభిచారమున ఆశౌచమేలేదు. అని నిబంధకారులు చెప్పిరి. ఒకతల్లియందు ఇరువుర తండ్రుల వలన జనించిన సోదలిరువురకు పరస్పరము త్రిరాత్రాశౌచము.

శ్లో॥ మాతైకయాద్విపితృకౌ భ్రాతరావన్యగోచరౌ।
ఏకాహంసూతకంతత్రి త్రిరాత్రంమృతకేతయోః॥

తా॥ ఒకతల్లియందిరువురు తండ్రులచే జనించిన సోదరులకు జాతాశౌచమేకరాత్రము మృతాశౌచము త్రిరాత్రము అని మరీచిచే జెప్పబడెను మరియు.

శ్లో॥ గృహేయస్యమృతఃకశ్చి దసపిండఃకథంచన।
తత్రాశౌచంతువిజ్ఞేయం త్రిరాత్రంనాత్రసంశయః ॥

తా॥ తనకుసపిండుడుకానివాడు తనగృహమునమృతినొందినచో త్రిరాత్రాశౌచమునవలంబింపవలయునని యంగిరసుడుపలికె. ఈయసపిండుడు శ్రోత్రియుడైనచోనని తెలియదగును. "శ్రోత్రియేచోపసంపన్నే" అని యుదహరింపబడువచనమువలన శ్రోత్రియుడుకానిచో నేకరాత్రమేయగు. ఈయభిప్రాయముచేతనే విష్ణువుగూడ,

సూ॥ అసపిండేషుస్వవేశ్మనిమృతేష్వేకరాత్రం ॥

తా॥ తనసపిండులుకానివారు తనగృహమున మృతినొందినచో నేకరాత్రాశౌచమనిపల్కె. ఇచట సపిండుడుకానివాడనగా సమానోదకుడని యర్థముజెప్పినచో సమానోదకుడు తనగృహముకంటె యితర ప్రదేశమున మృతినొందినను త్రిరాత్రాశౌచమావశ్యకమగుటచే నాయర్థమసమంజసమగుగాన తనతో బంధుత్వము లేని యొకానొకడని యర్థము వర్ణింపదగును మరియు.

శ్లో॥ దత్తానారీపితుర్గేహే ప్రసూయేతమ్రియేతవా ।
తద్బంధువర్గస్త్వేకేన శుద్ధ్యేజ్జనకస్త్రిభిః॥

తా॥ వివాహితయగుస్త్రీ తండ్రిగృహమున మృతినొందినను, ప్రసవించినను తండ్రి మూడుదినములచేతను వానిజ్ఞాతివర్గమొకదినముచేతను శుద్ధినొందు. ఇచట జనకశబ్దము సోదరులకుగూడ నుపలక్షణమని చంద్రికయందు జెప్పబడె కొందరు బంధువర్గము అను పదముచేత భ్రాతృవర్గము చెప్పబడుననియు జనకశబ్దము తల్లికిమాత్రముపలక్షణమనియు వ్యాఖ్యానముజేసిరి. అది ద్రావిడవిషయము. ద్రావిడులు

గూడ పక్షిణ్యాశౌచము నాచరింతురు. ఇది తండ్రిగృహమున ప్రసవమైనచోనని తెలియఁదగు. మరియొకగృహమందైనచో తలిదండ్రులకాశౌచము లేదని చంద్రికయందు జెప్పఁబడె. మరియొక స్మృతియందు కన్యాప్రసవముల పక్షిణ్యాశౌచము చెప్పబడినది. తండ్రి మొదలగువారు విభక్తులై వేరువేరుగృహములనివసించుచున్నచో నపుడు తండ్రిగృహమున ప్రసవించినచో తండ్రికిమాత్రము త్రిరాత్రము. సోదరుని యింట ప్రసవించినచో సోదరునకుమాత్రము త్రిరాత్రము. జ్ఞాతియింట మృతినొందినచో వానికి ఏకరాత్రముమాత్రమేగాని త్రిరాత్రముకానేరదు. "గృహేయస్యమృతఃకశ్చిత్" అను యంగిరసుని వచనమున విధింపబడిన ఉపసంపన్నాశౌచము పురుషుని విషయమును అందును శ్రోత్రియుని విషయమునమాత్రము చెల్లఁదగును.

శ్లో॥ శ్రోత్రియేచోపసంపన్నే త్రిరాత్రమశుచిర్భవేత్ ।
అశ్రోత్రియేత్వహఃకృత్స్న మనూచానేతథావిధం ॥

తా॥ తనగృహమున తనబంధువుడుగాని శ్రోత్రియుఁడు మృతినొందినచో త్రిరాత్రాశౌచము అశ్రోత్రియుడు మృతినొందినచో నొకదినమును అనూచానుడు మృతినొందినను అట్లె యాశౌచమని మనువు శ్రోత్రియాశ్రోత్రియశబ్దముల నుదహరించుచు వేరువేరుగా విధించియుండెను. "నస్త్రీమృతావిదంకించిత్" అని స్త్రీమరణమున ఉపసంపన్నాశౌచమేమాత్రమును లేదనిచెప్పియుండె మరియు,

శ్లో॥ పితృగేహాదతోన్యత్ర యదికన్యాప్రమీయతే ।
తత్రస్యాత్పక్షిణీపిత్రో పిత్రోర్నాన్యేషామితినిశ్చయః ॥
పుత్రీగేహేథవాన్యత్ర పితరౌప్రమృతౌయది।
దశాహోభ్యన్తరేపుత్ర్యా స్త్రిరాత్రంశావసూతకం॥
స్వసుర్గేహేమృతోభ్రాతా భ్రాతుర్వాథగృహేస్వసా।
ఆశౌచంత్రిదినంతత్ర పక్షిణ్యేవపరత్రతు ॥
భగినీసూతకంచైవ భ్రాతుశ్చైవాథసూతకం।
నైవస్యాద్భ్రాతృపత్న్యాస్తు తథాచభగినీపతేః ॥

తస్యైవయస్యయత్రోక్త మాశౌచంచాన్యగోత్రిణాం ।
భవేన్నైవాధతత్పత్న్యా ఇత్యేవంమునయోవిదుః ॥

తా॥ కన్య తండ్రి గృహమునందుగాక మరియొకచోట మృతి నొందినచో తలిదండ్రులకు పక్షిణ్యాశౌచము. జ్ఞాతులకేమియు లేదు. తలిదండ్రులు కొమరిత గృహమునందుగాని మరియొక ప్రదేశమునగాని మృతినొందినచో పుత్రికకు పదిదినములలోపల నెప్పుడువినినను అది మొదలు త్రిరాత్రాశౌచము. సోదరునియింట సోదరియు, సోదరియింట సోదరుడుగాని మృతినొందినచో నాసోదరీసోదరులకు పరస్పరము త్రిరాత్రాశౌచము అట్లుగాక మరియొకచోట మృతినొందినచో పక్షిణిమాత్రమేయగు. ఈసోదరీసోదరులకు పరస్పరము చెప్పబడిన యాశౌచము వారికిమాత్రమే చెల్లదగుగాని సోదరుని భార్యకును, సోదరి భర్తకును చెల్లదు. ఇట్లే అన్యగోత్రికులవలన గలిగెడి యాశౌచమెవనికి చెప్పబడెనో వానికిమాత్రమే చెల్లునుగాని వానిభార్య మొదలగువారికి లేదని మునులుచెప్పిరి మరియు,

శ్లో॥ యావద్భర్తురఘంతావ త్తత్పత్నీనాంతథైవచ ॥

తా॥ భర్తకెన్నిదినములాశౌచమో వానిభార్యకును అన్నిదినములాశౌచము అను లిఖితునివచనము ద్రావిడవిషయము. ఇచ్చట భగినీపతికాశౌచములేదని ప్రతిపాదించువచనము గృహాంతర మరణ విషయమని తెలియదగు భగినీగృహముననే మృతినొందినచో భగినీ పతికి ఉపసంపన్నాశౌచము త్రిరాత్రమావశ్యకమగు. పుత్రికమరణించినపుడు తలిదండ్రులకు పక్షిణ్యాశౌచవిధి గ్రామాంతరవిషయమని స్మృత్యర్థసారమున ప్రతిపాదింపబడెను కాన స్వగ్రామమునగాని స్వగృహమునగాని పుత్రిక మృతినొందినచో తండ్రి గ్రామాంతరమునందున్నను వానికి పక్షిణ్యాశౌచమేయగు. మరియు తనగృహముననేయొకానొకడు మృతినొందినను వానితో తనకు బంధుత్వము లేకపోయినను దంపతులకిరువురకును త్రిరాత్రాశౌచము. ఈయుపసంపన్నాశౌచము భర్తకేగాని భార్యకులేదనదగదు. ఉపసంపన్నాశౌచము గృహస్వాములకందరకును వర్తించు "విభాషాసపూర్వస్య" అను సూత్రమున

గృహపతిశబ్దము పత్నియందు రూపభేదమునను దహరింపబడుటచే పత్ని గూడ గృహస్వామికాదగును యల్లాజీయమునందు పైతృమేధికసంస్కార ప్రకరణమునందు పత్నిగూడ గృహస్వామిత్వముగలదగుటచే భర్తకువలెనే యాచరింపదగునని యనేకతావులప్రతిపాదింపడెను. ఈ కారణమువలన పుత్రికలకుగూడ గృహస్వామిత్వము నాశంకింపజనదు. ఎచ్చటను పుత్రికలు గృహస్వాములైనటుల వ్యవహారము కనబడదు ఇక పక్షిణ్యాశౌచవిధి.

సూ॥ పక్షిణీమసపిండయోనిసంబంధేసహాధ్యాయినిచ ॥

తా॥ సపిండ వ్యతిరిక్తులగు యోనిసంబంధులుగను, సహాధ్యాయియు, మృతులైనపుడు పక్షిణ్యాశౌచమని గౌతమవచనము. పినతండ్రి మొదలగు యోనిసంబంధుల విడదీయుటకై "అసపిండ" అనువిశేషణము ఇట్టి సపిండులుగాని యోనిసంబంధులు మేనమామ పినతల్లి పెదతల్లులకొమరులును అని చంద్రికాదులయందు వ్యాఖ్యానము జేయబడెను. మాధవీయమునందు అసపిండుడు యోనిసంబంధుడు అని ద్వన్ద్వసమాసమునవలంబించి అసపిండుడనగా బంధుత్వము లేని యొకానొకడని వ్యాఖ్యానము జేయబడెను. ఇందు చంద్రికావ్యాఖ్యానమే సమంజసము మాధవీయవ్యాఖ్యానమునకు "శ్రోత్రియే చోపసంపన్నే త్రిరాత్రం అను మనువు మొదలగువారి వచనములకు విరోధము. యోనిసంబంధులనగా కూటస్థమగు ఒక మిథునమువలన పుట్టినవారు పినతల్లి పెదతల్లులు మేనమామలుగూడ నట్టివారేయగుదురు. వీరికి త్రిరాత్రము విధింపబడియుండుటచే పక్షిణియెట్లగును అనినచో యోనిసంబంధులకెచ్చట విశేషవిధులవలన నధికాశౌచము చెప్పబడదో అచటనే పక్షిణ్యాశౌచమువర్తించు. "యోనిసంబంధబాన్ధవేషుత్రిపూరుషం" యోనిసంబంధముగల బందుగులవిషయమైన యాశౌచము మూడుపురుషాన్తరములవరకుమాత్రము చెల్లదగును అని వ్యాసవచనము ఇట్లె చన్ద్రికాదులయందుగూడ జెప్పబడె కాన కూటస్థుని మొదలుకొని పరిగణింపగా ముప్పురకుమాత్రమే యీయాశౌచము. బాన్ధవుల స్వరూపము మరియొక స్మృతియందు జెప్పబడెను.

శ్లో॥ ఆత్మపితృష్వసుఃపుత్రా ఆత్మమాతృష్వసుస్సుతాః ।
ఆత్మమాతులపుత్రాశ్చ విజ్ఞేయాఆత్మబాన్ధవాః ॥
పితుఃపితృష్వసుఃపుత్రాః పితుర్మాతృష్వసుస్సుతాః ।
పితుర్మాతులపుత్రాశ్చ విజ్ఞేయాఃపితృబాన్ధవాః ॥
మాతుఃపితృష్వసుఃపుత్రాః మాతుర్మాతృష్వసుస్సుతాః।
మాతుర్మాతులపుత్రాశ్చ విజ్ఞేయామాతృబాన్ధవాః ॥

తా॥ తనమేనత్తకొమరులు తన పినతల్లి పెదతల్లుల కొమరులు తనమేనమామ కొమరులును తనబంధువులు తండ్రిమేనత్తకొమరులు తండ్రి పినతల్లి పెదతల్లుల కొమరులు తండ్రిమేనమామ కొమరులును పితృబాంధవులు. తల్లిమేనత్తకొమరులు తల్లిపినతల్లి పెదతల్లులకొమరులు తల్లిమేనమామ కొమరులును మాతృబాంధవులనబడుదురు. ఇచట పినతల్లి పెదతల్లులు మొదలగువారుగూడ బంధువులేనని తెలియదగును. సహాధ్యాయికి పక్షిణ్యాశౌచవిధి. పండ్రెండుసంవత్సరములు తనతోగూడ జదివినవానివిషయమనికాని తనతోగూడ వేదమునంతను జదివినవాని విషయమనిగాని తెలియదగును తనతోగూడి అల్పకాలము చదివినవానివిషయముననుు వేదము కొంతభాగముమాత్రము చదివినవానివిషయమునను ఏకరాత్రాశౌచము ముందుచెప్పబడును అట్లే చంద్రికాదులయందు చెప్పబడె.

శ్లో॥ శ్వశురయోర్భగిన్యాంచ మాతులాన్యాంచమాతులే ।
పితృష్వసరితద్వచ్చ పక్షిణీంక్షపయేన్నిశాం ॥
మాతులేశ్వశురేమిత్రే గురౌగుర్వంగనాసుచ ।
ఆశౌచంపక్షిణీంరాత్రిం మృతామాతామహీయది ॥

తా॥ అత్తమామలు ,సోదరి, మేనమామ, వానిభార్య,మేనత్త, మామయగుమేనమామ మిత్రుడుగురువు, గురుభార్య, మాతామహి వీరిమృతియందు పక్షిణ్యాశౌచమని వృద్ధమనువచనము. మామమొదలగువారికి పక్షిణ్యాశౌచవిధి యసన్నిధానవిషయము. మేనమామను రెండవ పర్యాయము గ్రహించుట. అతడేమామమైనను పక్షిణ్యా

శౌచమేగాని యంతకుమిగిలిన యాశౌచములేదని సూచించుటకని చంద్రికాదులయందు వ్యాఖ్యానముజేయబడె.

శ్లో॥ నిషేకాదీనికర్మాణి యఃకరోతియథావిధి।
సంభావయతిచాన్నేన సవిప్రోగురురుచ్యతే॥
అల్పంవాబహువాయస్య శృతస్యోపకరోతియః।
తమపీహగురుంవిద్యా చ్ఛృతోపక్రియయాతయా॥

తా॥ నిషేకము మొదలగు కర్మలను యథావిధిగజేసి అన్నముచే పోషించిన బ్రాహ్మణు గురువనబడు ఎవనికి ఎవడు శాస్త్రము విషయమై కొంచముగాగాని విస్తారముగాగాని యుపకరించునో వానికి వాడాశృతమువిషయమై యొనర్చిన సహాయముచేతనే గురువనబడును. అను మనువచనము జెప్పబడిన లక్షణముగలవాడు గురువనబడును. మరియు,

శ్లో॥ మాతృబంధౌగురౌమిత్రే మండలాధిపతౌతథా॥

తా॥ అను జాబాలివచనమున మాతృబంధువులకును గురువునకును ఏకరాత్రవిధానమ సన్నిధానవిషయము. మండలాధిపతి మరణమున నేకరాత్రవిధానము మహామండలాధిపతివిషయము అల్పమండలాధిపతివిషయమున సజ్యోతిరాశౌచము ముందుచెప్పబడును.

శ్లో॥ అహస్త్వదత్తకన్యాసు బాలేషుచవిశోధనం।
గుర్వంతేవాస్యనూచాన మాతులశ్రోత్రియేషుచ॥
అనౌరసేషుపుత్రేషు భార్యాస్వన్యగతాసుచ॥

తా॥ వివాహముగాని కన్య, బాలుడు, గురువు, శిష్యుడు, తనవద్దవేదాంగమగు శాస్త్రము నభ్యసించినవాడు, మేనమామ, శ్రోత్రియుడు, ఔరసుడుగాని పుత్రుడు, వ్యభిచారిణియగు భార్య వీరివిషయమున నొకదినముమాత్రమాశౌచమని యాజ్ఞవల్క్యమహర్షి చెప్పెను. ఇచ్చట శ్రోత్రియపదము తనకుసబ్రహ్మచారియై తనగ్రామముననున్న శ్రోత్రియునివిషయమని తెలియదగును.

సూ॥ ఏకాహంసబ్రహ్మచారిణి సమానగ్రామిణిశ్రోత్రియే॥

తా॥ సబ్రహ్మచారియు సమానగ్రామవాసియునగు శ్రోత్రి యునివిషయమున నొకదినమాశౌచమని యాశ్వలాయనునివచనము. ఈ వెనుకటి యాజ్ఞవల్క్యవచనము అసన్నిహితులగు గురువు మొద లగువారివిషయమున వర్తించును ఆవచనమున మాతులుడనగా భిన్ను డగుమేనమామ మరియు,

సూ॥ ఆచార్యపత్నీ గురూపాధ్యాయ మాతులశ్వశురశ్వశూ సహాధ్యాయిశిష్యేష్వేకరాత్రేణశుద్ధిః॥

తా॥ ఆచార్యునిభార్య, గురువు, ఉపాధ్యాయుడు, మేనమామ, మామ అత్త, సహాధ్యాయి, శిష్యుడు వీరి మరణమున నొకరాత్రిచే శుద్ధియుని విష్ణువచనము. ఇచ్చట ఆచార్యుడనగా జపింపదగిన మంత్ర మునుపదేశించినాడని స్మృతిముక్తాఫలకారుడు చెప్పెను. ఉపాధ్యాయ లక్షణము.

శ్లో॥ ఏకదేశంతు వేదస్య వేదాంగాన్యథవాపునః ।
యోధ్యాపయతివృత్త్యర్థ ముపాధ్యాయస్సఉచ్యతే ॥

తా॥ వేదమున కొంతభాగమునుగాని, వేదాంగములనుగాని, జీవనార్థమధ్యాపన జేయించువాడుపాధ్యాయుడనంబడును అని మను చము పై యాజ్ఞవల్క్యవచనమున మృతినొందిన కొమరితయు ఆమె సంతానముగలమామయు పండ్రెండుసంవత్సరములకులోబడినకాలము తనతోగూడి చదివినట్టిగాని వేదమున కొంతభాగమునుమాత్రము తన తోగూడ చదివినట్టిగాని సహాధ్యాయినిన్నీ సమీపమునందులేని శిష్యు నిన్నీ గ్రహింపదగును. ఇచట భిన్నమాతులునిగ్రహించుట భిన్న మాతృష్వస్రాదులకుగూడ ఉపలక్షణము.

శ్లో॥ భిన్నమాతృష్వసుర్భిన్న పితృష్వసురహాస్స్మృతం।
తత్సుతానామథాహశ్చ మరణేభృగురబ్రవీత్ ॥

తా॥ సవతితల్లి తోబుట్టినవాడు భిన్నమాతులుడనబడు ఆసవతి తల్లితో బుట్టినదియే భిన్నమాతృష్వసయనబడును. వీరును వీరిపుత్రు లును మృతినొందినపుడు ఒకదినముమాత్రమాశౌచమని అత్రిమహర్షి

పలికె. మరియు దత్తునకు ప్రతిగ్రహించిన తల్లియొక్క సోదరుడు భిన్న మాతులుడు. ఆమెసోదరి భిన్నమాతృష్వసయగు. తనతల్లితో జారత్వముజేసెపివాని భార్యయొక్క సోదరుడు భిన్నమాతులుడు సోదరిభిన్న మాతృష్వసయగు. ఈ జారునిసోదరి భిన్నపితృష్వసదత్తునకు ప్రతిగ్రహించిన తండ్రియొక్కసోదరి భిన్నపితృష్వసయగు. ఈయర్థమంతయు వివక్షితమేయగునని స్మృతిముక్తాఫలమున వ్యాఖ్యానము జేయబడెను కాన ఈచెప్పబడినభిన్నమాతులుడు మొదలగువారిమరణమున సపత్నీపుత్రుడు దత్తుడు కుండుడు భాగినేయుడు మొదలగువారికేకరాత్రాశౌచము. దత్తునకు తల్లికి సంబంధులగు మేనమామ మొదలగువారు మృతినొందినపుడు వారుయోనిసంబంధులగుటవలన పక్షిణ్యాశౌచము.

శ్లో॥ దత్తస్వసరిస్వస్రీయే దత్తభ్రాతృసుతాస్వపి ।
పితృష్వసుశ్చతత్పుత్ర దుహిత్రోఃపక్షిణీమృతౌ ॥
పితృవ్యేతద్దుహితరి తత్పుత్రేషుచపక్షిణీ ॥

తా॥ దత్తునకు ప్రతిగ్రహస్థానమున సోదరి, సోదరుని కుమరిత, మేనత్త, వీరి పుత్రులు పుత్రికలు మృతినొందినపుడు పక్షిణ్యాశౌచము ఇట్లే పినతండ్రి వానికొమరిత కొమరులు మృతినొందినపుడుగూడ యాశౌచము.

శ్లో॥ దత్తస్యపుత్రజననే మరణేపూర్వగోత్రిణాం।
స్నానమాత్రంసచేలంస్యా న్నాశౌచంవిద్యతేక్వచిత్ ॥

తా॥ దత్తునకు పుత్రుడు జనించినను, మరణముసంభవించినను, జనకస్థానమునందలి పూర్వగోత్రికులు స్నానమాత్రమున శుద్ధులగుదురు ఆశౌచమేమాత్రమును లేదనువచనము మూడుపురుషాన్తరముకు వెలుపలివారివిషయమని తెలియదగు. వివాహితయగు సవతికొమరితకును సవతితల్లికిని పరస్పరము ఏకరాత్రాశౌచము.

శ్లో॥ యాసపత్నీసుతామాతృ సపత్నీమాచతేమిథః ।
అహోరాత్రేణశుద్ధ్యేతా మాహపారస్కరోమునిః ॥

తా॥ సవతికొమరితయు తల్లిసవతియుపరస్పరము ఏకరాత్రమున శుద్ధులగుదురని పారస్కరవచనము.

—♦ ఇకజ్యోతిరాశౌచము. ♦—

శ్లో॥ ప్రేతేరాజనిసజ్యోతి ర్యస్యస్యాద్విషయేస్థితః॥

తా॥ తానెవనిదేశముననున్నాడో ఆరాజు మృతినొందినచో సజ్యోతిరాశౌచము అనఁగా నక్షత్రములజూచువరకాశౌచము ఇది స్వల్పమండలాధిపతివిషయము.

శ్లో॥ గ్రామేశ్వరేకులపతౌ శ్రోత్రియేచతపస్విని।
శిష్యేపంచత్వమాపన్నె శుచిర్నక్షత్రదర్శనాత్॥

తా॥ గ్రామాధిపతి, కొందరుమనుష్యులయొక్క సముదాయముసకు నాయకుడగువాడు, శ్రోత్రియుడు, తపశ్శాలి, శిష్యుడు వీరు మృతినొందినచో నక్షత్రదర్శనమున శుద్ధియగునని వృద్ధమనువచనము ఇచ్చట శ్రోత్రియుని శిష్యునిగ్రహించుట అసన్నిధానమున వికల్పమను అభిప్రాయమునగాని అసన్నిహితుడగు శ్రోత్రియుడు తనవలన జపింపదగిన మంత్రమునుగొనిన శిష్యుడను అభిప్రాయమునగానికాదగును. అట్టి గురువు విషయమై శిష్యునకుగూడ సజ్యోతిరాశౌచమేయగును. మరియు,

శ్లో॥ గ్రామేశ్వరేకూటపతౌ పితృమాత్రాత్మబంధుషు।
మిత్రేజామాతరిప్రేతే స్యాలకేతత్సుతేతథా॥
చరేదేకాహమాశౌచం విదేశేస్నానమాచరేత్॥

తా॥ తనకనేకోపకారములనొనర్చిన గ్రామాధిపతియు, సంఘాధ్యక్షుడును, మిత్రుడును, అసన్నిహితులగు పితృబాన్ధవ మాతృబాన్ధవ ఆత్మబాన్ధవులును అల్లుడును స్యాలకుడును మృతినొందిపుడొకదినమాశౌచము. వీరిమరణము విదేశమునందైనచో స్నానమాత్రము.

శ్లో॥ జామాతాశ్వశురఃశ్వశ్రూ మ్రియతేస్వగృహేయది।
ఆశౌచంత్రిదినంతత్ర పరవేశ్మనిపక్షిణీ॥

తా॥ అల్లుడు, మామ, అత్త, వీరు సన్నిధానమున మృతినొందినచో త్రిరాత్రాశౌచము, అసన్నిధానమున పక్షిణ్యాశౌచము అని ధర్మప్రవృత్తియందు చెప్పబడె. ఈశ్లోకమున స్వగృహాశబ్దము

సన్నిధానార్థకమనిన్ని పరవేశ్మశబ్దము అసన్నిధానార్థకమనిన్ని చెప్ప వలయును. అట్లుగాక స్వగృహము పరగృహము అనియేయర్థమనియు తనగృహమునవారు మృతినొందినచో త్రిరాత్రముపసంపన్నాశౌచమని యుచెప్పినచో "నస్త్రీమృతావిదంకించిత్" అను వచనముచే స్త్రీమర ణమునను సంపన్నాశౌచమునిషేధింపబడుటచే అత్తమృతినొందినపుడు ఈవచనమునకు సమన్వయము లేకపోవును. ఓయీ ధర్మప్రవృత్తివచ నములందు అనేకతావుల స్త్రీమరణమునందుగూడ ఉపసంపన్నాశౌ చము విధింపబడియుండెగాన స్త్రీకిగూడ యుపసంపన్నాశౌచము వికల్పముగా చెల్లదగుననినచో అత్తవిషయమున సన్నిధానమాత్రముననే త్రిరాత్రాశౌచము వెనుకచెప్పబడెగాన "తరవేశ్మనిపక్షిణీ" అనువచన మునకు సమన్వయము లేకపోవును కాన సన్నిధానమున త్రిరాత్రము అసన్నిధానమున పక్షిణిఅనియే చెప్పవలయును ఇట్లె శిష్టాచారము స్త్రీమరణమున నుపసంపన్నాశౌచము వికల్పమనుమాటయసంగతము "అశ్రోత్రియేత్వహఃకృత్స్నం" అను వచనముచే శ్రోత్రియుడుగాని పురుషుడు తనగృహమున మృతినొందినపుడొకదినము మాత్రముపసంప న్నాశౌచము విధింపబడుటచే కైముతికన్యాయమున స్త్రీమరణమున నాయుపసంపన్నాశౌచమేమాత్రము లేదు. కాని పుత్రిక తండ్రిగృహ మున మృతినొందినపుడు తలిదండ్రులకు త్రిరాత్రాశౌచము చెప్పబడి నటుల పక్షిణ్యాశౌచవిషయులగు. మేనత్త మొదలగువారు తనగృహ మున మృతినొందినచో ఉపసంపన్నాశౌచవిధికంటె మరియొకటగు విశేషవిధివలన త్రిరాత్రముయుక్తమేయగు. ఉపసంపన్నాశౌచము శరీరసంబాధరహితుడగు పురుషుడు తనగృహమున మృతినొందినపుడు మాత్రమేనని తెలియదగు అదియు శ్రోత్రియుని విషయమున త్రిరా త్రము, అశ్రోత్రియునివిషయమున నేకరాత్రము మరియు,

శ్లో॥ భగిన్యాంసంస్థితాయాంతు భ్రాతర్యపిచసంస్థితే।
మిత్రేజామాతరిప్రేతె దౌహిత్రేభగినీసుతే॥
స్యాలకేతత్సుతేచైవ సద్యస్స్నానేనశుద్ధ్యతి॥

తా॥ సోదరి, సోదరుడు, మిత్రుడు, అల్లుడు, దౌహిత్రుడు, మేనల్లుడు, బావమరది, వానికొమరుడు వీరిమరణమున స్నానముననే శుద్ధిగల్గుననువచనము అతిక్రాన్తాశౌచవిషయమని తెలియదగు. స్యాల కునివిషయమున అసన్నిధానవిషయము, సన్నిధానమున నేకరాత్రము

శ్లో॥ శ్వశురస్యసుతేప్రేతే త్వహోరాత్రేణశుద్ధ్యతి ॥

తా॥ స్యాలకుని మరణమున నొకదినముమాత్రమాశౌచమను వచనమునుదహరించి విజ్ఞానేశ్వరుడుగూడ నిట్లు చెప్పెను. దౌహిత్రి భాగినేయులవిషయమై సద్యశ్శౌచము చౌలమునకు పూర్వకాలవిషయ మని తెలియదగును. చంద్రికాదులయందుగూడ నిట్లుచెప్పబడెను. వివాహితలగు స్త్రీలకు పితృపక్షమునను మాతృపక్షమునను తల్లి తండ్రి సోదరులు వీరుదక్క మిగిలినవారెవరు మృతినొందినను స్నాన మాత్రము. వారుమృతినొందినచో వీరికిగూడస్నానమాత్రమేయగును.

శ్లో॥ భగిన్యశ్చాత్మనఃపిత్రో ర్మాతామహశ్చతత్సుతాః ।
మ్రియంతేదత్తకన్యాయాః స్నానంతేషాంతథోచ్యతే ॥

తా॥ తనభగినులు, తలిదండ్రులభగినులు, మాతామహుడు, మాతామహి వీరికొమరులు వీరుమృతినొందినచో వివాహితయగు కన్యకు స్నానమాత్రమేయగు. ఈ వివాహితయగు కన్య మృతినొంది నచో వీరలకుగూడ స్నానమాత్రమేయగునని ధర్మప్రవృత్తియందు జెప్పబడెను. అందే,

శ్లో॥ పితృష్వసామాతృష్వసా స్వసుర్భర్తామృతోయది ।
దశాహాభ్యన్తరేస్నానా చ్ఛుద్ధిరూర్ధ్వంనకించన ॥

తా॥ మేనత్త పినతల్లి పెదతల్లులు సోదరియొక్క భర్తయు వీరి మరణము దశాహమునకులోగడ వినబడినచో స్నానమునశుద్ధి. పిమ్మట వినబడినచో నేమియులేదు అని చెప్పబడె. తండ్రిగృహమున పుత్రిక మృతినొందినచో జ్ఞాతులకేకరాత్రాశౌచమను విశేషము వెనుక జెప్ప బడినది. ఆత్మ, పితృ, మాతృ. భగినులవిషయమున వివాహితయగు స్త్రీకి స్నానమాత్రము చెప్పుచున్న ధర్మప్రవృత్తివచనమునకు మూల

భూతమగు స్మృతివచనమెచ్చటను కాన్పింపమి కాన పక్షిణ్యాశౌచము కలదు.

శ్లో॥ పక్షిణీయోనిసంబంధే నాతికాలేనసూతకే।
నోపనీతేరథఃపుంసో నపాణిగ్రహణాత్ స్త్రియాః॥

తా॥ పక్షిణ్యాశౌచము నవలంబింపదగిన యోనిసంబంధులగు పురుషులకుపనయనము కాకపూర్వమును స్త్రీలకు వివాహము కాకపూర్వమును ఆశౌచమే లేదు. పిమ్మట అతిక్రాన్తాశౌచముగాని సూత్యాశౌచములేదు అని స్మృత్యన్తరమున జెప్పబడెను. స్మృతిసారసర్వస్వాదిగ్రన్థములయందుగూడ ఎవరివిషయమున త్రిరాత్రాద్యాశౌచము చెప్పబడినదో వారు ఉపనయనమునకులోగడ మృతినొందినచో స్నానమాత్రమేనని చెప్పబడినది. అందువలననే అనుపనీతులగు సమానోదకులు మృతినొందినపుడు స్నానమాత్రము జెప్పబడినది మరియు,

సూ॥ మాతుశ్చయోని సంబంధేభ్యః పితుశ్చాసప్తమాత్పురుషాద్యావతాసంబంధోజ్ఞాయతే తేషాంప్రేతేషూదకోపస్పర్శనం గర్భాన్పరిసమాప్యాపరిసంవత్సరాన్॥

తా॥ వివాహితలగు స్త్రీలు తమతమ మాతృపక్షమున యోని సంబంధులును పితృపక్షమున నేడవ పురుషునకు లోబడినవారును ఆయేడవపురుషునకుపైబడియు సంబంధజ్ఞానముగలవారును మృతినొందినపుడు స్నానమాత్రముచేయదగును. సంవత్సరమునకులోబడినవయస్సుగలవారివిషయమున నదియులేదు అనునాపస్తంబవచనము సపిండులు సమానోదకులు మొదలగువారు మృతినొందినపుడు స్నానమును విధించుటయందు తాత్పర్యముగలదేగాని స్నానమాత్రమును విధించుటయందు తాత్పర్యముగలదికాదు. ఆయాసంబంధులు మృతినొందినపుడాయాచెప్పబడిన యాశౌచమును నివర్తింపజేయు తాత్పర్యమీవచనమున లేదు. ఈ వచనమున సంవత్సరము నిండనిబాలుడు మృతినొందినపుడు స్నానమక్కర లేదనిచెప్పుట వికల్పాభిప్రాయముగాని ఆపస్తంబ మతముగాని కాదగును. యుగాన్తరమున వృత్తస్వాధ్యాయములనను

సరించి చెప్పబడిన యాశౌచసంకోచ విషయమనియైనను చెప్పదగు కాన విరోధములేదు. ఇచట నుదహరింపబడిన వచనములయందెచ్చ టెచ్చటవిరోధముకనబడునో అచ్చటచ్చటసన్నిధానము అసన్నిధానము బహూపకారములు అవిలేకపోవుట కాలమతిక్రమించుట అతిక్రమింప కుండుట మొదలగువానిచే విషయభేదమునుకల్పించి వ్యవస్థజేయదగు. ఇవిసంభవింపనితావున తుల్యబలవికల్పమని తెలియదగును. చంద్రిక మొదలగు నిబంధములయందుగూడ నిశ్లేకనుపట్టుచుండును. కొన్ని వచనములయందు గుణములు అవగుణములు వీటిననుసరించి యాశౌచ మునకు వ్యవస్థచేయబడినది. పాపబహులమగు కలియుగమున గుణావ గుణముల వివేచించుట సాధ్యపడమిచే నది కాలాన్తరవిషయమనిగాని దేశాన్తరవిషయమనిగాని తెలియదగును. పరాశరుడు భస్మాన్తసూత కులవిషయమునగూడ దశాహాశౌచమును విధించియుండెగాన గుణావ గుణములభేదముననుసరించి వ్యవస్థజేయుచున్నవచనములు కాలాన్తర విషయములు ఇట్టివచనములు కొన్ని మత్స్యపురాణమునగలవు.

శ్లో॥ మాతామహేతథాచార్యే బహుయజ్ఞకృదృత్విజి ।
స్వస్రీయేచైవదౌహిత్రే గురాయాజ్యేచసన్నిధౌ ॥
మృతేత్రిరాత్రమాశౌచం విదేశేపక్షిణీభవేత్ ।
గుణహీనేషుచైతేషు ఏకగ్రామేతుపక్షిణీ ॥
ఏకాహమన్యదేశేతు స్నానంకాలాత్యయేతథా॥

తా॥ ఇచ్చట "విదేశము" "ఏకగ్రామము" అనునవి ప్రతిద్వం ద్విపదములుగా నుచ్చరింపబడెగాన విదేశాన్యదేశశబ్దములకు గ్రామా న్తరమని యర్థము. మాతామహుడు ఆచార్యుడు అనేకయజ్ఞముల యందు తనకార్త్విజ్యముజేసినవాడు మేనల్లుడు దౌహిత్రుడు గురుపు త్రునవలన నార్త్విజ్యముగొనువాడు వీరు మృతినొందినపుడు ఏకగ్రామ మున త్రిరాత్రము అన్యగ్రామమున పక్షిణియునాశౌచము. వీరు గుణ హీనులగుపక్షమున ఏకగ్రామమున పక్షిణి. అన్యగ్రామమున నొక దినమునని తెలియదగు. ఉక్తకాలమతిక్రమించినచో స్నానమాత్రము.

శ్లో॥ ఋత్విగ్యాజ్యసహాధ్యాయి మాతులశ్వశురేషుచ।
తథోపనీతదౌహిత్రే శిష్యేబాచార్యపుత్రకే॥
భాగినేయేభగిన్యాంచ శ్వశ్రూమాతామహీషుచ ।
మాతృష్వసృపితృష్వసృ మాతులానీషుచైవహి॥
గుర్వాచార్యాదిపత్నీషు పితృమాత్రాత్మబంధుషు ।
ఏకగ్రామేతుమరణే పక్షిణ్యాశౌచమిష్యతే ॥
గుణహీనేషుచైతేషు సన్నిధావేకరాత్రికం ।
గ్రామాన్తరేచగుణిషు గుణహీనేషుచాప్లవః ॥

తా॥ ఋత్విక్కు, యాజ్యుఁడు అనఁగా తనకార్త్విజ్యము జేసిన వాఁడు తనవలన నార్త్విజ్యముగొనువాఁడు సహాధ్యాయి, మేనమామ, మామ, ఉపనీతుడగు దౌహిత్రుఁడు, శిష్యుఁడు, ఆచార్యపుత్రుఁడు మేనల్లుఁడు, తోబుట్టినది, అత్త, మాతామహి మేనత్త, పినతల్లి పెదతల్లులు, మేనమామ భార్య, గురుపత్ని, ఆచార్యపత్ని, పితృబంధువులు, మాతృబంధువులు, ఆత్మబంధువులు వీరు గుణవతులైయుండి సన్నిధానమున మృతినొందినచో పక్షిణ్యాశౌచము అసన్నిధానమున మృతినొందినచో నేకరాత్రము. గుణహీనులైయుండి సన్నిధానమున మృతినొందినచో నేకరాత్రము. అసన్నిధానమున స్నానమాత్రము. ఉపనీతులగు దౌహిత్రుడు భాగినేయుడు మొదలగువారివిషయమున పక్షిణ్యాశౌచమును విధించుటవలన నీవచనము యుగాన్తరవిషయమని స్పష్టమగుచున్నది కాన నిబంధములయందెట్లు వ్యవస్థచేయబడినదో శిష్టులేప్రకారమాచరించుచుండిరో అట్లు ఒక ప్రకారముననుసరించి వ్యవస్థజేసికొనదగును. ద్రావిడులకు సర్వసాధారణముగా మేనమామ మొదలైన యసపిండులు మృతినొందినను వివాహితలగుస్త్రీలకుగూడ మృతాశౌచముకలదని విశేషము. ధర్మప్రవృత్తిననుసరించి నడచెడి యాంధ్రులకుమాత్రమీవిషయమున స్నానమాత్రము. లేక దానినే యనుసరించుచో ద్రావిడులకువలె పక్షిణ్యాశౌచమని వెనుక చెప్పబడినది అట్లే,

శ్లో॥ మాతృష్వసృసుతాపుత్రౌ పితృష్వసృసుతస్త్రియా ।
స్వసాపితృవ్యపుత్రీచ స్వసృపిత్రీపితృష్వసా ॥
భ్రాతృపుత్రీచదౌహిత్రీ పౌత్రీత్ప్రతియోగినా।
స్త్రీపుంసౌచక్వచిత్త్వేతే పక్షిణ్యాశౌచినౌమిథః॥

తా॥ పెదతల్లి కొమరితకును కొమరునకును ప్రతియోగులగు స్త్రీపురుషులు పినతల్లి కొమరితయు కొమరుడునగు ఇట్లె పినతల్లి కొమరితకును కొమరునకును పెదతల్లి కొమరితయు కొమరుడును ప్రతియోగులగుదురు ఇట్లే మేనత్త కొమరితయు కొమరులును మేనమామ కొమరితకును కొమరునకును ప్రతియోగులు సోదరీ సోదరులు పరస్పరము ప్రతియోగులు అనగా కనిష్ఠభగినికి జ్యేష్ఠభగినిలును జ్యేష్ఠభ్రాతలును జ్యేష్ఠభగినికిని కనిష్ఠభగినులును కనిష్ఠసోదరులును ప్రతియోగులు. పినతండ్రి కొమరితకు పెదతండ్రి కొమరితయు కొమరుడును ప్రతియోగులు. సోదరియొక్క కొమరితకు పినతల్లి పెదతల్లులును మేనమామలు ప్రతియోగులు మేనత్తకు సోదరుని పుత్రికలును పుత్రులును ప్రతియోగులు సోదరుని కొమరితకు మేనత్త పినతండ్రి పెదతండ్రులు ప్రతియోగులు దౌహిత్రికి మాతామహుడును మాతామహియు ప్రతియోగులు పౌత్రికి పితామహుడును పితామహియు ప్రతియోగులు వీరికి పరస్పరము పక్షిణ్యాశౌచమని శ్లోకార్థము ఇట్లు ద్రావిడశతకమున వ్రాయబడెను స్మృతిముక్తాఫలమునందుగూడ,

శ్లో॥ మహామహ్యాపితామాతా పితృవ్యోమాతులస్తథా।
మాతృష్వసామాతులానీ పితృవ్యస్త్రీపితృష్వసా॥
మాతృష్వసుర్మాతులస్య పితృవ్యస్యపితృష్వసుః ।
పుత్రీపుత్రఃస్నుషాస్వస్య స్వసాభ్రాతాతదంగనా॥
స్వసుర్భ్రాతుఃస్నుషాపుత్రీ పుత్రాఃస్వదుహితాపిచ ।
స్వపౌత్రీచస్వదౌహిత్రీ స్వదౌహిత్రస్తదంగనా ॥
అష్టత్రింశజ్జనాహ్యేతే స్త్రీమృతౌపక్షిణీజుషః ।
సపిండాన్ద్వాదశైతేషు ముక్త్వాన్యేపుంమృతౌతథా ॥

తా॥ పితామహ మాతామహులును, వారిభార్యలును, పినతండ్రియు, పెదతండ్రియు, మేనమామయు, మేనత్తయు, మేనమామ భార్యయు, పినతండ్రి పెదతండ్రులభార్యలును, పినతల్లియు, పెదతల్లియు, ఈ పినతల్లి పెదతల్లులయొక్కయు, మేనమామయొక్కయు, పినతండ్రి పెదతండ్రులయొక్కయు, మేనత్తయొక్కయు, పుత్రికలును పుత్రులును తనయొక్కకోడలును, చెల్లెలు, సోదరుడు, వానిభార్య వీరు స్త్రీమరణమున పక్షిణ్యాశౌచము నవలంబింపవలయు ఈవరుసయందు జెప్పబడిన వారిలో సపిండులు పండ్రెండుగురుదక్క మిగిలినసోదరీసోదరులయొక్క కోడండ్రు కొమరితలు కొమరులు తనకొమరిత ఆకొమరితయొక్కయు కొమరునియొక్కయు కొమరితలు దౌహిత్రుడు వానిభార్య పురుషుల మరణమునగూడ పక్షిణ్యాశౌచమేయగు. పుత్రిక మొదలగువారికి పక్షిణిని విధించుట పరోక్షవిషయము మరియు,

శ్లో॥ మాతృష్వసామాతులశ్చ స్వసాభ్రాతాపితృష్వసా।
పంచవైతత్సుతాపుత్రా దశపౌత్రీపితామహాః॥
మాతామహాశ్చదౌహిత్రీ పితృవ్యస్తత్సుతాత్మజౌ।
ద్వావింశతిజనాశ్చైతే పరోక్షేదుహితాపితా॥
దౌహిత్రశ్చత్రయశ్చైతే తత్తత్పత్న్యస్త్రయోదశ।
స్త్రీమృతౌపక్షిణీభాజః అష్టత్రింశదితిస్థితిః॥
మాతృష్వసృపితృష్వస్రోః పుత్రీపుత్రౌచతత్స్త్రియౌ।
పితృష్వసాస్వసాపుత్రీ భ్రాతృపుత్రీస్వసుస్సుతా॥
పితృవ్యపుత్రీదౌహిత్రీ మాతులస్యసుతాసుతౌ।
తత్స్త్రీచాసన్నిధౌపుత్రీ స్వస్రోఃపుత్రౌచతత్స్త్రియౌ॥
క్వచిచ్చమాతుఃపితరౌ స్వసాచభ్రాతృతత్స్త్రియౌ।
పక్షిణ్యాశౌచినస్త్వేతే పుంమృతౌపంచవింశతిః॥

తా॥ మాతృభగిని, మేనమామ, ఆత్మభగిని, సోదరుడు, మేనత్త, వీరికొమరితలు, కొమరులు, పౌత్రి, పితామహుడు, మాతామహుడు, దౌహిత్రియు, తండ్రిసోదరుడు, వానికొమరిత, కొమరుడు, ఈ యిరువదియిరువురును పరోక్షమున కొమరిత, తండ్రి దౌహిత్రుడు

యీ ముప్పురును వారివారిభార్యలును అనగా పినతల్లికొమరుడు, మేనమామ, వానికొమరుడు, మేనల్లుడు, సోదరుడు, వానికొమరుడు, మేనత్తకొమరుడు, పితామహుడు మాతామహుడు, తండ్రి, సోదరుడు వానిపుత్రుడు, దౌహిత్రుడు, వీరిభార్యలును, పదముగ్గురును ఈ ముప్పదిమెనమండుగురు స్త్రీమరణమున పక్షిణ్యాశౌచమునవలంబింపదగుదురు. మాతృభగినియొక్కయు పితృభగినియొక్కయు పుత్రికయు పుత్రుడును, ఆపుత్రులభార్యలును, మేనత్తయు, ఆత్మభగిని, పుత్రిక, సోదరుని పుత్రిక, సోదరియొక్క కొమరిత, పినతండ్రికొమరిత, దౌహిత్రి, మేనమామ కొమరిత, కొమరుడు, వానిభార్య, పుత్రికయొక్కయు సోదరియొక్కయు పుత్రులు, వారిభార్యలు ఒకప్పుడు మాతామహుడును మాతామహియును, తల్లితోబుట్టినదియును, సోదరుడును వానిభార్యయు, ఈయిరువదిమైమనుగురును పురుషమరణమునందుగూడ పక్షిణ్యాశౌచముగలవారేయగుదురు. ఒకప్పుడు అనగా పరోక్షమునందు అని తెలియదగును. ఇచ్చట ఏపురుషులవిషయమున లేక స్త్రీలవిషయమున ఏపురుషులకు లేక స్త్రీలకుఎట్టియాశౌచము విధింపబడినదో వారు మృతినొందినపుడు వారికట్టి యాశౌచముకాదగును. అంతియకాని వానిభార్యలు సోదరులు మృతినొందినపుడుకాదగదు.

శ్లో॥ మాతృతఃపితృతోయేషు విహితాపుంసుపక్షిణీ ।
నతత్పత్నీమృతౌసాస్యా త్స్నానమాత్రంవిధీయతే॥

తా॥ తలిదండ్రులబట్టియే పురుషులవిషయమున పక్షిణ్యాశౌచము విధింపబడినదో వారిభార్యలు మృతినొందినపుడాపక్షిణ్యాశౌచములేదు స్నానముమాత్రము విధింపబడెను అని శతకమునజెప్పబడినది మరియు,

శ్లో॥ మాతామహీమాతులానీ మాతులానాంమృతౌస్త్రియాః ।
పక్షిణీపురుషాణాంతు త్రిరాత్రమఘమిష్యతే॥

తా॥ మాతామహి, మేనమామ, వానిభార్య, వీరుమృతినొందినపుడు స్త్రీలకు పక్షిణియు పురుషులకు త్రిరాత్రమును ఆశౌచము. ఇవిమొదలగువచనములచే నెచ్చట యోనిసంబంధులయొక్క భార్యల

విషయమున విశేషవిధిచేనాశౌచము విధింపబడెనో యచ్చటదక్క మిగిలిన యోనిసంబంధుల భార్యలవిషయమున నేమాత్రమును ఆశౌచము లేదని నిశ్చయము. భిన్నోదరులగు మాతామహాదులు మృతినొందినపుడు వివాహితలగు స్త్రీలకు ఏకరాత్రము.

శ్లో॥ భిన్నపిత్రోః పితృభ్రాతృ స్వస్రపత్యానితత్ప్రజాః।
శుద్ధ్యన్త్యహ్నమిథశ్చావే జనాస్తత్ప్రతియోగినః॥

తా॥ భిన్నోదరులగు పినతండ్రి పెదతండ్రులు మృతినొందినపుడు వారితండ్రియొక్కయు, తోబుట్టిన వానియొక్కయు, భగినియొక్కయు కొమరితయు, వారిసంతానమును శావాశౌచమున వారిప్రతియోగులు పరస్పరము ఏకరాత్రిమున శుద్ధులగుదురు అని ద్రావిడశతకమున జెప్పబడెను.

—♦ ఇకసంగ్రహము ♦—

ఉపనీతులు మృతినొందినపుడు సపిండులకు పూర్ణాశౌచము సమానోదకులకు త్రిరాత్రము. సగోత్రులకుస్నానమాత్రము. జన్మనామస్మృతిగల సగోత్రులకేకరాత్రము. అనుపనీతుడగు సమానోదకుడు మృతినొందినచో స్నానమాత్రము. అవివాహితయగుకన్య మృతినొందినచో స్నానమాత్రము. వివాహితయగుస్త్రీ మృతినొందినచో నాయాశౌచము భర్తయొక్కసపిండులు సమానోదకులు సగోత్రులు మాత్రమవలంబింపదగు గాని తండ్రియొక్క సపిండులుమొదలగువారికి లేదు. మాతామహి, మాతామహుడు, మాతృభగిని, మేనమామ, వానిభార్య, దౌహిత్రుడు, మేనల్లుడు వీరిమరణమున సన్నిధానమున త్రిరాత్రము, అసన్నిధానమునపక్షిణి. అత్తమామలయొక్కమరణమున జీవించియున్న భార్యగల అల్లునకు సన్నిధానమున త్రిరాత్రము, అసన్నిధానమున పక్షిణి. మృతినొందినభార్యగల యల్లునకు సన్నిధానమునగూడ నేకరాత్రము. భార్యయొక్క సంతానమున్నచో త్రిరాత్రము. ఆచార్యుడు, వానిపుత్రుడు, పత్ని, వీరుమృతినొందినచో సన్నిధానమున త్రిరాత్రము, అసన్నిధానమున పక్షిణి. శిష్యుడు సన్నిధాన

మున మృతినొందినచో నాచార్యుడు మొదలగువారికిగూడ నిట్లే యా
శౌచమని తెలియదగు. ఉపసంపన్నుడగు (అనఁగా తనగృహమున
నున్న) శ్రోత్రియుడు మృతినొందినచో సన్నిధానమున త్రిరాత్రము.
అసన్నిధానమున పక్షిణి, శ్రోత్రియుడుగాని యుపసంపన్నుని మరణ
మున సన్నిధానమునగూడ నేకరాత్రము, అసన్నిధానమున స్నానమా
త్రము. ఉపసంపన్నుడుగాని శ్రోత్రియుడు గ్రామమున మృతినొంది
నచో నాగ్రామవాసులకందరకు నొకరాత్రియాశౌచము. అసన్నిధా
నమున సజ్యోతిరాశౌచము. ఆగంతుకుడగు శ్రోత్రియుడు తనగృహ
మున మృతినొందినచో త్రిరాత్రాశౌచము. అశ్రోత్రియుడైనచో నేక
రాత్రము. ఆగంతుకునకు మరణకాలమున స్థలమునిచ్చుటవలన వాడు
గూడ ఉపసంపన్నుడేయగును. కులక్రమముగా వచ్చుచున్న ఋత్వి
క్కు యాజ్యుడు వీరికి పరస్పరము సన్నిధానమున త్రిరాత్రమును అస
న్నిధానమున పక్షిణియును, రాజునకును పురోహితునకును పరస్పరము
సన్నిధానమున త్రిరాత్రము అసన్నిధానమునపక్షిణి. వైశ్యపురోహితు
లకుగూడ నిట్లేయగును. పుత్రిక వివాహమైన పిదప తండ్రిగృహమున
మృతినొందినచో తలిదండ్రులకు సోదరులకు అవివాహితలగు భగిను
లకు త్రిరాత్రాశౌచము, జ్ఞాతులకేకరాత్రము. ద్రావిడులలో తలి
దండ్రులకు త్రిరాత్రము సోదరీసోదరులకేకరాత్రము జ్ఞాతులకేమియు
లేదు. తలిదండ్రులునుసోదరులును విభక్తులగుచు వేరువేరుగృహముల
నివసించియున్నచో తండ్రిగృహమున మృతినొందినచో తలిదండ్రులకు
మాత్రమే త్రిరాత్రము. సోదరునియింట మృతినొందినచో సోదరునకు
మాత్రమే త్రిరాత్రాశౌచము. జ్ఞాతులగృహమందైనచో వారికేకరా
త్రము. మరియొకప్రదేశమున మృతినొందినచో తలిదండ్రులకును సోద
రునకును పక్షిణ్యాశౌచము జ్ఞాతులకేమియును లేదు. తనగ్రామమున
పుత్రిక మరణించినను తనగృహమున మృతినొందినపుడువలెనే యాశౌ
చమనియు గ్రామాన్తరముననైనచో పక్షిణియనియు స్మృత్యర్థసార
మున జెప్పబడినది కాన యాచారమునను సరించి నడువదగును. తలి
దండ్రులు తనగృహమునందుమృతినొందినను పరగృహమునందు మృతి

నొందినను పుత్రికకు త్రిరాత్రాశౌచము, సోదరుడు సోదరిగృహమున మృతినొందినచో సోదరికి త్రిరాత్రము, పరగృహమునందైనచో పక్షిణి, గ్రామాన్తరమునందైనచో నేకరాత్రము, భగినీపతికి స్యాలకమరణమునందు తనగృహమునందైనను పరగృహమునందైనను ఏకరాత్రాశౌచము, స్యాలపుత్రుడె మృతినొందినను ఏకరాత్రమేయగును. స్యాలకుడు శ్రోత్రియుడై యుండి తనగృహమునమృతినొందినచో త్రిరాత్రము ఉపసంపన్నాశౌచము గ్రామాన్తరమందైనచో స్నానమాత్రము. అనుపనీతుడగు సోదరుడు మృతినొందినచో భగినికి సన్నిధానమున గూడ స్నానమాత్రమేయగు. సోదరునియొక్క పుత్రుని మరణమున గూడనిర్లేపయగును. సోదరుని గృహమున సోదరి మృతినొందినచో సోదరునకు త్రిరాత్రము. పరగృహమున మృతినొందినచో పక్షిణి. గ్రామాన్తరముననైనచో నేకరాత్రము. దత్తపుత్రుని మరణమున పూర్వాపరపితరులకు వారిపుత్రులకును త్రిరాత్రము, అసన్నిధానమున నేకరాత్రము. ఈపూర్వాపరపితరులయొక్క జ్ఞాతులకు,సన్నిధానమున నేకరాత్రము. అసన్నిధానమున స్నానమాత్రము. అనుపనీతుడగు దత్తపుత్రుడు మృతినొందినచో జ్ఞాతులకు సన్నిధానమునగూడ స్నానమాత్రమేయగు. పితృద్వయమునకును వారిపుత్రులకును మాత్రము త్రిరాత్రమేయగును. దత్తునకు పుత్రుడు జనించినను మృతినొందినను ఉపనయనమైనపిమ్మటగూడ జనకవర్గమునకు స్నానమాత్రమేయగు. దత్తునకు జనకతండ్రి మరణించినచో త్రిరాత్రము. ప్రతిగ్రహించినతండ్రి మృతినొందినచో దశరాత్రము. ఈదత్తుడు మృతినొందినచో ప్రతిగ్రహించిన తండ్రికిగూడ దశరాత్రమేయగు. దత్తుని స్వీకరించిన పిదప జనించిన యౌరసుడు తండ్రిని సంస్కరించుచో దత్తునకు త్రిరాత్రమే యగు అనులోమవ్యభిచారిణి (తనజాతికంటెయుత్తమమగుజాతియందు జనించిన వానితో వ్యభిచరించినది) సన్నిధానమున మృతినొందినచో పూర్వాపరభర్తలకు త్రిరాత్రము. వారిసపిండులకేకరాత్రము ఈవ్యభిచారిణి ప్రసవించినపుడుగూడ నిర్లేపయూహింపదగును. ప్రతిలోమవ్యభిచారిణి (తనజాతికంటె తక్కువజాతియందు జనించిన వానితో వ్యభిచ

రించినదాని) యొక్క మరణమునను వ్రసవమునను ఆశౌచమేలేదు. ఒకవ్యభిచారిణియగు స్త్రీయందిరువురు తండ్రులవలన జనించిన సోదరులకు పరస్పరము త్రిరాత్రము మృతాశౌచము. జాతాశౌచమేకరాత్రిము వెనుకజెప్పబడిన ఆత్మబంధువులు పితృబంధువులు మాతృబంధువులు మృతినొందినపుడు సన్నిధానమున పక్షిణి, అసన్నిధానమున నేకరాత్రిము. సాపత్న్యమాతృవర్గమునందలి మేనమామ మొదలగువారు మృతినొందినచో సన్నిధానమున నేకరాత్రము అసన్నిధానమున స్నానమాత్రము. జారపితృవర్గముయొక్క అనగా తనతల్లితో జారత్వముజేసినవానియొక్క తండ్రి భార్య సోదరుడు మొదలగువారియొక్క మరణమున సన్నిధానమున నేకరాత్రము అసన్నిధానమున స్నానమాత్రము. దత్తునకు ప్రతిగ్రహించినవారివర్గమున మేనమామ మొదలగువారు మృతినొందినచో సన్నిధానమున నేకరాత్రము అసన్నిధానమున స్నానమాత్రము. దత్తునకు జనకవర్గమున మేనమామ మొదలగువారు మృతినొందినచో సన్నిధానమునపక్షిణి, అసన్నిధానమున నేకరాత్రము. సవతికొమరిత మృతినొందినచో సవతితల్లికేకరాత్రిము. సవతితల్లి మృతినొందినచో సవతికొమరితకుగూడ నేకరాత్రిము. అసన్నిధానమున స్నానమాత్రము. సవతియొక్కతండ్రి సోదరుడు మొదలగు బంధువులు మృతినొందినపుడు తోడుసవతికి సన్నిధానమునగూడ స్నానమాత్రమే యగు. దౌహిత్రుడు మేనల్లుడుదక్క మిగిలిన అసపిండులుపనయనము కాకపూర్వము మృతినొందినచో సన్నిధానమునస్నానమాత్రమేయగు దౌహిత్రుడు భాగినేయుడు వీరివిషయమానమాత్రిము ఉపనయనమైన పిదప త్రిరాత్రిము. ఉపనయమునకుపూర్వము పక్షిణి. చౌలమునకు పూర్వము స్నానము చెప్పబడె. మాతృభగినులు మొదలగు అసపిండులగుస్త్రీలు వివాహమునకుపూర్వము మృతినొందిననచో సన్నిధానమునగూడ స్నానమాత్రిము. అల్లునిమరణమున సన్నిధానమున పక్షిణియు, అసన్నిధానమున నేకరాత్రిమును ఆయల్లుడే తనగృహమున మృతినొందినచో త్రిరాత్రిము యోనిసంబంధులగు పురుషులయొక్క భార్యలు మృతినొందినచో సన్నిధానమునగూడ స్నానమాత్రమేయగు

మేనమామ భార్యకు మాత్రము విశేషవిధానమువలన త్రిరాత్రము. యోనిసంబంధులగు స్త్రీలయొక్క భర్తలు మృతినొందినపుడు స్నాన మాత్రము. గురువు వానిభార్య వానిపుత్రుడు వీరిమరణమున సన్నిధానమున పక్షిణి, అసన్నిధానమున నేకరాత్రము. శిష్యునిమరణమున వారికిగూడ నిట్లెచెప్పదగును. పండ్రెండుసంవత్సరములు తనతోగూడి విద్యనభ్యసించినట్టిగాని తనతోగలసి యొకవేదమునంతను చదివినట్టిగాని సహాధ్యాయి మృతినొందినచో సన్నిధానమున పక్షిణి, అసన్నిధానమున నేకరాత్రము, తనతోగలసి యల్పకాలము విద్యనభ్యసించినట్టిగాని వేదములో కొంతభాగమునుమాత్రమధ్యయనము జేసినట్టిగాని సహాధ్యాయి మృతినొందినచో సన్నిధానమున నేకరాత్రము, అసన్నిధానమున స్నానమాత్రము, ఆసహాధ్యాయి బహూపకారియైనచో సన్నిధానమున పక్షిణి, అసన్నిధానమున నేకరాత్రము. మండలాధిపతి యగు రాజు మృతినొందినపుడు సన్నిధానమున నేకరాత్రమును అసన్నిధానమున సజ్యోతిరాశౌచము అనగా నక్షత్రదర్శనమగువరకాశౌచము. స్వల్పమండలాధిపతి మృతినొందినపుడు సన్నిధానమున సజ్యోతిరాశౌచము, అసన్నిధానమున స్నానమాత్రము. గ్రామాధిపతి మృతినొందినపుడు సన్నిధానమున నేకరాత్రము, అసన్నిధానమున సజ్యోతిరాశౌచము, తపశ్శాలి మృతినొందినచో సన్నిధానమున సజ్యోతిరాశౌచము, అసన్నిధానమున స్నానమాత్రము, ఒకజనసంఘమునకధ్యక్షుడగువాడు మృతినొందినపుడు సన్నిధానమున నేకరాత్రము, అసన్నిధానమున సజ్యోతిరాశౌచము, జపింపదగినమంత్రమునుపదేశించినగురువు మృతినొందినపుడు సన్నిధానమున నేకరాత్రము, అసన్నిధానమున సజ్యోతిరాశౌచము, ఆశిష్యుడు మృతినొందినచో నాగురువునకుగూడ నట్లేయాశౌచము ఉపసంపన్నాశౌచము త్రిరాత్రముగాని ఏకరాత్రముగాని దంపతులిరువురకుగూడకలదు. పత్నిగూడ గృహపతి యగుటవలన నిట్లగునని వెనుక జెప్పబడినది మఱియు సపిండులకును సమానోదకులకును ఆచార్యునకును మాతామహునకును వారిపత్రి యోగులు తిలోదకమునివ్వవలయు నట్లీయనిపక్షమున వారికాశౌచము

నివర్తింపదు కాన తిరిగి యొకదినము నాశౌచము నవలంబించి తిలోదకమునివ్వవలయును. ఆంధ్రులు మొదలగువారు వివాహితలగు స్త్రీలకు తల్లి తండ్రి సోదరుడు వానిపుత్రులుదక్క మిగిలిన పితృవర్గమునందలి బంధువులు మృతినొందినపుడు స్నానమాత్రమని చెప్పుచున్న ధర్మప్రవృత్తిననుసరించుచున్నారు. కొందరు పక్షిణ్యాదికమునాచరించుచుండిరి ద్రావిడులయందు సర్వసాధారణముగా వివాహితలగు స్త్రీలును వారి ప్రతియోగులును పక్షిణ్యాదికమునాచరించుచుండిరి. అందు సంగ్రహశ్లోకములు పూర్వముదహరింపబడినవి చూచుకొనదగును. గ్రన్థవిస్తరమగునను భయమువలన విరమించుచున్నాను. ఆశౌచాన్తమున సంగవకాలమున స్నానముజేసి బ్రాహ్మణుడు హస్తములచే నుదకమును స్పృశించి శుద్ధుడగు. క్షత్రియుడు వాహనమును లేక ఆయుధమును స్పృశించి శుద్ధుడగు. వైశ్యుడు త్రాసును లేక ప్రగ్గమును స్పృశించి శుద్ధుడగు. శూద్రుడు కర్రను స్పృశించిన శుద్ధుడగు ఇది ఉపనీతాశౌచనిర్ణయము.

## —♦ అతిక్రాన్తాశౌచనిర్ణయము. ♦—

శ్లో॥ తత్తదాశౌచమాఖ్యాత మతిక్రాన్తమనేకధా ॥

తా॥ సపిండులు మొదలగువారు మృతినొందినపుడు తన్నిమిత్తమున గలిగిన యాశౌచము. నియమితకాలమతిక్రమించిన పిదప విషయభేదముననుసరించి అనేకవిధములుగలదగును అదియెట్లన.

శ్లో॥ అతిమాసాత్త్రిరాత్రంస్యా త్షణ్మాసాత్పక్షిణీతథా ।
పరమేకాహమావర్షా దూర్ధ్వంస్నానేనశుద్ధ్యతి ॥

తా॥ జ్ఞాతిమరణము మృతిదశాహమతిక్రమించినపిదప మూడు మాసములలోగడ వినబడినచో త్రిరాత్రమును అటుపిమ్మట నారు మాసములలోగడ వినబడినచో పక్షిణియు, సంవత్సరములోగడ వినబడినచో నేకరాత్రమును అతిక్రాన్తాశౌచము నవలంబింపదగు. ఆసంవత్సరముగూడ నతిక్రమించినపిదప వినబడినచో స్నానమాత్రమున శుద్ధుడగునని దేవలుడు చెప్పెను.

శ్లో॥ సంవత్సరేవ్యతీతేతు స్పృష్ట్వైవాపోవిశుద్ధ్యతి॥

తా॥ సంవత్సరమతిక్రమించినపిదప జ్ఞాతిమరణము వినబడినచో స్నానమాత్రమున శుద్ధుడగునని వృద్ధమనువచనము. ఇది పూర్ణాశౌచ విషయము అందును కృతక్రియుని విషయము, అకృతక్రియునివిషయమున పునర్దహనాశౌచము ముందు చెప్పబడును మరియు,

శ్లో॥ మాసత్రయేత్రిరాత్రంస్యా త్షణ్మాసాత్పక్షిణీభవేత్।
అహస్తునవమాదర్వా గూర్ధ్వంస్నానేనశుద్ధ్యతి॥

తా॥ మూడుమాసములలోగా త్రిరాత్రము, ఆరుమాసముల లోగా పక్షిణి, తొమ్మిదిమాసములలోగా నేకరాత్రిము, అటుపిమ్మట స్నానమున శుద్ధుడగునను వృద్ధవసిష్టుని వచనము వికల్పాభిప్రాయము కాన ఆచారమునను సరించినడువదగును. పుత్రవిషయమునమాత్రమీ యతికాన్త్రాశౌచము. అనేక సంవత్సరములతిక్రమించినను దశాహాశౌచమేయగు. కృతక్రియుడైన పక్షమునమాత్రము ఇరువదిసంవత్సరములకులోగడ దశాహాశౌచము అటుపిమ్మట త్రిరాత్రము

శ్లో॥ షష్టివర్షాధికాన్న్యూనా చ్ఛ్రుత్వాపితృవిపర్యయం।
సంస్కారస్తుకథంతత్ర దశాహాదౌర్ధ్వదైహికం॥
మాతాపిత్రోర్దశాహాంతు యధావిధిసమాపయేత్।
మధ్యేపిండసమాప్తిశ్చే త్కులక్షయకరంభవేత్॥

తా॥ అరువదిసంవత్సరములకుపైనగాని లోగడగాని తలిదండ్రులయొక్క మరణమును వినినచో పదిదినములు ఔర్ధ్వదైహికమును యథావిధిగ సమాప్తినొందింపదగును. పది దినములకులోగడ పిండముల సమాప్తి నొందినచో కులక్షయకరమగును అని వృద్ధమనువచనము.

శ్లో॥ పితరౌచేన్మృతౌస్యాతాం దూరస్థోపిహిపుత్రకః।
శృత్వాతద్దినమారభ్య దశాహంసూతకీభవేత్॥

తా॥ తలిదండ్రులు మృతులైనచో నావార్తను దూరమునందున్న కొమరుడెపుడువిన్నను ఆదినముమొదలుకొని పదిదినములాశౌచముగలవాడగునని పైశ్లోకము తెలిపెను.

శ్లో॥ యత్రకుత్రస్థితఃపుత్రః శ్రుత్వాపితృవిపర్యయం।
జ్ఞాత్వాతద్దినమారభ్య దశాహంసూతకీభవేత్ ॥

తా॥ పుత్రుడు విదేశముననుండి ఎంతకాలముగడచిన పిదప తలిదండ్రులమరణమునువినినను ఆవినినదినము మొదలుకొని పదిదినములు సూతకముగలవాడగును అని మఱియొక స్మృతియందు జెప్పబడె. తలిదండ్రులకౌర్ధ్వదైహికక్రియలు జేయబడినచో విశేషము జెప్పబడెను.

శ్లో॥ అర్వాగ్వింశతివర్షాత్తు మాతాపిత్రోఃమృతిశ్రుతౌ।
కృతక్రియేపిపుత్రాణాం దశాహంసూతకంభవేత్ ॥
ఊర్ధ్వంవింశతివర్షాత్తు మాతాపిత్రోర్మృతిశ్రుతౌ।
కృతక్రియేత్రిరాత్రంస్యా ద్దశాహమకృతక్రియే ॥

తా॥ ఇరువది సంవత్సరములలోపల తల్లిదండ్రులయొక్క మరణమును వినినచో ఔర్ధ్వదైహికక్రియలు చేయబడియున్నను పుత్రులకు దశరాత్రాశౌచము. ఆయిరువది సంత్సరములు గడచినపిదప వినినచో ఔర్ధ్వదైహికక్రియలుచేయబడినచో త్రిరాత్రమును చేయబడనిచో దశరాత్రమును కాదగును. కొందరు మొదటిసంవత్సరము గడచినపిదపనే పుత్రులకు కృతక్రియుడగు తండ్రివిషయమున త్రిరాత్రమనిరి. కనిష్ఠులకు త్రిరాత్రమనిన్ని జ్యేష్ఠులకు దశరాత్రమనిన్ని పలికిరి అదియనేకస్మృతులకు విరుద్ధముగాన సమంజసముగాదు. ఈవచనములన్నియు దశాహమునకు పిమ్మట మరణమును వినినపక్షముననని తెలియదగును. దశాహమునకు లోగడనే మరణమును వినినచో పుత్రులకును జ్ఞాతులకును అందరకుదశాహశేషమునశుద్ధియగును.

శ్లో॥ విగతంతువిదేశస్థం శృణుయాద్యోహ్యనిర్దశం।
యచ్ఛేషందశరాత్రస్య తావదేవాశుచిర్భవేత్ ॥

తా॥ విదేశమునందున్న జ్ఞాతిమరణమును పదిదినములలోగడ వినినచో నాదశరాత్రశేషమున శుద్ధుడగును. ఇది త్రిరాత్రము మొదలగువానికిగూడ యుపలక్షణము అట్లగుటచే త్రిరాత్రాశౌచమునకు నిమిత్తమగు బంధుమరణమును త్రిరాత్రాదులకులోగడ వినినచో నా త్రిరాత్రాది శేషమున శుద్ధియగు.

శ్లో॥ దేశాన్తరగతంశ్రుత్వా కల్యాణంమరణంతథా।
యచ్ఛేషందశరాత్రస్య తావదేవాశుచిర్భవేత్ ॥

తా॥ దేశాన్తరమున జరిగిన జననమునుగాని మరణమునుగాని వినినచో దశరాత్రిశేషమున శుద్ధియని శంఖవచనము. "ప్రోషితేకాలశేషస్స్యాత్" దేశాన్తరమున మృతుడగువాని మరణమును వినినచో దశాహశేషమున శుద్ధియగునని యాజ్ఞవల్క్యవచనము కొందరు,

శ్లో॥ పిత్రోర్మృతౌచేద్దూరస్థః శ్రుత్వాపిత్రువిపర్యయం।
పుత్రశ్శుద్ధ్యేద్దశాహేన సంచయాత్ప్రాక్తుశేషతః॥

తా॥ దూరమునందున్న పుత్రుడు తలిదండ్రులయొక్క మరణమును వినిన పదిదినములవరకాశౌచముగలవాడగు. సంచయనమునకు లోగడ వినినచో మరణదశాహశేషమునశుద్ధియగు. అను వచనము నుదహరించుచు తండ్రి మృతినొందినది మొదలు నాల్గుదినములలోగా వినినచో దశాహశేషమున శుద్ధియనిన్ని అటుపైన మరణదశాహము లోగావినినచో వినినదిమొదలుకొని పదిదినములాశౌచమనిన్ని చెప్పిరి. అది ద్రావిడవిషయము మరియు,

శ్లో॥ అత్యాశౌచందినంసద్య స్త్ర్యహైకాహారశౌచినోః।
పక్షిణ్యభిష్వఘాన్తశ్రుత్వైకకాలోన్యదాప్లవః॥

తా॥ ఉక్తకాలమతిక్రమించిన పిదప దశాహమునకు లోగడ మరణవార్తవినబడినచో త్రిరాత్రమాశౌచమవలంబింపదగిన వాడొకదినమున పక్షిణ్యాశౌచము నవలంబింపదగినవాడు పగలువినినచో నాపగలుగడచువరకును రాత్రి వినినచో నారాత్రిగడచువరకును ఆశౌచమునవలంబింపదగు. ఒకదినమాశౌచమవలంబింపదగినవానికి స్నానమున శుద్ధియగునను ద్రావిడశతకమునందలివచనము ద్రావిడుడైన స్మృతిముక్తాఫలకారునిచేతనే దూషింపబడెను కాన త్రిరాత్రాద్యాశౌచములు మరణదశాహమునకులోగడ వినబడినను స్నానమాత్రమే యగు మరియు "శ్రుత్వాచోర్ధ్వందశమ్యాఏకరాత్రం" పది దినములు గడచినపిదప మరణవార్తను వినినచో నేకరాత్రమాశౌచమను శంఖవచనము శతకకారునిచే నుదహరింపబడినది కాని ఆవచనముఅతిక్రాన్త

పూర్ణాశౌచవిషయము అందును ఆఱుమాసముల పైవిషయమని చంద్రికమొదలైన యనేక నిబంధములయందు వ్యాఖ్యానము జేయబడె. మఱియు,

శ్లో॥ అతీతేపక్షిణీకాలే దశాహాభ్యన్తరేశ్రుతె।
దివావాయదివారాత్రౌ వేకకాలేనశుద్ధ్యతి ॥

తా॥ పక్షిణ్యాశౌచము నవలంబింపదగినవారు ఆపక్షిణి యతిక్రమించినపిదప మరణ దశాహము లోగడ వినినచో పగలువినినచో నాపగటితో శుద్ధుడగు రాత్రివినినచో నారాత్రితో శుద్ధుడగునను వచనమొకటి. ఆద్రావిడశతకకారునిచే నుదహరింపబడినది ఆవచనము నిబంధకారులచే నుదహరింపబడకుండుటచేతను స్మృతులయందెచ్చటను కాన్పింపకుండుటచేతను 'చింతనీయము' అని స్మృతిముక్తాఫలమున ప్రతిపాదింపబడినది. ద్రావిడులయొక్కయు తదితరులయొక్కయు ఆచారముమాత్రము శతకవచనానుసారముగానే కలదు కాన నిందేది యుక్తమో దానిని గ్రహింపదగును. యథార్థముగానైతే త్రిరాత్రాది కాలములతిక్రమించినపిదప దశాహమునకులోగడవినినను స్నానముననే శుద్ధుడగును. అట్లుమితాక్షర మొదలగు గ్రంథములయందు చెప్పబడెను.

శ్లో॥ పక్షిణీయోనిసంబంధే నాతికాలేనసూతకం ॥

తా॥ యోనిసంబంధుని మరణనిమిత్తమున నవలంబింపదగిన పక్షిణ్యాశౌచము మరణానంతరము పక్షిణియతిక్రమించినపిదప మరణమునువినినచో నవలంబింపనక్కరలేదని చెప్పబడె తండ్రి మరణమున కొమరితకును సోదరునిమరణమున సోదరికిని అతిక్రాన్తాశౌచము. దశాహమునకు పిమ్మట వినినను కలదని ధర్మప్రవృత్తియందు విధింపబడినది,

శ్లో॥ పిత్రోర్దశదినాదూర్ధ్వం మరణంతత్తకన్యకా ।
శృణోతియదిచేత్తస్యాః పక్షిణ్యాశౌచమిష్యతే ॥
పుత్రీగేహేఽథవాఽన్యత్ర పితరౌప్రమృతౌయది ।
దశాహాభ్యన్తరేపుత్ర్యా స్త్రిరాత్రంశావసూతకం ॥

మరణంశ్రూయతేభ్రాతుర్దశాహాత్పరతోయది।
దినమేకంస్వసుఃప్రోక్తం స్నానంస్యాద్భగినీపతేః॥
దశాహాత్పరతోభ్రాతా మరణంశ్రూయతేస్వసుః।
తస్యైకదినమాశౌచం తత్పత్న్యాస్స్నానముచ్యతే॥
దశాహాత్పరతఃకన్యా మరణంశ్రూయతేయది।
ఆశౌచంతద్దినంపిత్రో ర్స్నానేష్వేషామితినిశ్చయః॥

తా॥ వివాహితయగుకన్న తలిదండ్రులయొక్క మరణమును దశాహమైనపిదప వినినచో పక్షిణ్యాశౌచము నవలంబింపవలయు. తలిదండ్రులు పుత్రికయొక్క గృహమునగాని మరియొకచోటగాని మరణించినవార్తను దశాహమునకు లోగడ వినినచో పుత్రికకు త్రిరాత్రము శావాశౌచము. సోదరునిమరణమున దశాహమునకు పిమ్మట వినబడినచో సోదరికేకరాత్రము. ఆమెభర్తము స్నానమాత్రము. సోదరియొక్కమరణమును సోదరుడు దశాహమునకు పిమ్మట వినినచో వానికొకదినముమాత్రమాశౌచము వానిభార్యకు స్నానమునశుద్ధి. పుత్రికయొక్క మరణమును తలిదండ్రులు దశాహమునకు పిమ్మటవినినచో వారికిమాత్రమాదినమాశౌచము తదితరులకు లేదు. మరియు పుత్రిక భగిని వీరికంటె యితరులగువారివిషయమున దశాహమునకు పిమ్మట వినబడినచో స్నానమాత్రమని యాధర్మప్రవృత్తియందే చెప్పబడినది.

శ్లో॥ మరణంత్వసపిండానాం దశాహాచ్చేద్బహిఃశ్రుతం।
తత్రిస్నానేనశుద్ధిఃస్యా దితిధర్మవిదోవిదుః॥

తా॥ సపిండులుకానివారి మరణము దశాహమునకు పిమ్మట వినబడినచో స్నానమునశుద్ధియని ధర్మవేత్తలుపల్కిరి. ఈ వచనము లితరనిబంధములయందుదహరింపబడకుండుటచేతను ఋషిచే జెప్పబడినట్లు చెప్పబడకుండుటచేతను ప్రమాణములనుటసందిగ్ధము. కొందరు శిష్టులగు ఆంధ్రులయొక్క ఆచారము మాత్రమీవచనములననుసరించియే కన్పట్టుచున్నది. "మరణంత్వసపిండానాం" అను వచనము మాత్రము స్మృతినిబంధములకు సమ్మతముగనున్నది కాన ప్రమాణ

మేయగును. పోతుభట్టీయము మొదలగువానియందు పక్షిణీవిషయ మున విశేషము చెప్పబడినది.

శ్లో॥ దేశకాలవ్యవాయేపి పక్షిణీనైవహీయతే।
సంపూర్ణైవతుకర్తవ్యా గతైర్వర్షశతైరపి॥

తా॥ పక్షిణ్యాశౌచము దేశవ్యవధానమున్నను బహుకాలమతిక్రమించినను తగ్గదు కాన సంపూర్ణముగ నాచరింపదగును అను వచనముదహరింపబడినది. ఈవచనమునను సరించినచో యావజ్జీవము పక్షిణ్యాశౌచమేయగుగాని కాలవిలంబాదులచే సంకోచము చెప్పుజనదు. కాన పక్షిణీవిషయమున రెండుపక్షములు, పక్షిణీకాలమతిక్రమించినచో స్నానమని యొకపక్షము, యావజ్జీవము పక్షిణియేనని యొకపక్షము, ద్రావిడశతకమున ననుసరించి వారలకు పక్షిణీకాలమతిక్రమించుచో దశాహమునకులోగడగూడ నొకకాలముగలదు. అటుపైన స్నానమాత్రమేనని యొకపక్షము కాన దేశాచారమునుబట్టియు కులాచారమునుబట్టియు నడువదగు. పుత్రుడు మొదనగువారివిషయమున ధర్మప్రవృత్తియందు విశేషము తెలుపబడినది.

శ్లో॥ పుత్రస్యోపనయాదూర్ధ్వం మరణంశ్రూయతేయది।
దశాహాత్పరతోయావ దబ్దంస్యాత్త్రిదినంతదా॥

తా॥ ఉపనీతుడగు పుత్రునిమరణము దశాహమునకు పిమ్మటను సంవత్సరమునకులోగడను తెలియబడినచో మూడుదినములాశౌచము. సంవత్సరమునకుపైన వినబడినచో స్నానమాత్రము, అంతకుమించిన యాశౌచముగలదనుటకు ప్రమాణములేదు. అకృతక్రియుడగు పుత్రుని విషయమున మాత్రము, సంవత్సరమునకు పిమ్మట వినినపుడుగూడ త్రిరాత్రమేయగు.

శ్లో॥ సాపత్న్యమాతృమరణం దశాహాచ్చేద్బహిఃశ్రుతం।
ప్రథమేబ్దేతుకర్తవ్యం త్రిదినంచాథపక్షిణీ॥
పితృపత్న్యామతీతాయా మపుత్రాయాంతువైయది।
సంవత్సరేవ్యతీతేపి త్రిరాత్రమశుచిర్భవేత్॥

తా॥ సవతితల్లియొక్క మరణవార్తను దశాహమునకు పిమ్మటను సంవత్సరమునకులోగడను వినినచో త్రిరాత్రాశౌచము ఆసంవత్సర మునకు పిమ్మటవినినచో పక్షిణిమాత్రమేయగు. ఆసవతితల్లియే పుత్రవతికానిచో తానే సంస్కరింపదగువాడుకాన సంవత్సరమతిక్రమించిన పిదపగూడ త్రిరాత్రాశౌచమునవలంబింపదగును. అనగా సంవత్సరము నకులోగడవినబడినచో దశరాత్రాశౌచమునవలంబింపదగునని భావము.

శ్లో॥ ప్రాగబ్దాజ్జననీసమం దిశతుతత్త్వేతోదకాదిక్రియాం।
తస్మాత్తూపరిగౌణమాతృమరణం శ్రుత్వాప్సదాఘంత్ర్యహం ॥

తా॥ పుత్రవతిగాని సవతితల్లియొక్క మరణవార్త సంవత్సరము నకులోగడ వినబడినచో తల్లికివలె ఉదకదానాదిక్రియల నెరవేర్చుచు పదిదినములాశౌచమునవలంబింపవలయు సంవత్సరమునకుపైన వినబడినచో త్రిరాత్రాశౌచమని వరదరాజీయమున జెప్పబడె. ఈవచనమున "ఉదకాదిక్రియ" అని యనుటచే నిది అకృతక్రియయగు సవతితల్లి విషయమనితోచుచున్నది శతకమునందు కృతక్రియయగు సవతితల్లియొక్క మరణమును సంవత్సరమునకు పిమ్మటవినినచో స్నానమాత్రమని చెప్పబడినది అదిద్రావిడవిషయము. భార్యాభర్తలకును సవతులకును పరస్పరము. తండ్రివిషయమున చెప్పబడినరీతిని యతిక్రాన్తాశౌచము.

శ్లో॥ మాతాపిత్రోర్యథాశౌచం దశాహంక్రియతేసుతైః।
అనేకేబ్దేపిదంపత్యో స్తథైవస్యాత్పరస్పరం ॥

తా॥ తలిదండ్రులయొక్క మరణవార్త అనేక సంవత్సరములు గడచినపిదప వినబడినను పుత్రులచేత యెట్లు దశాహాశౌచమవలంబింపబడుచున్నదో ఆవిధమునదంపతులుగూడ పరస్పరమతిక్రాన్తాశౌచము నవలంబింపదగునని ధర్మప్రవృత్తియందు విధింపబడె మరియు,

శ్లో॥ ప్రోషితభ్రాతృమరణే దత్తపిండోదకక్రియే।
త్రిరాత్రంసూతకంతత్ర దశాహంపుత్రభార్యయోః ॥

తా॥ పరదేశగతుడగు సోదరునిమరణము వినబడినచో పిండోదకక్రియలుజరిగియున్నచో త్రిరాత్రాశౌచము. ఆ చనిపోయినవాని

పుత్రునకు భార్యకుమాత్రము దశాహాశౌచము అని పైఠీనసివచనమున భార్యకు పుత్రునితో సమముగ నతిక్రాన్తాశౌచము విధింపబడియున్నది.

శ్లో॥ ఆశౌచేవ ర్తమానేతు పునర్దాహక్రియాయది॥

తా॥ అను ముందుదహరింపబోవు బృహస్పతివచనముచే దంపతులకును సవతులకును పుత్రునితో సమముగ అతిక్రాన్తాశౌచము విధింపబడె. స్మృత్యర్థసారమునందు పుత్రునకు తండ్రివిషయమునను భార్యకు భర్తవిషయమునను పునర్దహనాశౌచమును చెప్పి పత్నికి పునస్సంస్కారము జేయబడినచో భర్తకుగూడ నిట్లేనని చెప్పబడె. కాన భార్యాభర్తలకును సవతులకును పరస్పరము తండ్రికివలె నతిక్రాన్తాశౌచము. సవతులు దంపతులు తలిదండ్రులు వీరివిషయమునదక్క నితరులవిషయమున నతిక్రాన్తాశౌచము. ఏకదేశమునందలి విషయము ఇతరదేశమునందువారు మృతినొందినచో స్నానమాత్రము.

శ్లో॥ దేశాన్తరేమృతంశ్రుత్వా క్లీబే వైఖానసేయతౌ।
మృతేస్నానేనశుద్ధ్యంతి గర్భస్రావేచగోత్రిణః॥

తా॥ దేశాన్తరమున మరణమునొందినవాని విషయమునను నపుంసకుడు వైఖానసుడు యతి వీరివిషయమునను స్నానమున శుద్ధుడగును అని యాజ్ఞవల్క్యమహర్షి పలికెను. మనువు దేశాన్తరలక్షణమును చెప్పియుండె.

శ్లో॥ మహానద్యన్తరంయత్ర గిరిర్వావ్యవధాయకః।
వాచోయత్రవిభిద్యన్తే తద్దేశాన్తరముచ్యతే॥

తా॥ ఏప్రదేశమునకు మహానదిగాని పర్వతముగాని వ్యవధానముకల్పించుచున్నదో ఏదేశమున భాషమారునో అది దేశాన్తరమనబడును మరియు,

శ్లో॥ దేశాన్తరంవదంత్యన్యే షష్టియోజనమాయతం।
చత్వారింశద్వదంత్యన్యే త్రింశదన్యేతథైవచ॥

తా॥ అఱువదియోజనముల దూరముననున్న ప్రదేశము దేశాన్తరమనబడునని కొందరుచెప్పిరి. కొందరు నలుబదియోజనములదూరమనియు కొందరు ముప్పదియోజనముల దూరమనియు పలికిరి. అని

బృహస్పతివచనము. ఈమహానదీవ్యవధానము మొదలగునవియన్నియు దేశాన్తరప్రయోజనములేదని విజ్ఞానేశ్వరుడు మొదలగువారు పలికిరి. స్మృతిసారసర్వస్వకారుడు మొదలగువారు బృహస్పతిచే జెప్పబడిన యోజనవ్యవధానమే దేశభేదప్రయోజకమనిన్నీ మహానదీవ్యవధానము మొదలగునవి కావనిన్నీ పలికిరి. ఆచారము బృహస్పతివచనానుసారమే గలదు మహానదులు వామనపురాణమున జెప్పబడినవి.

శ్లో॥ గోదావరీభీమరధీ కృష్ణవేణీచజాహ్నవీ।
తుంగభద్రాసుప్రయాగా కావేరీసత్యనామికా ॥
దుగ్ధోదానళినీ రేవా నిబిడాకలభస్వనా ।
అన్యాఅపిమహానద్య స్సహ్యామాలాద్వినిర్గతాః ॥

తా॥ గోదావరి, భీమరధి, కృష్ణవేణి, జాహ్నవి, తుంగభద్ర, సుప్రయాగ, కావేరి, సత్యనామ, దుగ్ధోధ, నళిని, నర్మద, నిబిడ, కలభస్వన మొదలగు మహానదులును సహ్యపర్వతమునుండి బయలువెడలినవి ఇకపర్వతములేవియనిన,

శ్లో॥ శ్రీశైలోహిమవాన్మేరుః మైనాకోమలయ స్తథా।
ఋషభఃకూటశైలశ్చ హేమకూట స్తథైవచ॥
గోవర్ధనశ్చగోకర్ణః నీలశ్చకకుభ స్తథా।
సహ్యోవింధ్యశ్చమందారో విఖ్యాతాఃపర్వతాఅమీ ॥

తా॥ శ్రీశైలము, హిమవంతము, మేరువు, మైనాకము, మలయము, ఋషభము, కూటశైలము, హేమకూటము, గోవర్ధనము, గోకర్ణము, నీలము, కకుభము, సహ్యము, వింధ్యము, మందరము, ఇవిప్రసిద్ధములగుపర్వతములు.

శ్లో॥ దశాహాంతపునర్దాహే శేషాచ్ఛుద్ధిరశౌచినాం।
తదూర్ధ్వందహనేపూర్వ మాశౌచస్యాగ్రహేత్ర్యహం॥

తా॥ దశాహమునకులోగడనే పునర్దహనము జేయవలసివచ్చినచో జ్ఞాతులకు దశాహశేషమునశుద్ధి, దశాహమునకుపిమ్మటయగుచో పూర్వమాశౌచమవలంబింపని జ్ఞాతులకు త్రిరాత్రాశౌచము, పూర్వమాశౌచమవలంబించినవారికేమియును లేదు.

శ్లో॥ అమంత్రపూర్వందగ్ధానా మంగవై కల్యశేషిణాం ।
ఆత్మభావమృతానాంచ పునర్దహఃమిష్యతే ॥

తా॥ మంత్రపూర్వకముగ దహింపబడనివారలకును దహనము జేయబడి కొన్నియవయవములు శేషించియున్నవారలకును బుద్ధిపూర్వకముగ బలవన్మరణమునొందినవారకును పునర్దహనము జేయవలయు.

శ్లో॥ మంత్రవత్సంస్కృతస్యాపి హ్యాసమాప్తోదకస్యతు ।
అర్వాగ్దశదినాదూర్ధ్వం పునర్దాహోవిధీయతే ॥

తా॥ మంత్రపూర్వకముగ సంస్కరింపబడినను పదిదినములకు లోగడ తిలోదకదానాదులు సమాప్తినొందింపబడనివానికి ఆదశాహమునకుపిమ్మట పునర్దహనము జేయవలయును.

శ్లో॥ దేశాన్తరమృతానాంతు రాజభిర్వావిషాదిభిః।
తేషామంగంపలాశాద్యైః కృత్వాదేహంపునర్దహేత్ ॥
శవవత్ప్రతిపత్తిశ్చ ఆజ్యాగ్నిస్పర్శనంవిదుః ॥

తా॥ దేశాన్తరమునందు మృతినొందినట్టియు రాజులచేతగాని విషముచేతగాని మృతినొందినట్టివారలకు పలాశాదులచే శరీరమును నిర్మించి దానినే శవమనిభావించి దహింపవలయు పిదప ఆజ్యమును అగ్నిని స్పృశింపవలయును.

—♦ పునర్దహనసూతకవిషయము. ♦—

శ్లో॥ అనేకాబ్దాత్వయేపిస్యా త్పునర్దహనసూతకం॥

తా॥ మరణదశాహమున ఆశౌచమునవలంబింపని జ్ఞాతులకు అనేకసంవత్సరములు గడచినపిదప పునర్దహనము చేయబడినను త్రిరాత్రాశౌచమావశ్యకము. కర్తకువిశేషమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రాగ్గృహేపితదాకర్తు స్త్రీదినాశౌచమిష్యతే ॥

తా॥ కర్తయగువాడు మరణదశాహమున ఆశౌచము నవలంబించియున్నను పునర్దహనాశౌచమును త్రిరాత్రమవలంబింపవలయు. కొందరు కర్తకు తదితరునకును పునర్దహనాశౌచము సంవత్సరమునకు పిమ్మట నేకరాత్రిమనిరి కాన ఆచారమునసరించి గ్రహింపదగును.

—♦ పుత్రునివిషయమునవిశేషము. ♦—

శ్లో॥ కర్తాపుత్రోయదితదా త్రిదినంప్రాగ్గ్రహేసతి।
పాగ్రగ్రహేతుపూర్ణంస్యా దితిధర్మవిదోవిదుః ॥

తా॥ కర్తపుత్రుడేయైన పక్షమున తలిదండ్రులు మృతినొందినది మొదలుగాని ఆమృతినొందినవార్తని వినినదిమొదలుగాని దేశవిప్లవము చేతగాని ద్రవ్యములేకపోవుటచేతగాని తదితరకారణముచేగాని ప్రేత కృత్యములు నెరవేర్పజాలక మరణముమొదలుగాని ఆమరణవార్తను వినినదిమొదలుగాని ఆశౌచనియమముల దశాహపర్యంతమవలంబిన పుత్రుడు దశాహమధ్యకాలముననే ప్రేతకృత్యముల నెరవేర్పగల్గుచో దశాహశేషమున శుద్ధుడగు. అట్లునెరవేర్పలేనిపక్షమున అటుపిమ్మట కర్మజేయగల్గినపుడు జేసెడి పునర్దహనమువలన త్రిరాత్రాశౌచముగల వాడగును ఏపుత్రుడు మరణదశాహమునందాశౌచమునే యవలంబింపడో అతడు తలిదండ్రులయొక్క పునర్దహనమున పూర్ణాశౌచము నవలంబింపదగును

—♦ అస్థిదహనమునవిశేషము. ♦—

శ్లో॥ అస్థిదాహేతుసర్వేషాం పూర్ణమాశౌచమిష్యతే॥

తా॥ అస్థిదహనము జేయబడినపక్షమున పుత్రులకును జ్ఞాతులకును పూర్ణాశౌచమేయగు. దశాహమధ్యయందీ యస్థిదహనమగుచో దశాహశేషమున శుద్ధియగు. ఆహితాగ్నివిషయమున విశేషమును చెప్పుచున్నాడు.

శ్లో॥ పాలాశదహనేపిస్యా త్పూర్వమేవాహితాగ్నిషు॥

తా॥ ఆహితాగ్నులు మృతులైనపుడు పాలాశవిధియందుగూడ పుత్రులకును జ్ఞాతులకును పూర్ణాశౌచమేయగు.

సూ॥ ఆహితాగ్నిశ్చేత్ప్రవసన్మ్రియేత పునస్సంస్కారంకృత్వా శవచ్ఛౌచం॥

తా॥ ఆహితాగ్ని దేశాంతరమునందు మృతుడైనచో పునస్సంస్కారమునుజేసి ప్రత్యక్షశవదహనమునందువలె జ్ఞాతులును పుత్రులును దశాహమున శుద్ధులగుదురు అని పైఠీనసిపల్కె.

శ్లో॥ అనాహితాగ్నేర్దాహస్తు కార్యోగృహ్యాగ్నినాద్విజైః।
తదభావేపలాశోద్థైః పర్ణైఃకార్యంశరీరకం॥
శవంపర్ణమయందగ్ధ్వా త్రిరాత్రమశుచిర్భవేత్ ॥

తా॥ ఆహితాగ్నికానివానియొక్క దహనము గృహ్యాగ్నిచే జేయదగినది. వానియొక్క శరీరములేనిచో పలాశవృక్షముయొక్క పర్ణములచేత శరీరాకృతినిజేసి ఆపర్ణవికారమగు శవమును దహనము జేసి త్రిరాత్రిమాశౌచమవలంబింపవలయునని బ్రహ్మపురాణమున జెప్ప బడియెను ఇది పుత్రుడు కానివానివిషయము పుత్రుని విషయమైనను పూర్వమాశౌచము నవలంబించినవానివిషయమగును.

శ్లో॥ దగ్ధ్వాస్థిపిత్రోఃపుత్రస్తు దశాహంసూతకీభవేత్ ।
తయోఃప్రతికృతీదగ్ధ్వా త్రిరాత్రమశుచిర్భవేత్ ॥

తా॥ తలిదండ్రులయొక్క అస్థికలకు పుత్రుడు పునర్దహనమును జేసినచో దశాహాశౌచముగలవాడగును. వారియొక్క ప్రతికృతులను అనఁగా మోదుగాకులు మొదలగువానిచే జేయబడిన యాకృతులను దహనముజేసినచో త్రిరాత్రాశౌచము అని మఱియొక స్మృతియందు చెప్పబడె. ఇదిగూడ పూర్వమాశౌచము నవలంబించినవాని విష యమేయగు

శ్లో॥ దగ్ధ్వాస్థిపిత్రోఃపుత్రస్తు దశాహంసూతకీభవేత్ ।
తయోఃప్రతికృతీదగ్ధ్వా శవవచ్ఛౌచమిష్యతే॥

తా॥ పుత్రుడు తలిదండ్రులయొక్క అస్థికలను దహనము జేసి నచో పదిదినములు సూతకము నవలంబింపవలయు వారియొక్క ప్రతి కృతులను దహనముజేసినను శావాశౌచమునవలంబింపవలయు అనగా దశరాత్రాశౌచము నవలంబింపవలయునని దేవలుడుచెప్పె ఇది మరణ దశాహమునందాశౌచము నవలంబింపని పుత్రునివిషయమని తెలియదగు కాన తలిదండ్రులయొక్క పాలాశవిధియందు అంతకుపూర్వమాశౌచ మవలంబింపనివానికి దశాహాశౌచమని నిశ్చయము మరియు,

శ్లో॥ నరంపర్ణమయందగ్ధ్వా త్రిరాత్రమశుచిర్భవేత్ ।
మాతాపిత్రోర్దశాహంస్యాదస్థిదాహేతథైవచ ॥

తా॥ పర్ణవికారమగు శవముదు దహించినచో మూడురాత్రు లాశౌచము. తలిదండ్రులయొక్క అస్థికలను దహనముజేసినచో దశాహాశౌచము అని మఱియొక స్మృతియందు జెప్పబడెను మరియు,

శ్లో॥ ఆశౌచాత్కీకసాదేః ప్రదాహే శేషాచ్ఛుద్ధిస్తద్వహిశ్చేత్త్రిరాత్రాత్ । పుత్రస్యాపిప్రాగశౌచగ్రహశ్చేన్నోచేత్తస్యాప్యతి సంపూర్ణమాహుః॥

తా॥ దశాహమునకులోగడ అస్థిదహనము జేసినచో దశాహశేషమున శుద్ధియగు. ఆదశాహమునకు పిమ్మటయైనచో జ్ఞాతులకు త్రిరాత్రము, పుత్రులుగూడ లోగడ ఆశౌచము నవలంబించియున్నచో పునరస్థిదహనమున త్రిరాత్రాశౌచమునె యవలంబింపదగు అట్లవలంబించియుండనిచో పూర్ణాశౌచము అను వచనము శిష్టాచారవిరుద్ధమగుటచే అనాదరణీయము పూర్వమాశౌచము నవలంబించియున్న పుత్రునివిషయమునందు వసిష్ఠవచనము.

శ్లో॥ ప్రమీతపితృకః పుత్రో హ్యౌర్ధ్వదైహికమాచరేత్ ।
యదికర్తుమశక్తశ్చేద్దాశౌచనియమాన్వితః ॥
ఆదశాహాదథోర్ధ్వంవా యదాకార్యక్షమస్తదా ।
త్రిరాత్రంసమతిక్రమ్య శ్రాద్ధంకుర్యాద్యథావిధి ॥
దాహకస్యైవమాశౌచ మితరేషాంనవిద్యతే ।
కాలాతిపత్తివిషయే యద్యర్వాగపితత్సమం ॥

తా॥ తండ్రిమృతినొందినచో పుత్రుడు వెంటనే ఔర్ధ్వదైహికకర్మలనాచరింపవలయు అట్లాచరింపశక్తిలేనిచో ఆశౌచనియమముల నవలంబించియుండి దశాహమునకు లోగడనైనను చేయువలయు అట్లుగాక దశాహమునకుపిమ్మట జేసెడిపక్షమున మూడుదినములాశౌచము నవలంబించినపిదప యథావిధిగ శ్రాద్ధమును చేయువలయు. ఈయాశౌచము పునర్దహనముజేసినవానికేగాని జ్ఞాతులందఱకు లేదు. ఉక్తకాల మతిక్రమించినపిదప వినిన జ్ఞాతులకుగూడ దినత్రయమే యాశౌచమని వసిష్ఠవచనము మరియు,

శ్లో॥ గృహీతేపూర్వమాశౌచే పితుశ్చాసంస్కృతస్యతు।
దాహాదిపునరాశౌచం దశాహమితికథ్యతే॥

తా॥ మంత్రపూర్వముగ సంస్కరింపబడని తండ్రియొక్కమరణ దశాహమున పుత్రులాశౌచము నవలంబించియున్నను పునర్దహనము జేసినదిమొదలుకొని పదిదినములు మరల యాశౌచము నవలంబింపవల యునను వచనమస్థిదాహవిషయమని తెలియదగు ఇకజ్ఞాతివిషయమున

శ్లో॥ పూర్వంగృహీతాశౌచానాం నపునర్దహనేత్వఘం।
తస్మిన్నుదకదాతౄణా మాశౌచంమనురబ్రవీత్॥

తా॥ మరణదశాహమునందాశౌచము నవలంబించియున్నవార లకు పునర్దహనాశౌచములేదు. అందుదకదానము నాచరించువారలకు మాత్రమాశౌచముగలదని మనువుచెప్పెను. పూర్వమాశౌచము నవ లంబించి యుదకదానము నాచరించిన వారలకాశౌచమేమాత్రమును లేదు. పూర్వముదకదానము నాచరింపనిచో పూర్వమాశౌచము నవ లంబించియుండి పునర్దహమునందుదకదానము జేయుచున్న జ్ఞాతుల కొకదినముమాత్రమాశౌచమని యర్థము. ఆశౌచమునుగూడ యవలం బింపనివారలకుమాత్రము త్రిరాత్రము.

శ్లో॥ దశాహాత్పరతోయస్య పునస్సంస్కరణక్రియా।
అనేకాబ్దేపిసర్వేషాం త్రిదినంశావకంభవేత్॥

తా॥ దశాహమునకుపిమ్మట పునస్సంస్కారము చేయబడినచో నాపునస్సంస్కారమెన్ని సంవత్సరములకు పిమ్మటనైనను జ్ఞాతులంద రకు మూడు దినములాశౌచమని ధర్మప్రవృత్తియందు చెప్పబడె. మరియు,

శ్లో॥ అతీతేబ్దేతుసంస్కారే ఏకాహాత్పిండమర్పయేత్।
శ్రాద్ధందద్యాద్ద్వితీయేహ్ని తృతీయేహ్నిసపిండనం॥

తా॥ సంవత్సరమతిక్రమించిన పిదప పునర్దహనము జేసినచో మొదటిదినమున పిండముసర్పింపవలయు రెండవదినమున శ్రాద్ధమును మూడవదినమున సపిండీకరణమును చేయవలయునను గర్గవచనముచేత

కర్తకును తదితరులగు జ్ఞాతులకును విధింపబడిన సావత్సరమునకుపిమ్మట జరుగు పునర్దహనమున యేకదినాశౌచము వైకల్పికమని తెలియవగు. కాన యాచారముననుసరించి నడువదగును ఇంకు ప్రత్యక్షదహనమున గాని పునర్దహనమునగాని సపిండులకుగాని అసపిండులకుగాని యేయే యాశౌచము చెప్పబడినదియో అదియాతయు నాహితాగ్నివిషయమున దహనము మొదలుకొని యాచరింపదగును అనాహితాగ్నివిషమున మరణముమొదలుకొనియే గ్రహింపదగును.

శ్లో॥ ఆహితాగ్నేస్తుదహనా ద్దశాహాశౌచమిష్యతే ।
అనాహితాగ్నేర్మరణా త్పునర్దాహోయదాభవేత్ ॥
ఆశౌచేవర్తమానేచే త్తచ్ఛేషేణవిశుద్ధ్యతి ।
గతేత్వాశౌచదివసే పునర్దాహోయదాభవేత్ ॥
మరణాదిగృహీతస్య త్రిరాత్రాచ్ఛుద్ధిరిష్యతే
అగృహీతస్యపుత్రస్య సంపూర్ణాశౌచమిష్యతే॥
దుర్మృతానాంద్విజాతీనాం దశాహాత్సర్పహీస్తువా ।
నాశుద్ధిర్నైవచాశౌచం శుద్ధింలబ్ధ్వాప్రదాహయేత్ ॥
తదాదిచోదకంపిండ మాశౌచంశ్రాద్ధమేవచ ।

తా॥ ఆహితాగ్ని విషయమున దహనమైనది మొదలుకొనిన్నీ అనాహితాగ్నివిషయమున మరణముమొదలుకొనిన్నీ ఆశౌచమునవలంబింపవలయును. దశాహమునకులోగడ పునర్దహనము జేసినపక్షమున దశాహశేషమున శుద్ధియగును దశాహమునకు పిమ్మట పునర్దహనము జేసినపక్షమున లోగడ ఆశౌచమునవలంబించినవానికి త్రిరాత్రమున్నూ అట్లాచరింపనివానికి పూర్ణాశౌచమున్నూ చెప్పబడినది దుర్మణము నొందినవాని నిమిత్తమున జ్ఞాతులకు దశాహమునకులోగడగాని పిమ్మట గాని అస్పృశ్యతగాని కర్మలయందధికారము లేకపోవుటగాని లేదు కావున మృతినొందినవానికి దుర్మరణనిమిత్తమునగల్గు దురితము పోవుటకై ప్రాయశ్చిత్తము నారాయణబలి మొదలగునవి యాచరింపబడిన పిదప పునర్దహనముజేసి యది మొదలుకొని ఉదకము పిండము ఆశౌ

చము శ్రాద్ధము మొదలగునవి చేయదగునని పారస్కరుడు పలికెను. మరియు,

శ్లో॥ అనగ్నిమతఉత్క్రాంతే రాశౌచంహిద్విజాతిషు।
దాహాదగ్నిమతోవిద్యా ద్విదేశస్థేమృతేసతి॥

తా॥ అనాహితాగ్నియొక్క మరణము మొదలుకొనిన్నీ ఆహితాగ్నియొక్క దహనము మొదలుకొనిన్నీ జ్ఞాతులాశౌచము నవలంబింపవలయు విదేశమునందు మృతినొందినవాని విషయమునగూడ పునర్దహనము మొదలుకొనియేయాశౌచము అని పైఠీనసిపలికెను మరియు,

శ్లో॥ అనగ్నిమతఉత్క్రాంతే సాగ్నేస్సంస్కారకర్మణః।
శుద్ధిస్సంచయనందాహో న్మృతాహస్తుయథావిధి॥

తా॥ అనాహితాగ్నివిషయమున మరణము మొదలుకొనిన్నీ ఆహితాగ్నివిషయమున సంస్కారమైనది మొదలుకొనిన్నీ ఆశౌచము నవలంబింపవలయు సంచయనము దహనమైనది మొదలుకొని మూడవ దినమునగాని నాల్గవ దినమునగాని చేయదగును అని యంగిరసుడు పల్కె ఇట్లుచెప్పుటచే ఆహితాగ్ని మృతినొందినపిదపగూడ మంత్రపూర్వకముగ సంస్కరిపబడుటకు లోగడ పుత్రులకును జ్ఞాతులకును ఆశౌచములేనందున నిత్యనైమిత్తికకర్మలననుష్ఠింపవచ్చునని తాత్పర్యము మరియు ఆహితాగ్నియగు తండ్రి దేశాన్తరమున మృతుడైనపుడు వానిపుత్రులు మొదలగువారికి సంస్కారముచేయబడువరకు సంధ్యాదికర్మలకు లోపములేదని విజ్ఞానేశ్వరుడు పలికెను. అనాహితాగ్నికి పునర్దహనమునకు పూర్వము జ్ఞాతులాశౌచము నవలంబించినచో తిలోదకమునుగూడ నివ్వదగును అట్లుచేయనిచో పుత్రుడు పునర్దహనము చేయుసమయమున తిలోదకమునిచ్చుటకై జ్ఞాతులకొకదినమాశౌచము గల్గు ఈవెనుకటివిషయమంతయు దశాహమునకు లోగడవినినపక్షమున నని తెలియదగు ఆదశాహమునకు పిమ్మట వినినచో పునర్దహనమగు వరకు ఆశౌచమునవలంబింపదగదు. ఇకనేమన పునర్దహనసమయమున త్రిరాత్రమాశౌచమని స్మృత్యర్థసారమున ప్రతిపాదింపబడెను మరియు,

బృహస్పతి సవతులకును భార్యాభర్తలకును పరస్పరము తండ్రికిచెప్ప బడిన యాశౌచమును చెప్పెను

శ్లో॥ ఆశౌచేవర్తమానేతు పునర్దాహక్రియాయది।
తచ్ఛేషేణవిశుద్ధిస్స్యా దతీతేసూతకంభవేత్॥
దశాహాదియథావర్ణం పిత్రోరాశౌచమాచరేత్।
సపత్నీనాంమిథోజ్ఞేయం దంపత్యోశ్చపరస్పరం॥
సపిండానాంత్రిరాత్రంస్యా దిత్యువాచప్రజాపతిః॥

తా॥ ఆశౌచము నవలంబింపుచుండగనే పునర్దహనము జేసి నచో నాయాశౌచశేషమునశుద్ధియగు. ఆశౌచముగడచినపిదప పునర్దహనముజేసినచో నాయావర్ణములకు జెప్పబడిన దశాహాదిపూర్ణాశౌచము తలిదండ్రులవిషయమున పుత్రులకును సవతులకును భార్యాభర్తలకును పరస్పరమును గలుగును జ్ఞాతులకుమాత్రము త్రిరాత్రమే యగునని ప్రజాపతిచెప్పెను వెనుకనుదహరింపబడిన పారస్కరుని వచనమునందు దుర్మరణమునొందినవారి విషయమునందాశౌచమక్కరలేద నుట బుద్ధిపూర్వకదుర్మరణవిషయము. ఏవ్యాపారము జేసినచో మరణముగల్గునని నిశ్చయమో సంశయమేమాత్రమును లేదో అట్టివ్యాపారమునందు ప్రవర్తించి మృతినొందినవానికి తత్కాలమునందాశౌచము గాని ప్రేతకృత్యముగాని చేయుదగదు. ప్రమాదవశమున యూహింపబడని దుర్మరణము తటస్థించినచో వానికిట్టిదోషములేదు. వానికి తత్కాలమునందే ఆశౌచమును ప్రేతకృత్యముచు చేయదగు.

శ్లో॥ శృంగిదంష్ట్రినఖివ్యాళ విషవహ్నిమహాజలైః।
సుదూరాత్పరిహర్తవ్యైః కుర్వన్క్రీడాంమృతస్తుయః॥
నాగానాంవిప్రియంకుర్వన్ దగ్ధశ్చాప్యథవిద్యుతా।
నిగృహీతాశ్చయేరాజ్ఞా చౌర్యదోషేణకుత్రచిత్॥
పరదారాన్హరంతశ్చ రోషాత్తత్పతిభిర్హతాః।
అసమానైశ్చసంకీర్ణై శ్చండాలాద్యైశ్చవిగ్రహం॥
కృత్వాతైర్నిహతాస్తద్వత్ చండాలాదీన్సమాశ్రితాః।

కో ధాత్ప్రాయంవిషంవహ్నిం శస్త్రముద్బంధనంజలం॥
గిరివృక్షప్రపాతంచ యేకుర్వంతినరాధమాః।
మహాపాతకినోయేచ పతితాస్తేప్రకీర్తితాః ॥
పతితానాంనదాహస్స్యాన్నోదకంనాస్తిసంచయః ।
నచాశ్రుపాతఃపిండోవా కార్యంశ్రాద్ధాదికంక్వచిత్ ॥

తా॥ కొమ్ములుగల ఎనుబోతు మొదలగువానిచేతను కోరలుగల అడవిపంది మొదలగువానిచేతను గోళ్లుగల పులి మొదలగు జంతువులచేతను ఇంకను విషము, అగ్ని, గొప్పజలము మొదలగు మిక్కిలి దూరమున పరిహరింపదగినవానితో క్రీడించి మృతినొందినవానికిన్ని సర్పములకపకారముచేసియు పిడుగుచేత దహింపబడియు రాజుచేత నిగ్రహింపబడియు చోరత్వముచేసియు ఇతరునిభార్యనపహరించి దాని భర్తచే రోషమున చంపబడినట్టియు తనతోసమానులుగాని సంకరులచేతను చండాలురు మొదలగువారిచేతను విరోధమునచంపబడియు చండాలాదులనాశ్రయించియుండియు క్రోధమున ప్రాయోపవేశనము జేసియు విషము అగ్ని ఉరి శస్త్రము మొదలగువానిచేతను పర్వతము వృక్షము మొదలగువానినుండి పడియు మృతినొందిన నరాధములును మహాపాతకులు పతితులనబడుదురు. ఈపతితమరణమునందు దహనము గాని సంచయనముగాని ఉదకక్రియగాని కన్నీరుగార్చుటగాని పిండము గాని శ్రాద్ధముగాని చేయదగదు అని బ్రహ్మపురాణమున జెప్పబడె.

మరియు,

శ్లో॥ చండాలాదుదకాత్సర్పా ద్విషాద్వావైద్యుతాదపి ।
దంష్ట్రిభ్యశ్చపశుభ్యశ్చ మరణంపాపకర్మణాం॥
ఉదకంపిండదానంచ ప్రేతేభ్యోయత్ప్రదీయతే।
నోపతిష్ఠతితత్సర్వ మంతరిక్షేవినశ్యతి ॥
నాశౌచంనోదకంనాశ్రు నదాహోద్యన్తకర్మచ ।
బ్రహ్మదండహతానాంచ నకుర్యాత్కటధారణం ॥

తా॥ పాపకర్ములకు చండాలుడు ఉదకము, సర్పము, విషము, పిడుగు, పులి, మొదలగు కోరలుగల జంతువులు పశువులు మొదలగు

వానివలన మరణము గల్గును వారినిగూర్చి ఇవ్వబడు ఉదకము పిండము మొదలగునవి వారికిచెందవు. అంతరిక్షమున నేనశించును. వీరిని గూర్చి ఆశౌచము ఉదకము కన్నీరువిడచుట దహనముచేయుట మొదలగునవియక్కరలేదు బ్రాహ్మణ శాపముచేతగాని అభిచారముచేతగాని మృతినొందినవారలకు శవదహనయోగ్యమగు కటముమొదలగునవియక్కరలేదని యముడుచెప్పె. ఈయాశౌచనిషేధము సంవత్సరమునకుపూర్వమేయగు. సంవత్సరమునకుపిమ్మట ప్రాయశ్చిత్తమును చేసి నారాయణబలినిచేసి తిరిగిమంత్రసంస్కారముచేయదగు. అప్పుడే జ్ఞాతులకును బంధువులకును శాస్త్రమునవారివారికి విధింపబడినయాశౌచము కలుగును. ఎవడు సంవత్సరమువరకు కాలమును నిరీక్షింపక తత్కాలమునందే ప్రేతకృత్యములజేయ సమకట్టునో వాడు దుర్మరణ ప్రాయశ్చిత్తమునైదురెట్లు ఆచరింపదగు. ఇట్లె మూడవమాసము మొదలగువానియందు ప్రాయశ్చిత్తమునకుగూడ తారతమ్యముగలదు. ఈ విషయము సవిస్తరముగ ఈ సుబ్రహ్మణ్యపండితునిచే రచింపబడిన ధర్మచింతామణియందుగనందగు. ప్రమాదవశమునఅడవిపంది మొదలగు వానిచే చంపబడినచో నది దుర్మరణముగానేరదు. అందాశౌచమును ప్రేతకర్మయును తత్కాలమునందేచేయదగును.

శ్లో॥ ప్రమాదాదపినిశ్శంక మకస్మాద్విధిచోదితః।
శృంగిదంష్ట్రినఖివ్యాళ విషవిద్యుజ్జలాదిభిః ॥
చండాలైరథవాచోరైః నిహతోయత్రకుత్రచిత్ ।
తస్యదాహాదికంకార్యం యస్మాన్నపతితస్తునః ॥

తా॥ ప్రమాదవశమున దైవప్రేరితుడై కొమ్ములుగల్గినట్టియు గోళ్లుగల్గినట్టియు జంతువులవలనను సర్పము, విషము, పిడుగు, జలము, మొదలగువానిచేతను చండాలుడు మొదలగువారివలనను మృతినొందినచో నతడు పతితుడుకాడు కాన వాని దహనాదులు సక్రమముగనే చేయదగునని బ్రహ్మపురాణమున చెప్పబడెను మరియు,

శ్లో॥ యదికశ్చిత్ప్రమాదేన మ్రియతేఽగ్న్యుదకాదిభిః।
తస్యాశౌచంవిధాతవ్యం కర్తవ్యాచోదకక్రియా ॥

తా॥ ఎవడైనను ప్రమాదవశమున అగ్ని ఉదకము మొదలగు వానివలన మృతుడైనచో వానివిషయమున ఆశౌచమునవలంబింప దగును. ఉదకక్రియగూడ చేయదగునని యంగిరసుడు పలికెను. ఈ దుర్మరణములయందు త్రిరాత్రాశౌచమని కొందరనిరి కాని అది కలి సమయములయందు నిషేధింపబడినది

—♦ ఇక సంగ్రహము. ♦—

జ్ఞాతులయొక్క మరణము దశాహ మధ్యమున వినబడినచో దశాహ శేషమున శుద్ధియగు. దశాహమునకు పిమ్మట మూడుమాస ములలోగడ వినబడినచో త్రిరాత్రము పిమ్మట నారుమాసములలోగడ పక్షిణి పిమ్మట సంవత్సరము లోగడ నొకదినము సంవత్సరమునకు పిమ్మట స్నానమాత్రము అని యొకపక్షము తొమ్మిదవమాసమునకు పిమ్మట స్నానమాత్రమని మరియొకపక్షము. త్రిరాత్రాశౌచము నవ లంబింపదగినవారియొక్క మరణము త్రిరాత్రమునకులోగడ వినబడి నచో త్రిరాత్ర శేషమున శుద్ధియగు ఆత్రిరాత్రమతిక్రమించినచో స్నాన మాత్రము పక్షిణ్యాశౌచముగలవారియొక్క మరణము పక్షిణికిలోగడ వినబడినచో పక్షిణీ శేషమునశుద్ధియగు. పక్షిణీకాలమతిక్రమించినపిదప వినబడినచో స్నానమాత్రమని యొకపక్షము యావజ్జీవము ఎప్పుడు వినినను అదిమొదలుకొని పక్షిణ్యాశౌచము నవలంబింపదగునని మరి యొకపక్షము కాన యాచారమునననుసరించి నడువదగు. ఏకరాత్రమా శౌచమునవలంబింపదగినవారు మృతులైనపుడు ఆవార్త ఏకరాత్రిమతి క్రమించిన పిదప వినబడినచో స్నానమాత్రము తలిదండ్రుల విషయ మున వివాహితయగుకన్యకు దశాహములోగడ నెప్పుడు వినినను నది మొదలు త్రిరాత్రిము ఆదశాహమునకు పిమ్మట వినబడినచో పక్షిణి యని ధర్మప్రవృత్తిననుసరించువారనిరి మరికొందరు త్రిరాత్రమునకు పిమ్మట వినబడినచో పక్షిణియనిరి. పుత్రికవిషయమున తండ్రికిని సోద రీసోదరులకు పరస్పరమును దశాహమునకు లోగడ పక్షిణియనియు అటుపిమ్మట నేకరాత్రమనియు ధర్మప్రవృత్తిపక్షము యావజ్జీవము పక్షిణియేనని మరియొకపక్షము. పక్షిణీకాలమతిక్రమించినచో స్నాన

మని మూడవపక్షము పుత్రునివిషయమున తండ్రికి దశాహమునకు
పిమ్మట సంవత్సరములోగానైనచో త్రిరాత్రము అటుపిమ్మట స్నాన
మాత్రము ఏకరాత్రమని కొందరనిరి అకృతక్రియుడగు పుత్రునివిషయ
మున సంవత్సరమునకుపిమ్మటగూడ త్రిరాత్రమేయగు సవతితల్లియొక్క
మరణమున సంవత్సరపర్యన్తము త్రిరాత్రము అటుపిమ్మట యావజ్జీవ
ముపక్షిణియగు. ఆసవతితల్లి అపుత్రవతియై అకృతక్రియయగుపక్షమున
సంవత్సరమునకులోగడ దశరాత్రమును అటుపిమ్మట త్రిరాత్రమును
అగును ఈసవతితల్లియొక్క ఆశౌచము ముప్పదియోజనముల వ్యవ
ధానమున్నను అగును అనుపనీతులగు జ్ఞాతులయొక్కగాని సోదరుల
యొక్కగాని పుత్రులయొక్కగాని మరణమును ఆయాయాశౌచమధ్య
మున విననచో ఆశౌచశేషమున శుద్ధియగు. ఆయాశౌచకాలమతిక్ర
మించినపిదప వినినచో స్నానమాత్రము. తలిదండ్రులయొక్క మరణ
మున వారు కృతక్రియులుగాని పక్షమున యావజ్జీవము దశరాత్రమే
యగు కృతక్రియులైనపక్షమున ఇరువదిసంవత్సరములవరకుదశరాత్రము
అటుపిమ్మటత్రిరాత్రము దశాహమునకులోగడ వినినచో దశాహశేష
మునశుద్ధియగు ఇకద్రావిడపక్షమున తలిదండ్రులయొక్క మరణము
సంచయనమునకు లోగడ వినబడినచో దశాహశేషమున శుద్ధియగు.
ఆసంచయనమునకు పిదప వినినచో నావినిన దినము మొదలు దశరా
త్రాశౌచము. ఈతలిదండ్రులవిషయమున పుత్రునకు చెప్పబడిన దశ
రాత్రాశౌచమే భార్యాభర్తలును సవతులును పరస్పరమాచరింప
దగును. ద్రావిడులు సంవత్సరమునకు పిమ్మటనే కృతక్రియులగు తలి
దండ్రులవిషయమున పుత్రునకు త్రిరాత్రాశౌచమనిరి. అందును కనిష్ఠు
నకు త్రిరాత్రము జ్యేష్ఠునకు దశరాత్రమని కొందరనిరి. ఇందు సవతి
భార్యాభర్తలు తలిదండ్రులు కాక మిగిలినవారు ముప్పదియోజనముల
దూరముననున్నచో వారివిషయమున స్నానమాత్రమేయగును. వీరి
యొక్క మరణము దశాహమునకు లోగడ వినబడినచో దశాహశేష
మునశుద్ధియగు. ఈపూర్వము చెప్పబడినవారలకేనిమిత్తముచేతనైనను
పునర్దహనము చేయబడినచో అనేకసంవత్సరములు గడచినను మరణ

దశాహమునందాశౌచము నవలంబింపని జ్ఞాతులకు త్రిరాత్రాశౌచము సంవత్సరమునకు పిమ్మట నేకరాత్రమేనని కొందరనిరి. పూర్వమాశౌచమునవలంబించినవారలకు పునర్దహనమున తిరిగి యాశౌచములేదు. పూర్వము తిలోదకము నివ్వనిచో నాతిలోదకమునిచ్చుటకొరకొక దినమాశౌచముగలుగు. కర్తపూర్వమాశౌచమునవలంబించినను పునర్దహనసమయమున తిరిగి త్రిరాత్రాశౌచము నవలంబింపవలయు కర్తపుత్రుడేయైనచో నాతడు పూర్వమాశౌచము నవలంబింపకున్నచో దశరాత్రము అవలంబించియున్నచో త్రిరాత్రము. అస్థిదహనము జేసినచో దశరాత్రము. ఎప్పుడు బాధకవశమున కాలాన్తరమునందుపునర్దహనము చేయబడునో అప్పుడాయాబంధువులు తమతమయాశౌచమునవలంబించి దర్భస్తంభమునందుదకదానము చేయదగును. దశాహమునకుపిమ్మట వినబడినచో చేయనవసరములేదు. దశాహమునకు పిమ్మట వినిన జ్ఞాతులు పునర్దహనసమయమునందుదకదానాదికము చేయదగు. దశాహమధ్యమున వినినచో చేయదగును. వీరికి పునర్దహనసమయమునందేమియులేదు. అపుడు కర్తకుమాత్రము త్రిరాత్రాశౌచము ఇదిచాలకాలమతిక్రమించినను కలుగును. సంవత్సరమునకుపిమ్మట కర్తకుగూడ నేకరాత్రమేనని కొందరనిరి. దశాహమధ్యమున పునర్దహనమగుచో పుత్రులకును జ్ఞాతులకును దశాహశేషముననే శుద్ధియగు. ఆహితాగ్నివిషయమున పుత్రులకును జ్ఞాతులకును సంస్కారమునకు పూర్వమాశౌచమేలేదు దహనము మొదలుకొనియే దశరాత్రమాశౌచము. ఇది అస్థిదహనమునందును పాలాశవిధియందును సమానమేయగు. అనాహితాగ్నివిషయమున అస్థిదహనము చేసినచో నందరకును దశరాత్రమేయగు. పాలాశవిధియైనచో త్రిరాత్రము. సపిండులు కాని మేనమామ మొదలగువారికి ఆహితాగ్నియగువానివిషయమున దహనము మొదలుకొని తమయాశౌచకాలమతిక్రమించిన పిదప శుద్ధియగు. అనాహితాగ్నివిషయమున మరణదినముమొదలుకొని తమ యాశౌచకాలమతిక్రమించినపిదప శుద్ధియగు. దుర్మరణమునొందిన ఆహితాగ్ని విషయమునగాని అనాహితాగ్ని విషయమునగాని పునర్దహనమునకు

పూర్వము వారిపుత్రులకుగాని జ్ఞాతులకుగాని ఆశౌచములేదు. ఇకనేమన పునర్దహనము మొదలుకొనియే యాశౌచము అబుద్ధిపూర్వకమగు దుర్మరణమున మరణము మొదలుకొనియేయాశౌచము సంస్కారముఁగూడ తత్కాలమునందే చేయదగును. ఇది అతిక్రాన్తాశౌచ నిర్ణయము.

—♦ సంపాతాశౌచము ♦—

శ్లో॥ అనేకాశౌచసంపాతే బాధ్యబాధకతాభవేత్ ।
యుగపత్సన్నిపాతేతు తంత్రమేవవిధీయతే॥

తా॥ ఒక యాశౌచమునను వర్తించుచున్న సమయమున మరియొక యాశౌచనిమిత్తము ప్రాప్తించినపుడు చెప్పబోవు విధమున బాధ్యబాధకభావము అనఁగా నొకదానిచేనొకటి బాధింపబడుటయగుచున్నది. ఒకదినముననే అనేకయాశౌచములు తటస్థించినచో అన్నిటికొకపర్యాయమే తంత్రమున శుద్ధియగును. అనగా దశరాత్రమవలంబింపదగిన యాశౌచములు రెండు ఒకదినముననే తటస్థించినచో పదిదినములాశౌచము నవలంబించినచాలును రెండవయాశౌచమును మరియొక పదిదినములాచరింపనవసరములేదు. మొదటి పదిదినములయందే రెండును ఆచరింపబడినట్లగును ఇది తంత్రపక్షము ఇక బాధ్యబాధకపక్షమున ఈరీతిని రెండును అనుగ్రహింపబడవు ఇకనేమన రెండవ యాశౌచమునకు నివృత్తియు ఒకప్పుడు సంకోచమును అనఁగా తగ్గుదలయు కలుగు.

శ్లో॥ అధికంవాసమంవాపి శావంసూతకబాధకం ॥

తా॥ జననాశౌచముకంటె అధికకాలమవలంబింపదగినట్టిగాని సమానకాలమవలంబింపదగినట్టిగాని శావాశౌచము ఆజననాశౌచమునకుబాధకమగును అనగా శావాశౌచమే పూర్తిగనవలంబింపదగునని యర్థము.

శ్లో॥ శావంతుబాధతేసూతిః స్వయంచేదధికాభవేత్ ॥

తా॥ జననాశౌచము అధికకాల మవలంబింప దగినదైనచో శావాశౌచమును బాధించును అనఁగా నివర్తింపజేయును ఒకప్పుడు సంకోచింపజేయును అనియర్థము.

శ్లో॥ సజాతీయాఘసంపాతే త్వధికంబాధతేల్పకం ॥

తా॥ సజాతీయములగు అనఁగా రెండు జననాశౌచములుగాని రెండు శావాశౌచములుగాని ఇట్లే అనేక సజాతీయాశౌచములుగాని యొకకాలమున కలసినచో అందధికకాలాశౌచమల్పకాలాశౌచమును బాధించును

శ్లో॥ సజాతీయాఘయోస్సామ్యే పూర్వముత్తరబాధకం॥

తా॥ సజాతీయులగు ఆశౌచములు రెండును సమానకాలమవలంబింపదగినవైనచో తొలిగాఁప్రాప్తించిన యాశౌచము పిమ్మట ప్రాప్తించిన యాశౌచమును బాధించును.

శ్లో॥ న్యూనమప్యుత్తరాశౌచం కాలార్ధాధికకాలకం।
పూర్వమేవోత్తరాశౌచ బాధకంస్యాదితిస్మృతిః ॥

తా॥ తొలిగా ప్రాప్తించినయాశౌచము తక్కువదినములుగలదైనను పిమ్మటప్రాప్తించిన యాశౌచముయొక్క దినములలో సగమునకు మించిన దినములు గలదైనచో దానికిబాధకమగు అదియెట్లన ఏడవమాసమున ప్రసవించుటవలనగలిగిన సప్తరాత్రాశౌచము నవలంబించుచుండ నాయాశౌచమధ్యకాలమున నింకొకదశరాత్రాశౌచము ప్రాప్తించినచో తొలిగాఁప్రాప్తించిన సప్తరాత్రాశౌచము ఈదశరాత్రములో సగమగు పంచరాత్రిముకంటె అధికసంఖ్యగలదగుటచే నాదశరాత్రాశౌచమునుబాధించును.

శ్లో॥ దశాహాన్తర్మృతేబాలే పితోర్భ్రాతుశ్చతత్రతు।
తచ్ఛేషేణైవశావస్య నివృత్తిరభిధీయతే ॥

తా॥ జనించిన శిశువు జననదశాహామునకులోఁగడ మృతినొందినచో తలిదండ్రులకును సోదరులకును దశాహశేషముననే శిశుమరణాశౌచము నివర్తించు అంతియకాని దశాహామధ్యమున నివర్తింపదు. దశాహామునకు పిమ్మటయనువర్తింపదు.

శ్లో॥ పూర్ణాశౌచేరాత్రిశేషే పూర్ణాశౌచాంతరంవిశేత్ ।
పూర్వాదూర్ధ్వంద్విరాత్రంస్యా ద్యామశేషేత్రిరాత్రకం ॥

తా॥ తొలిగా ప్రాప్తించిన పూర్ణాశౌచము ఒక యహోరాత్రము శేషించియుండ మరియొక పూర్ణాశౌచము ప్రాప్తించినచో నపుడు వెనుకటి యాశౌచము నివర్తించినపిదప రెండవ యాశౌచము రెండుదినములాచరింపదగు. వెనుకటి యాశౌచము ఒకయామము మాత్రము శేషించియుండగా అనగా పదవ దినమున ఎనిమిదవ జాము ప్రారంభము మొదలుకొని సూర్యోదయమగులోగా మరియొక పూర్ణాశౌచము ప్రాప్తించినచో పూర్వాశౌచమనుష్ఠించిన పిదప పిమ్మటియాశౌచమును త్రిరాత్రమనుష్ఠింపవలయును. త్రిరాత్రాద్యాశౌచములయందీవిధిలేదు. పూర్వాశౌచముననే శుద్ధియగు కాన దశరాత్రాశౌచమొకరాత్రి శేషించియుండ త్రిరాత్రాద్యాశౌచములు సంభవించినచో వానికి నివృత్తియేకాని దినద్వయాధికమక్కరలేదు.

శ్లో॥ శావంమృతస్యపుత్రాణాం దాహకస్యచనాన్యతః।
నివర్తతేతథాన్యస్మాత్పిత్రోర్నాపైతిసూతకం॥

తా॥ మృతుడగువాని పుత్రులకును మృతశవమును దహించినవానికినిగల్గు శావాశౌచము, పూర్వాశౌచమువలనగాని పిమ్మటగల్గు ఆశౌచమునగాని ఇంకను మరియేయాశౌచమువలనగాని నివర్తింపదు. పుత్రుడు జనించినపుడు తలిదండ్రులకు జననాశౌచము ఆజననాశౌచమధ్యకాలమున ప్రాప్తించినట్టిగాని అంతకుముందుపక్రమింపబడినట్టిగాని జననాశౌచమువలనగాని మరణాశౌచమువలనగాని నివర్తింపదు. సంకోచమునుగూడ పొందదని తెలియదగు.

శ్లో॥ పిత్రోరాశౌచమాఖ్యాత మన్యాశౌచస్యబాధకం ॥

తా॥ తలిదండ్రులయాశౌచమువలన తదితరాశౌచమునివర్తించు ఒకప్పుడు సంకోచమునుగూడపొందును.

శ్లో॥ పితురాశౌచమధ్యేతు మాతాయదిమృతాభవేత్ ।
పితాశౌచంసమాప్యాథ మాత్రాశౌచంతుపక్షిణీం॥

తా॥ తండ్రియొక్క దశాహమధ్యకాలమున తల్లి మృతినొందినచో తండ్రియొక్క దశాహాశౌచమును సమాప్తినొందించి పిమ్మట తల్లియొక్క ఆశౌచమును పక్షిణి యవలంబింపవలయు.

శ్లో॥ పతివ్రతాతుయానారీ భర్తారమనుగచ్ఛతి ।
దినాన్తరేమృతావాపి పక్షిణీనభవేత్తదా ॥

తా॥ పతివ్రతయగుస్త్రీ భర్తననుగమించి భర్త మృతినొందిన దినమునగాక మరియొకదినమున మృతినొందినను నామె విషయమున పుత్రులకు పక్షిణ్యాశౌచమక్కరలేదు.

శ్లో॥ మాతురాశౌచమధ్యేతు పితాయదిమృతోభవేత్ ।
పితుఃప్రయాణాదారభ్య పుత్రాణాందశరాత్రకం ॥

తా॥ తల్లియొక్క ఆశౌచము నవలంబించుచుండగా నాయాశౌచమధ్యకాలమున తండ్రి మృతినొందినచో తండ్రి మృతినొందినది మొదలుకొని పుత్రులకు దశాహము పూర్ణాశౌచమేయగును.

శ్లో॥ మాతుర్దేశాన్తరమృతిః పిత్రాశౌచేశ్రుతాయది।
కృతక్రియాయామాశౌచం పితాశౌచేనశుద్ధ్యతి॥
అకృతాయాంక్రియాయాంతు పూర్వవత్పక్షిణీభవేత్ ॥

తా॥ తండ్రియొక్క ఆశౌచమధ్యకాలమున దేశాన్తరమునందున్నతల్లియొక్క మరణవార్తవినబడినచో తల్లి కృతక్రియయగుపక్షమున తల్లి యాశౌచము తండ్రియాశౌచమున నివర్తించు అకృతక్రియయగు పక్షమున తండ్రిశౌచమును సమాప్తినొందించి పిమ్మట తల్లియాశౌచమును పక్షిణియవలంబింపవలయు.

శ్లో॥ పితుర్దేశాన్తరమృతి ర్మాత్రాశౌచేశ్రుతాయది ।
శ్రవణాదిదశాహాంత మాశౌచంతువిధీయతే ॥

తా॥ తల్లియొక్క ఆశౌచమధ్యకాలమున దేశాన్తరగతుడగు తండ్రియొక్క మరణమువినబడినచో నావినినది మొదలుకొని పదిదినములు తండ్రియొక్క ఆశౌచమునవలంబింపవలయును.

శ్లో॥ మాతాపిత్రోస్తుమరణే తనయైర్యుగపచ్ఛ్రుతే ।
తయోర్యుగపదాశౌచం కుర్యాదితివినిశ్చయః ॥

తా॥ తలిదండ్రులయొక్క మరణములొక్క కాలమున పుత్రులచే వినబడినచో రెండాశౌచముల నొకపర్యాయమే యుపక్రమించి యొకపర్యాయమే సమాప్తినొందింపదగును.

శ్లో॥ అంతర్దశాహేస్యాతాంచే త్పునర్మరణజన్మనీ।
తావత్స్యాదశుచిర్విప్రో యావత్తత్స్యాదనిర్దశం।

తా॥ ఒక యాశౌచము నవలంబించియుండ దశాహమునకు లోగడ మరియొక మరణముగాని జననముగాని సంభవించినచో నా మొదటి దశాహాశౌచమతిక్రమించువఱకుమాత్రమే యాశౌచము అని మనువుపలికె.

శ్లో॥ అంతరాజన్మమరణే శేషాహోభిర్విశుధ్యతి।

తా॥ ఆశౌచమధ్యకాలమున జననాశౌచముగాని మరణాశౌచముగాని సంభవించినచో మొదటి యాశౌచముయొక్క శేషించిన దినములచే శుద్ధియగునని యాజ్ఞవల్క్యుడుపల్కె. ఈ వచనములకు సమానకాలములగు సజాతీయాశౌచములు అనేకములు ఒకకాలమున సంభవించినచో మొదటి యాశౌచమున శుద్ధియనిభావము.

సూ॥ జననాశౌచమధ్యేయద్యపరంజననంస్యాత్తత్రపూర్వాశౌచవ్యపగమేశుద్ధిః॥

తా॥ ఒక జననాశౌచము నవలంబించియుండ నాయాశౌచమధ్యకాలమున మరియొక జననము సంభవించినచో నపుడు మొదటి యాశౌచమతిక్రమించినతోడనే శుద్ధియగునని విష్ణువచనము.

శ్లో॥ జననేజననంచేత్స్యా న్మరణేమరణంతథా।
పూర్వశేషేణశుద్ధిస్స్యా దుత్తరాశౌచవర్జనం॥

తా॥ జననాశౌచమధ్యకాలమున జననముగాని మరణాశౌచమధ్యకాలమున మరణముగాని సంభవించినచో పూర్వాశౌచశేషమున శుద్ధియగు ఉత్తరాశౌచమును వర్జింపదగునని యముడుపల్కె.

శ్లో॥ సమానాశౌచసంపాతే ప్రథమేనసమాపయేత్॥

తా॥ సమానకాలము గల్గినట్టియు సజాతీయములైనట్టియు ఆశౌచములనేకములు కలసినపుడు ప్రథమాశౌచముచే సమాప్తినొందింపవలయునని శంఖుడు పలికెను ఇక విజాతీయాశౌచములు కలసినపుడు,

శ్లో॥ మృతజాతకయోర్యోగే యాశుద్ధిస్సాతుకథ్యతే ।
మృతేనశుధ్యతేజాతం నమృతంజాతకేనతు ॥

తా॥ మృతాశౌచ జాతాశౌచములు కలసినపుడు శుద్ధియెట్లన మృతాశౌచమధ్యకాలమున జాతాశౌచము సంభవించినచో మృతాశౌచాంతమున జాతాశౌచమునకుగూడ శుద్ధిగల్గు కాని జాతాశౌచ మధ్యకాలమున మృతాశౌచము సంభవించినచో నాజాతాశౌచాంతమున మృతాశౌచశుద్ధికలుగనేరదు అని చతుర్వింశతిమతము

శ్లో॥ శావాశౌచేసముత్పన్నే సూతకంతుయదాభవేత్ ।
శావేనశుధ్యతేసూతి ర్నసూతిశ్శావశోధనీ॥

తా॥ శావాశౌచ మధ్యకాలమున జాతాశౌచము సంభవించినచో శావాశౌచాన్తమున జాతాశౌచమునకుగూడ శుద్ధిగల్గు ఇట్లు జాతాశౌచము మృతాశౌచశుద్ధిని గల్గింపజాలదని షట్త్రింశన్మతము.

శ్లో॥ సూతకేమృతకంచేత్స్యా న్మృతకేత్వపిసూతకం।
తత్రాధికృత్యమృతకం శౌచంకుర్యాన్నసూతకం॥

తా॥ సూతకమున మృతకముగాని మృతకమున సూతకముగాని సంభవించినచో నందు మృతకమునుబట్టియే శుద్ధినినిర్ణయింపదగును గాని సూతకమునుబట్టి నిర్ణయింపదగదు అని యంగిరసుడుపలికె ఇది జాతాశౌచముతోసమమగునట్టిగాని అధికమగునట్టిగాని మృతకముకలసినప్పటివిషయము సజాతీయములగు అల్పాశౌచమును అధికాశౌచమును కలసినప్పుడు,

శ్లో॥ అఘవృద్ధిమదాశౌచం పశ్చిమేనసమాపయేత్ ।
యథాత్రిరాత్రేప్రక్రాన్తే దశాహంప్రవిశేద్యది ॥
ఆశౌచంపునరాగచ్ఛే త్తత్సమాప్యవిశుద్ధ్యతి॥

తా॥ ఎక్కువ దినములవలంబింపదగిన యాశౌచమును ఉక్తదినాన్తముననే సమాప్తినొందింపవలయు అనఁగా త్రిరాత్రాశౌచము నవలంబించుచుండగా దశరాత్రాశౌచము సంభవించెనేని దశరాత్రాశౌచాంతమున శుద్ధియనిభావము ఇది యమవచనము మరియు.

శ్లో॥ అల్పాశౌచస్యమధ్యేతు దీర్ఘాశౌచంభవేద్యది।
నపూర్వేణవిశుద్ధిస్స్యా త్స్వకాలేనైవశుద్ధ్యతి ॥

తా॥ అల్పాశౌచమధ్యకాలమున దీర్ఘాశౌచముసంభవించినచో మొదటి యాశౌచముయొక్క అంతకాలమున శుద్ధికానేరదు. రెండవ యాశౌచముయొక్క అంతకాలమున శుద్ధియగునని శుక్రునివచనము.

శ్లో॥ సమానాశౌచసంపాతే ప్రథమేనసమాపయేత్ ।
అసమానంద్వితీయేన ధర్మరాజవచోయథా ॥

తా॥ సమానములగు రెండాశౌచములు కలసినపుడు మొదటి యాశౌచముయొక్క అంతముననే శుద్ధిగల్గును. అందు మొదటి యాశౌచముతో రెండవయాశౌచము సమానముకానిచో అనఁగా అధికమైనదగుచో రెండవయాశౌచముయొక్క అంతమున శుద్ధియని శంఖవచనము.

శ్లో॥ శావాంతశ్శావఆయాతే పూర్వాశౌచేనశుద్ధ్యతి।
గురుణాలఘుశుద్ధ్యేత్తు లఘునానైవగుర్వితి ॥

తా॥ శావాశౌచ మధ్యకాలమున శావాశౌచము ప్రాప్తించినచో మొదటి యాశౌచముననే శుద్ధిగల్గు. కొద్దియాశౌచము గొప్ప యాశౌచమున శుద్ధినొందు కాని గొప్పయాశౌచము కొద్దియాశౌచమున శుద్ధినొందదని హారీతుడు పలికె విజాతీయాశౌచములు కలసినపుడు తనతోసమానమగునట్టిగానిఅధికమగునట్టిగానిమృతాశౌచమున జాతాశౌచమునకు శుద్ధిగల్గు తక్కువదగు మృతాశౌచమున ఎక్కువదగు జాతమునకుశుద్ధికలుగదు.

శ్లో॥ ఆశౌచసన్నిపాతేతు సమయోర్మృతజాతయోః।
నజాతకేనశుద్ధిస్స్యా న్మృతకేనవిశుద్ధ్యతి ॥

తా॥ సమానములగు మృతజాతాశౌచములు కలసినపుడు జాతమున మృతమునకు శుద్ధికలుగదు. మృతమున జాతమునకు శుద్ధి కలుగునని హారీతునివచనము ఇచ్చటసమానములగు మృతజాతములలో మృతము ప్రబలమని చెప్పుటచే జాతముకంటె అధికమగు మృతము

ప్రబలమను విషయము కైముతికన్యాయసిద్ధము కాన సమానమగు నట్టిగాని అధికమగునట్టిగాని మృతము జాతముకంటె ప్రబలము తక్కువదగు మృతము ఎక్కువదగు జాతముకంటె ప్రబలము కానేరదు ఇట్లే కొన్ని నిబంధములయందు ప్రబలత్వదుర్బలత్వములయొక్క విభాగముచేయబడినది మరికొన్ని నిబంధములయందు తక్కువదగు శావమైనను ఎక్కువదగు జాతముకంటె ప్రబలమని చెప్పబడె. సజాతీయములైన యాశౌచములకు గురుత్వ లఘుత్వములు అనఁగానెక్కువతక్కువలు ఆయాయాశౌచకాలముల హెచ్చుతగ్గులననుసరించికలుగు. విజాతీయములకు స్వరూపమును బట్టియేకల్గు అనఁగా కాలపరిమాణముయొక్క తారతమ్యమక్కరలేదు స్వతస్సిద్ధముగనే ప్రాబల్యదౌర్బల్యములు కల్గియుండును అదియెట్లన.

శ్లో॥ మరణోత్పత్తియోగేతు గరీయామరణంభవేత్ ॥

తా॥ జాతమునకును మృతమునకును సంబంధము కల్గినపుడు మృతాశౌచమేప్రబలమగునను హారీతవచనమున కాలపరిమాణమును గ్రహింపకపోవుటచే మృతాశౌచము జాతాశౌచముకంటె స్వతస్సిద్ధముగనే ప్రబలమనితోచుచున్నది ఇఁకను కొన్ని వచనములయందిట్లే మృతాశౌచమునకు ప్రాబల్యము తెలియబడుచున్నది అదియెట్లన.

శ్లో॥ జాతాశౌచస్యమధ్యేతు స్యాన్మేవాతత్సమేపివా ।
జాతావాచాన్నశుద్ధిస్స్యాన్మృతకేనైవశుద్ధ్యతి॥

తా॥ జాతాశౌచమధ్యకాలమున నీజాతాశౌచముకంటె అల్పమగునట్టిగాని సమమగునట్టిగాని మృతాశౌచము సంభవించినచో జాతాశౌచమున శుద్ధికానేరదు. మృతాశౌచముననే శుద్ధియగునని మత్స్యపురాణవచనము మరియు,

శ్లో॥ దశాహమ్మృతమధ్యేతు దశాహంజాతకంభవేత్ ।
త్రిరాత్రమ్మృతమధ్యేతు దశాహంజాతకంతువా ॥
మృతాశౌచేనశుద్ధిస్స్యాదిత్యాహభగవాన్యమః।
స్వల్పకాలేమృతాశౌచే దీర్ఘంవాజాతకంభవేత్ ॥
స్వల్పకాలేనశుద్ధిస్స్యాన్నదీర్ఘేణవిశుద్ధ్యతి ॥

తా॥ దశాహమృతాశౌచమధ్యకాలమున దశాహజాతాశౌచముగాని త్రిరాత్రిమృతాశౌచమధ్యకాలమున దశరాత్రిజాతాశౌచముగాని సంభవించినపుడు త్రిరాత్రిమైనట్టిగాని దశరాత్రిమైనట్టిగాని మృతాశౌచముననే శుద్ధిగల్గునని యముఁడుపల్కె. స్వల్పకాలమగు మృతాశౌచమున దీర్ఘకాలమగు జాతాశౌచము సంభవించినను మృతాశౌచముయొక్క స్వల్పకాలముననే శుద్ధియగు. దీర్ఘకాలముతో పనిలేదని సంగ్రహకారుఁడుపలికెకాన ఆచారమువనుసరించి యాచరింపఁదగును. కొందరు ముందుగా సంభవించిన అల్పాశౌచము పిమ్మట సంభవించిన అధికాశౌచముయొక్క సగముకాలముకంటె మించిన కాలము గలదైనచో మొదటియాశౌచముననే శుద్ధియనిరి.

శ్లో॥ పరతఃపరతోశుద్ధి రఘవృద్ధావిధీయతే ।
స్యాచ్చేత్పంచతమాదహ్నః పూర్వేణాపివిశుద్ధ్యతి ॥

తా॥ పూర్వము సంభవించిన యాశౌచముకంటె పిమ్మట సంభవించిన యాశౌచము అధికకాలముగలదైనచో పిమ్మటియాశౌచముననే శుద్ధియగు. ఆపూర్వప్రాప్తమగు అల్పాశౌచము ఐదుదినములకంటె మిగిలిన కాలముగలదైనచో పూర్వాశౌచముననే శుద్ధియగునని దేవలుఁడు పలికెను ఇఁక రాత్రిశేషాదివిషయమున.

సూ॥ రాత్రిశేషేద్వాభ్యాంప్రభాతేత్రిభిః ॥

తా॥ పూర్వాశౌచముయొక్క పదవరాత్రి శేషించియుండ మరియొక యాశౌచము సంభవించినచో నా రెండవయాశౌచమును రెండుదినములాచరింపదగు ప్రభాతమున అనఁగా పదవదినముయొక్క ఎనిమిదవజాము ప్రాప్తించినది మొదలుకొని సూర్యోదయమగులోగా సంభవించినచో మూఁడుదినములాచరింపఁదగునని గౌతమవచము.

సూ॥ అథచేదంతరామియేతజాయేతవా శిష్టైరేవదివసైశ్శుద్ధిరహాశ్శేషేద్వాభ్యాంప్రభాతేత్రిభిః ॥

తా॥ జాతాశౌచముయొక్కగాని మృతాశౌచముయొక్కగాని మధ్యకాలమున మరల జననముగాని మరణముగాని సంభవించినచో మొదటి యాశౌచమున శేషించిన దినములచే శుద్ధియగు. అది పదవదినమున సంభవించినచో రెండుదినములు ఆపదవదినము యొక్క ప్రభాతకాలమున సంభవించినచో మూఁడుదినములును ఆశౌచమనిశంఖలిఖితులు పలికిరి.

సూ॥ రాత్రిశేషేద్వ్యహాచ్ఛుద్ధిర్యామశేషేత్ర్యహాచ్ఛుద్ధిః ॥

తా॥ పూర్వాశౌచమొకరాత్రి శేషించియుండగ మరియొక యాశౌచము సంభవించినచో రెండుదినములును యామము శేషించియుండగా సంభవించినచో మూడుదినములును రెండవయాశౌచము నవలంబింపవలయునని శాతాతపవచనము రాత్రిశేషమున ద్విరాత్రమును యామశేషమున త్రిరాత్రమును విధించుట సంపూర్ణాశౌచ విషయము ఇదియెట్లన.

సూ॥ అథయదిదశరాత్రసన్నిపాతేయదాద్యం । దశరాత్రమానవమాద్దివసాత్ ॥

తా॥ రెండు దశరాత్రాశౌచములు కలసినపుడు మొదటి దశరాత్రాశౌచముచే యనుష్ఠింపదగు. ఈవిషయము తొమ్మిదిదినములలోఁగడ నేయగుననిబోధాయనుఁడుపల్కె. పదవదినముననైనచో ద్విరాత్రము అపరిభాతకాలముననైనచో త్రిరాత్రము విధింపబడుటచే నిట్లుచెప్పఁబడెను.

శ్లో॥ పునఃపాతేదశాహాత్ప్రాక్ పూర్వేణసహాగచ్ఛతి ।
దశమేహ్నిపునఃపాతే ద్వ్యహాత్సతువిశుద్ధ్యతి॥
ప్రభాతేతుత్రిరాత్రేణ దశరాత్రేష్వయంవిధిః॥

తా॥ ఆశౌచదశాహమునకు లోఁగడ మరియొక యాశౌచము సంభవించినచో పూర్వాశౌచమున శుద్ధియగు, ఆరెండవయాశౌచము పదవదినమందు ప్రాప్తించినచో రెండుదినములు, అపరిభాతమున ప్రాప్తించినచో మూఁడుదినములును అవలంబింపదగునని దేవలుఁడు పలకెను. ఇందు "దశరాత్రేషు" అనుటవలన నిది పూర్ణాశౌచవిషయము ఇచ్చట జాతాశౌచముయొక్క పదవదినమున శావాశౌచము సంభవించినను శావాశౌచము యొక్క పదవదినమున జాతాశౌచము సంభవించినను ద్విరాత్రాదికమవలంబింపదగునని కమలాకరుని మతము అదియుక్తముకాదు ఎట్లన దినద్వయాదివిధానము పూర్వమునందే శుద్ధియనువిధికి అపవాదకము కాన పూర్వాశౌచములోడనే శుద్ధియనుమాట యెచ్చట ప్రసక్తికలదో అచ్చటనే యీయపవాదకము ప్రవర్తించి దినద్వయాదికమును విధించును సూతకాశౌచమధ్యకాలమునప్రాప్తించిన శావాశౌచమునకుసూత్యాశౌచమునశుద్ధియేలేదు కాన నిచ్చట నామాటకు ప్రసక్తియేలేదు. సూత్యాశౌచము వెనుకటి శావాశౌచములో నేమాత్రముకలసినను శావాశౌచమున శుద్ధియని చెప్పబడెను ఇక తలిదండ్రులవిషయము

శ్లో॥ మాతర్యగ్రేప్రమీతాయాం అశుద్ధౌమ్రియతేపితా ।
పితుశ్శేషేణశుద్ధిస్స్యాన్మాతుఃకుర్యాత్తుపక్షిణీం ॥

తా॥ తల్లి మృతినొందినపిదప నాయాశౌచమధ్యకాలమున తండ్రిమృతినొందినచో నపుడు వెనుకటి యాశౌచముయొక్క శేషమువ శుద్ధికాసేరదు. తండ్రియొక్క మరణ నిమిత్తకమగు ఆశౌచాంతమున శుద్ధియగును. ఇట్లే తండ్రి ముందు మృతినొందనాయా శౌచమధ్యకాలమున తల్లిమృతినొందినచో తండ్రియొక్క ఆశౌచశేషమున శుద్ధికాదగదు ఇకనేమన తండ్రి యాశౌచమును సమాప్తినొందించి పిమ్మట తల్లియాశౌచమును పక్షిణి యాచరింపవలయు ఈపక్షిణి పదవదినమునరుణోదయమాత్రిమేయగు తండ్రి మృతినొందిన దాదిగా పదవదినమున తల్లి మృతినొందినచో దినద్వయము మొదలగు ఆశౌచవృద్ధియగు

శ్లో॥ దేశాన్తరేకృతేపితోః పుత్రేణప్రేతకర్మణి।
ఏకస్మిన్నేవకాలేతు మరణంశ్రూయతేయది ॥
దూరస్థోప్యాచరేత్పుత్రో హ్యశౌచంతూభయోస్సమం।
కుర్యాదేకాదశాహేతు తయోఃశ్రాద్ధంపృథక్పృథక్॥
పితుర్దశాహమధ్యేతు మరణంశ్రూయతేయది ।
కృతక్రియాయామాతుశ్చే త్పిత్రాశౌచేనశుద్ధ్యతి ॥
అసంస్కృతాయామాతుశ్చే న్మరణంశ్రూయతేయది।
దశాహాత్పైతృకాదూర్ధ్వం మాతృకంపక్షిణీభవేత్॥
మాతుర్దశాహమధ్యేచే న్మరణంశ్రూయతేపితుః।
పితుఃశ్రవణమారభ్య దశాహంసూతకంభవేత్ ॥
ఆశౌచానంతరంకార్యం మాతృకంసకలంతతః।
అవశిష్టంచయత్కించి త్ప్రేతకర్మాథవైపితుః ॥
కుర్యాదాబ్దికవచ్ఛ్రాద్ధ మన్యథాకృతకర్మణః।
పైతృకంసకలంప్రేత కర్మకృత్వాథమాతృకం ॥
ఆశౌచంపక్షిణీంమాతుః కుర్యాత్ప్రేతక్రియాదికం ॥

తా॥ దేశాన్తరమున మృతినొందిన తలిదండ్రులయొక్క కర్మ పుత్రునిచే నాచరింపబడినచో నామరణమును దూరమునందున్న మరియొక పుత్రుడు విని తత్కాలము ననే నారెండాశౌచములను సమానతంత్రముగా నవలంబించి పదిదినములైనపిదప పదునొకండవదినమున వేరువేరుగా వారికి శ్రాద్ధముల జేయవలయును. సమతుమునందు మృతినొందిన తండ్రియొక్క యాశౌచము నవలంబించుచుండగా దశాహమధ్యమున దేశాన్తరమున మృతినొంది కృతక్రియురాలగు తల్లియొక్క మరణము వినబడినచో తండ్రి

యాశౌచముననే శుద్ధుడగు. అకృతకిృియయగు తల్లియొక్క మరణము వినబడినచో తండ్రిసంబంధమగు దశాహాశౌచము నవలంబించినపిదప తల్లిసంబంధమగు ఆశౌచమును పక్షిణి యవలంబింపదగు తల్లియొక్క దశాహామధ్యకాలమున తండ్రియొక్క మరణము వినబడినచో తండ్రి మరణమును వినినదిమొదలు పదిదినములాశౌచము నవలంబింపవలయు ఆయాశౌచానంతరమున తల్లియొక్క కర్మనంతను నెరవేర్పవలయు. పిమ్మట తండ్రియొక్క ప్రేతకర్మనాబ్దికమునువలె నెరవేర్పవలయు లేక తండ్రియొక్క ప్రేతకర్మనంతను నెరవేర్చి పిమ్మట తల్లినిమిత్తమున పక్షిణ్యాశౌచము నవలంబించి తల్లియొక్క ప్రేతకర్మ నాచరింపవలయునని ధర్మప్రవృత్తియందు చెప్పఁబడె.

అతికాంతాశౌచము నవలంబించుచుండగా మధ్యకాలమున సమకాలమగు వర్తమానాశౌచము వినబడినచో కడచనదానకంటె కడచుచున్నది ప్రబలము కాన వర్తమానాశౌచముననే యవలంబింపవలయు. అవలంబించియున్న అతిక్రాంతాశౌచము వర్తమానాశౌచముకంటె నెక్కుడు దినములు కలదైనచో నధిక కాలముగలదియే ప్రబలముకాన అతికాంతాశౌచమే యవలంబింపదగు. దశాహాశౌచము ప్రబలముకాన తలిదండ్రుల విషయమునమాత్రమీరీతితగదు పండ్రెండుసంవత్సరములు గడచినపిదప పరదేశగతునకాచరించెడి సంస్కారము గల్గెడి యాశౌచము నవలంబించుచుండ ప్రత్యక్షమరణము సంభవించినపుడుగూడ నిట్లేఁని తెలియదగు దహనసంస్కారమును జేసినవానివిషయమున దక్షుడొక విశేషమును చెప్పెను.

శ్లో॥ మృతాశౌచనిమిత్తేద్వే మరణందహనంతథా।
జ్ఞాతీనాంమరణాదేవ దహనాద్దాహకస్యతు।
పిత్రాద్యానంతరానేకాన్ దగ్ధ్వాపూర్వాఘతశ్శుచిః ।
పితరౌచేద్దహే త్తత్ర దశాహాచ్ఛుచిరగ్నిదః ॥

తా॥ మృతాశౌచమునకు మరణము దహనము అనునవి రెండును నిమిత్తములగును అందు జ్ఞాతులకు మరణమువలననే శావాశౌచముకల్గును. తదితరుడు దహనము జేసినచో వానికిగూడగల్గు. ప్రథమమున తలిదండ్రులకంటె ఇతరుడగు ఒకానొకనిని దహించి ఆయాశౌచమధ్యకాలమున అట్టి మరికొందరినిదహించియు నాదాహకుడు మొట్టమొదటి యాశౌచముననే శుద్ధుడగును తలిదండ్రుల దహించినచో నదిమొదలు పదిదినములాశౌచ మునవలంబింపవలయును.

శ్లో॥ అంతర్దశాహే చేత్కర్తుః పునః ప్రేతస్య సంస్కృతిః।
తస్య శుద్ధిః పూర్వశేషా దేకోద్దిష్టం యథోదితం॥

తా॥ ఒకనికి దహనసంస్కారము నాచరించిన పిదప పదిదినములలో మరియొకనికి దహనసంస్కారమును జేసినచో నా రెండవదహనాశౌచముగూడ మొదటి దహనాశౌచ కాలముననే నివర్తించునుకాని ఆయాయే కాదశాహముననే వారివారికొనర్పదగిన ఏకోద్దిష్టాది శ్రాద్ధము చేయదగునని నారదుఁడు చెప్పెను.

శ్లో॥ దాహకస్య ద్వయంచేత్స్యాత్కర్తురేక్యే విశేషతః।
పూర్వేణైవ సమాప్త్యైత త్తోయం పిండం ద్వితీయకం॥

తా॥ దాహకుడు తనచే దహనసంస్కారము జేయబడిన యిరువురకును జేయ దగిన ప్రేతకృత్యములకు తానేకర్తయైనచో పూర్వాశౌచాంతముననే రెండవవానికిగూడ ఉదకదానము పిండదానము మొదలగునవి సమాప్తినొందింపవలయునని హారీతుడుపలికె.

శ్లో॥ దాహకంత్వాదశాహే తు శవమన్యం దహేద్యది।
పూర్వేణైవ విశుద్ధిస్స్యాత్పిత్రో స్తద్దివసాద్భవేత్॥

తా॥ ఒకశవమును దహించి తత్సంబంధమగు శావాశౌచము నవలంబించుచున్న వాడు పదిదినములలోగా మరియొకశవమును దహించినచో మొదటి యాశౌచముననే తలిదండ్రులవిషయమునయైనచో నదిమొదలు శుద్ధుడగునని యంగిరసుడుపలికె.

శ్లో॥ పూర్వకర్తా దశాహే తు పితరౌ చేద్దహేత్పునః।
పూర్వేణ న విశుద్ధిస్స్యాత్పునస్తద్దివసాద్భవేత్॥

తా॥ పూర్వమొకశవమును దహించినవాడు పది దినములలోగా తలిదండ్రులను దహించినచో వానికి పూర్వాశౌచమున శుద్ధిలేదు తిరిగి ఆదినము మొదలుకొని పదిదినములాశౌచము నవలంబింపవలయునని సంవర్తుడుపలికె ఇచ్చట దాహకునకతిక్రాంతకాలమగు మాతాపిత్రాశౌచమైనను ప్రత్యక్షాశౌచముకంటె ప్రబలమేనని విశేషము జననమరణాశౌచములొకకాలమున సంభవించినపుడు తలిదండ్రులు జననాశౌచమునే తత్కాలము సమాప్తినొందువరకు నవలంబింపవలయు మరణాశౌచముననాజాతాశౌచము నివర్తింపదు.

సూ॥ జననమరణయోస్సన్నిపాతే జననమేవ మాతాపిత్రోర్దశాహమాశౌచం॥

తా॥ జననమరణాశౌచములొకసారి సంభవించినపుడు జననదినము నారంభించి పదిదినములు తలిదండ్రులు జననాశౌచమునే యవలంబింపదగునని బోధాయనుడుపలికె.

శ్లో॥ మాతాపిత్రోర్మృతౌచైవ జననేప్యౌరసస్యచ।
స్వాశౌచాపగమేనైవ శుద్ధిస్స్యాన్నాన్యకాలతః॥

తా॥ తలిదండ్రులు మృతినొంద తత్సంబంధమగు ఆశౌచము నవలంబించుచుండ తనకౌరసుడు జనించెనేని తత్సంబంధనుగు జననాశౌచము వెనుకటి మృతాశౌచమున నివర్తింపదు జననదినమాదిగా పదిదినములు నవలంబింపదగునని మరియొక స్మృతియందు చెప్పబడె మరియు.

శ్లో॥ పూర్వాశౌచేనయాశుద్ధి స్సూతినాంమృతినాంచసా।
సూతికామగ్నిదంహిత్వా ప్రేతస్యచసుతానపి॥

తా॥ జాతాశౌచముగాని మృతాశౌచముగాని కలిగియున్నవారలకు పిమ్మట మరియొక యాశౌచము సంభవించినచో పూర్వాశౌచముననే శుద్ధియగునది సూతికకును దాహకునకు మృతినొందినవాని పుత్రులకును మాత్రము చెల్లనేరదు తదితరులకు మాత్రము చెల్లునని ప్రాచీనషడశీతియందు చెప్పబడె తండ్రికి పుత్రజననాశౌచము ప్రబలమనుట తాను ప్రేతసంస్కారముచేయనిపక్షముననని తెలియదగుకాన ప్రేతకర్మచేయుచున్నవాని కాశౌచమధ్యకాలమున పుత్రజననమైనను పుత్రజననాశౌచముయొక్క మధ్యకాలమున తనచేసంస్కరింపదగిన బంధువు మృతినొందినను ఆసంస్కర్తకు శావాశౌచమేకాని పుత్రజననాశౌచములేదు మరియు.

శ్లో॥ అంతర్దశాహేజననా త్పశ్చాత్స్యాన్మరణంయది।
ప్రేతముద్దిశ్యకర్తవ్యం పిండదానంయథావిధి॥
ప్రారబ్ధేప్రేతపిండేతు మధ్యేచేజ్జననంభవేత్।
తద్ధైవాశౌచపిండాస్తు శేషాన్దద్యాద్యథావిధి॥

తా॥ పుత్రుడు జనించినపిదప పదిదినములలోగా తాను సంస్కరింపదగిన దేయొకానొకడు మృతినొందినను అప్రేతనుద్దేశించి దశరాత్రాశౌచము నవలంబించుచు పిండదానమును చేయవలయు మరియు ఒకప్రేతను సంస్కరించివానికి పిండములనిచ్చుచుండగా నామధ్యకాలమున పుత్రజననమైనను ప్రేతాశౌచముననే యవలంబించి మిగిలిన ప్రేతపిండముల సమాప్తినొందింపవలయునని శాతాతపుడుపలికె.

శ్లో॥ ఆశౌచేతుసముత్పన్నే పుత్రజన్మయదాభవేత్।
కర్తుస్తాత్కాలికీశుద్ధిః పూర్వాశౌచేనశుద్ధ్యతి॥

తా॥ తాను సంస్కరించిన శవసంబంధమగు ఆశౌచము నవలంబించుచుండగా పుత్రజననమైనచో పూర్వాశౌచముననే పిమ్మటియాశౌచము నివర్తించుననియు జాత కర్మచేయుటకు తత్కాలమునందు మాత్రము శావాశౌచ శుద్ధికల్గుననియు ప్రజాపతి పలికెను.

ఆశ్వలాయనుడు మొదలగువారు శవమును సంస్కరించినవాడుకూడ పుత్రజననా శౌచమునే పదిదినములాచరింపవలయుననిరి కాన ఆచారమునను సరించి నడువవగును. కొందరు "ఆశౌచేవర్తమానేతు" అను శ్లోకమునందు ఆశౌచశబ్దమునకు జాతాశౌచమని యర్థము చెప్పిరి కాని "మాతాపిత్రోర్మృతౌచైవజననేప్యౌరసస్యచ" అను స్మృతివచన మున శావాశౌచముకంటె పుత్రజననాశౌచము ప్రబలమని విస్పష్టముగా చెప్పబడి యున్నదికాన అట్టి యర్థమును వర్ణించుట యనావశ్యకము.

## —♦ సన్నిపాతాశౌచసంగ్రహము. ♦—

సమానములైనట్టియు, అసమానములైనట్టియు, సజాతీయములైనట్టిగాని, విజాతీయ ములైనట్టిగాని రెండాశౌచములొకతూరిసంభవించినచో సమానతంత్రమున రెంటికొకతూ రియేశుద్ధియగు. సమకాలములగు రెండుసజాతీయాశౌచములు ముందువెనుకగాప్రాప్తించి కలసినచో మొదటియాశౌచకాలముననే శుద్ధియగు. అసమకాలములగు రెండాశౌచ ములగు సజాతీయములై కలసినచో ముందటిదికాని వెనుకటిదికాని యేయాశౌచమధిక కాలముగలదియో వాయాశౌచముయొక్క కాలమున శుద్ధియగు. మొదట ప్రాప్తించిన యాశౌచమల్పమైనదైనను పిమ్మట ప్రాప్తించిన యాశౌచముయొక్క సగముకాలము కంటె మించితకాలముగలదైనచో వాయల్పాశౌచముననే శుద్ధియగు. విజాతీయాశౌచ ములు కలసినపుడు సమమైనట్టిగాని అధికమైనట్టిగాని శావాశౌచమున జాతాశౌచము నకు శుద్ధిగల్గు. జాతాశౌచమే యధికకాలముగలదగుచో నాజాతాశౌచముననే శుద్ధి యగు ఒకపూర్ణాశౌచము నవలంబించుచుండ పదవదినమున మరియొక పూర్ణాశౌచము ప్రాప్తించినచో మొదటి యాశౌచమునకు పిమ్మట పిమ్మటియాశౌచమును రెండుదినము లవలంబింపవలయు ఆమరియొక పూర్ణాశౌచము మొదటి యాశౌచముయొక్క పదవ దినమునందలి యెనిమిదవ యామమున సూర్యోదయమగులోగా ప్రాప్తించినచో నా పిమ్మటి యాశౌచము మూడుదినములవలంబింపదగును. తలిదండ్రులయొక్క మరణాశౌ చముతో మరియొక యాశౌచము కలసినపుడు పూర్వము ప్రాప్తించినట్టిగాని పిమ్మట ప్రాప్తించినట్టిగాని తలిదండ్రులయొక్క యాశౌచముననే శుద్ధిగల్గు. దాహకునకు

దహననిమిత్తమున ప్రాప్తించినయాశౌచము మరియొకయాశౌచముతో కలసినపుడుగూడ దహనాశౌచముననే శుద్ధిగల్గును. తలిదండ్రులకు పుత్త్రుడు జనించుటవలన గలిగెడి జాతాశౌచము మరియొక యాశౌచముతో కలసినపుడు పుత్త్రజననాశౌచముననే శుద్ధిగల్గు. పుత్త్రిక జనించినపుడుగూడ నిట్లే తెలియదగును. తండ్రి ప్రేతను సంస్కరించినవాడైనచో పూర్వమైనట్టిగాని పరమైనట్టిగాని ప్రేతాశౌచముననే పుత్త్రజననాశౌచము నివర్తించు. సంస్కరించెడివాడు కానిచో మృతాశౌచముగూడ పుత్త్రజననాశౌచముననే నివర్తించు. కొందరు ప్రేతను సంస్కరించినవానికిగూడ పుత్త్రజననాశౌచమే ప్రబలమనిరి. తండ్రి మరణించినందువలన గలిగిన యాశౌచమధ్యకాలమున తల్లి మృతినొందినచో తండ్రియాశౌచమును పదిదినములవలంబించినపిదప తల్లియాశౌచమును పక్షిణి యవలంబింపవలయును. తండ్రి సన్న్యసించినను దుర్మరణమునొందినను ఇట్లు తల్లి యాశౌచము పక్షిణికారేరదు. ఇకనేమన తల్లి మృతినొందినది మొదలు పూర్ణాశౌచమునే యవలంబింపవలయును. తల్లి మృతినొందుటవలన గల్గిన యాశౌచమధ్యకాలమున తండ్రి మృతినొందినచో తండ్రి మృతినొందినది మొదలుకొని పూర్ణాశౌచము నవలంబింపదగును. అనుగమనము జేసినపక్షమున తల్లి మరియొక దినమున మృతినొందినను తన్నిమిత్తమున దశాహానంతరము పక్షిణ్యాశౌచమునవలంబింపనక్కరలేదు ఇకనేమన తంత్రముననే అనగా తండ్రియాశౌచముననే శుద్ధిగల్గును. అనుగమనము చేయకయే దైవవశమున తండ్రి మృతినొందిన దశాహమునకు లోగడ తల్లి మృతినొందినచో తన్నిమిత్తమున పితృదశాహానంతరము పక్షిణ్యాశౌచము విధింపబడె అదియు పదవదినమునకు పూర్వమేయగు పదవదినము మొదలగువానియందైనచో వెనుక చెప్పబడినరీతిని దినద్వయాద్యాశౌచవృద్ధికలదని తెలియదగు ఈపక్షమున పక్షిణి మధ్యకాలమునగాని దినద్వయమధ్యకాలమునగాని తండ్రి మృతినొందినది మొదలుకొని పదునొకండవదినముననే కర్తకు తాత్కాలికమగు శుద్ధిగల్గును కాన తండ్రినిగూర్చి స్వతంత్రోద్దిష్టమునుచేయదగును తండ్రిసంబంధమగు మరణాశౌచముయొక్క మధ్యకాలమున దేశాంతరమందున్న తల్లియొక్క మరణవార్త వినబడినచో తల్లికృతక్రియయగుచో నీవర్తమానాతిక్రాంతాశౌచములకు రెంటికి సమతంత్రముననే శుద్ధిగల్గును. తల్లియొక్క ప్రేతకర్మ నిర్వర్తింపబడినచో తండ్రియొక్క దశాహమైనపిదప తల్లినిమిత్తమున పక్షిణ్యాశౌచమునవలంబింపవలయును తల్లియొక్క మరణాశౌచము నవలంబించుచుండ మధ్యకాలమున దేశాంతరమృతుడగు తండ్రియొక్క మరణము వినబడినచో నది మొదలుపదిదినములు తండ్రియొక్క యాశౌచము నవలంబింపవలయును దేశాంతరమున మృతులగు తలిదండ్రులయొక్క మరణములు రెండు నొకకాలమున వినబడినచో నారెండాశౌచములకును సమ

తంత్రమున శుద్ధిగల్గును. అతిక్రాన్తాశౌచము వర్తమానాశౌచమును కలసినచో వర్తమానాశౌచముచే నతిక్రాన్తాశౌచమునకు శుద్ధిగల్గును. అతిక్రాన్తాశౌచ మెక్కుడు కాలము గలదగుచో నాయతిక్రాన్తాశౌచముననే వర్తమానాశౌచమునకుశుద్ధిగల్గును. ఇట్లే దాహకునకుగూడ నతిక్రాన్తాశౌచముననే వర్తమానాశౌచము నివర్తించును. ఈవర్తమానాతిక్రాన్తాశౌచములకు రెంటికి నిమిత్తములగు మరణముల రెంటియందును తానే యగ్నిదానమొనర్చినచో వర్తమానాశౌచమే ప్రబలమగును. తలిదండ్రులవిషయమున నీవిధి చెల్లదు వెనుకచెప్పబడినవిధియే చెల్లదగును మరియు ముందుగానొకనికి దహనసంస్కారముజేసి నాయాశౌచమధ్యకాలమున మరికొందరి బంధుగులనొకనిగాని యిద్దరుగాని యనేకులగాని దహించినచో నపుడు మొదటియాశౌచముననే పిమ్మటి యాశౌచములకును తత్సంబంధములగు ప్రేతకృత్యములకును సమాప్తిచేయదగు ఏకోద్దిష్టముమాత్రము ఆయామరణములయొక్క పదునొకండవదినములందుచేయదగును. జ్ఞాతిదహనముజేసినాయాశౌచమధ్యకాలమున తలిదండ్రులదహించినచో నపుడు పూర్వాశౌచమున శుద్ధికలుగనేరదు. ఇక నేమన తలిదండ్రులు దహించినదిమొదలుకొని పూర్ణాశౌచమునే యవలంబింపవలయును ఇదిసన్నిపాతాశౌచనిర్ణయము.

## —♦ గ్రామాశౌచనిర్ణయము. ♦—

శ్లో॥ యావద్గ్రామస్యమధ్యేతు శవం ప్రేతస్యతిష్ఠతి।
గ్రామస్యతావదాశౌచం నిర్హృతేశుద్ధిరిష్యతే ॥

తా॥ ఎంతకాలము గ్రామమధ్యమున ప్రేతశరీరముండునో అంతకాలముగ్రామమునకాశౌచము. ఆప్రేతశరీరము గ్రామమునుండి వెలుపలకు తీసుకపోబడి దహింపబడినపిదప గ్రామమునకు శుద్ధిగల్గును. ఈశ్లోకమునందలి "తు" అనుశబ్దము శవమును వెలుపలకుగొనిపోయి దహించుటయే గ్రామముయొక్క శుద్ధికి కారణమగునుకాని తదితరమగు స్నానాదులక్కరలేదను విశేషమును సూచించుచున్నది.

శ్లో॥ ఏకాదశధనుర్మాత్ర వ్యపేతేపీధికాంతరే।
చతుష్పథవ్యవాయేపి నారాచాన్తరయేతథా ॥
అంతశ్శవనిమిత్తస్తు నదోషఇతిసూరయః॥

తా॥ పదునొకండు ధనుస్సులదూరము వ్యవధానముగల వీధ్యన్తరమునందును నాల్గుత్రోవలుకలసిన ప్రదేశము వ్యవధానముగాగల వీధ్యన్తరమునను బాణపాతము

(వేగముగవిడువబడిన బాణముపోవునంతటిదూరము) వ్యవధానముగల ఏకవీధియందును ఈశవముగ్రామమధ్యమునసుండుట నిమిత్తముగాగల గ్రామాశౌచము లేదు.

శ్లో॥ చతుశ్శతద్విజోపేతే గ్రామేవీథ్యన్తరేతథా।
ఏకాదశధనుర్మాత్రా దర్వాచీనేపినాస్త్యఘం ॥

తా॥ నాల్గువందలమంది బ్రాహ్మణులు నివసించెడి గ్రామమున పదునొకండు ధనుస్సుల వ్యవధానములేని వీథ్యన్తరమునగూడ నీగ్రామాశౌచములేదు

శ్లో॥ స్త్రీశూద్రానాథబాలానాం శవస్తిష్ఠతియత్రతు।
తత్రాశౌచంగృహస్యైవ గ్రామదోషోనవిద్యతే ॥

తా॥ స్త్రీయొక్కయు, శూద్రునియొక్కయు, దిక్కులేనివానియొక్కయు, బాలునియొక్కయు, శవము గ్రామమునందున్నను ఆగృహమునకుమాత్రమే యాశౌచము గాని గ్రామమునకులేదు అనగా నేకవీధియందుగూడ దోషములేదని భావము.

శ్లో॥ వీథ్యన్తరేపితుగ్రామ ఏకవింశతిమందిరే।
బహుదూరవ్యవాయేపి శావాశౌచమితిస్మృతం ॥

తా॥ ఇరువదియొక్క సంఖ్య గల్గినట్టిగాని అంతకు లోబడిన సంఖ్యగల్గినట్టిగాని గృహములుగల గ్రామమున చాలదూరము వ్యవధానమున్నను వీథ్యన్తరమైననుగూడ శవ నిమిత్తకమగు గ్రామాశౌచముకలదు,

శ్లో॥ అగ్నిహోత్రేతుహోతవ్యే శవదోషోనవిద్యతే ॥

తా॥ అగ్నిహోత్రహోమము చేయువలసివచ్చినపుడు శవనిమిత్తకమగు గ్రామా శౌచమేలేదు అనగా వెనుక చెప్పబడిన శవదోషము శ్రౌతకర్మ వ్యతిరిక్తవిషయమని భావము.

శ్లో॥ గ్రామమధ్యగతోయావ చ్ఛవస్తిష్ఠతికస్యచిత్।
గ్రామస్యతావదాశౌచం నిర్గతేశుచితామియాత్ ॥

తా॥ ఏయొకానొకనియొక్కగాని శవము గ్రామమధ్యనుండువరకు గ్రామమున కాశౌచము అదిగ్రామమురొయొక్క వెలుపలకు గొనిపోబడిన పిమ్మట గ్రామమునకు శుద్ధి గల్గును అని వృద్ధమనువుపలికెను.

శ్లో॥ నాద్యాదంతశ్శవేగ్రామే నాధీయ్యాన్నజహోతిచ।
తానివీథ్యన్తరేకుర్యా ద్ధనురేకాదశాన్తరే ॥

తా॥ గ్రామమధ్యను శవమున్నచో నాగ్రామమున పదునొకండు ధనుస్సుల దూరమునకులోగడ భోజనము అధ్యయనము హోమము మొదలగుకర్మల జేయజనదని మనువుచెప్పె.

శ్లో॥ అంతశ్శవోయదాగ్రామః తస్మిన్గ్రామేతదాలయే।
నిత్యనైమిత్తికంకామ్యం నకుర్యాదితిశాసనం।
శృతిస్మృత్యోర్విరోధేతు శృతిరేవబలీయసీ।
తస్మాదంతశ్శవేగ్రామే జుహుయాచ్ఛ్రౌతపావకం॥

తా॥ గ్రామమధ్యను శవమున్నచో నాగ్రామమునగాని ఆయింటగాని నిత్యనైమిత్తిక కామ్యరూపములగు నేకర్మలను నాచరింపజనదని స్మృతిశాసించె శృతిస్మృతులకు విరోధముకల్గినపుడు శృతియే బలవత్తరముకాన గ్రామమధ్యను శవమున్నను శ్రౌతాగ్ని హోత్రిచేయవచ్చును అని మరియొక స్మృతియందు చెప్పబడెను.

శ్లో॥ గ్రామస్థేశవచండాలే శూద్రేవ్యశుచిసన్నిధౌ।
నాధ్యేతవ్యంనభోక్తవ్యం నహోతవ్యంకదాచన॥

తా॥ శవముగాని చండాలుడుగాని గ్రామమందున్నను శూద్రుడు సమీపమునందున్నను అపవిత్రములగు పదార్థములయొక్క సన్నిధానమునను అధ్యయనము భోజనము హోమము మొదలగునవి చేయజనదని సంగ్రహమున చెప్పబడెను మరియు.

శ్లో॥ చతుశ్శతాధికైర్విప్రైః స్సంపూర్ణేగ్రామమధ్యమే।
విశేషంసంప్రవక్ష్యామి జపహోమార్చనంప్రతి॥
అంతశ్శవస్యదోషస్తు నాస్తితత్రసమాచరేత్।
గ్రామేనారాచవిచ్ఛిన్నే కుర్యాద్భిన్నేతథాపథి॥
వీథ్యన్తరేవామృతకే హారేరర్చాంసమాచరేత్।
అనాథానుపనీతానాం శూద్రాణాంచతథాస్త్రియాం॥
అంతశ్శవస్యదోషస్తు గ్రామేదానచలిప్యతే।
మునీనాంచయతీనాంచ పరకాయప్రవేశినాం॥
మరణంయత్రసంభూతం తత్రదోషోనలిప్యతే।
శూద్రాదీనాంతుమరణం సంభవేద్యత్రకుత్రచిత్॥
ఆశౌచంగృహమాత్రస్య గ్రామాశౌచంనవిద్యతే।

ఖటకేపత్తనేచైవ ఖర్వటేరాజధానిషు ॥
క్రమేణవార్చనంకుర్యా త్తత్రదోషోనవిద్యతే ॥

తా॥ నాల్గువందలకుమించిన బ్రాహ్మణులు నివసించుచున్న గ్రామమున జపహోమార్చనములవిషయమున విశేషము చెప్పబడుచున్నది అట్టిగ్రామముయొక్క మధ్యను శవమున్నను గ్రామాశౌచములేదు కాన జపాదులుచేయదగు బాణవేగముఃకుమించిఃదూరమునగాని నాల్గుతోవలుకలసిన తావు వ్యవధానముగా గల్గిఃట్టిగాని వీథ్యన్తరమున విష్ణుపూజాదికము చేయువచ్చును దిక్కులేనివారు ఉపనీతులుకానివారు శూద్రులు స్త్రీలు వీరియొక్క శవము గ్రామముననున్నను గ్రామమునకాశౌచములేదు ఇట్లే మునులు యతులు పరకాయప్రవేశము నాచరించువారు వీరియొక్క మరణమునగూడ గ్రామాశౌచములేదు శూద్రాదులయొక్క మరణమునందు ఆమరణమునొందినగృహమునకే యాశౌచముగాని గ్రామాశౌచములేదు పట్టణము రాజధాని మొదలగువానియందు శవనిమిత్తకమగు దోషములేదు కాన దేవతార్చనము అధ్యయనము మొదలగునవి సమంత్రముగ చేయదగునని స్మృత్యన్తరమున చెప్పబడెను మరియు.

శ్లో॥ సహస్రవిప్రసంకీర్ణే గ్రామేతదధికేపివా ।
ఆలయస్యసమీపేతు త్రింశద్దండాన్తరేమృతే ॥
అర్చనస్నపనాదీని నకుర్యాదపితత్రతు ॥

తా॥ వేయిమంది బ్రాహ్మణులచేనిండియున్న గ్రామమునగాని అంతకు మించిన బ్రాహ్మణులుగలగ్రామమునగాని ఆలయమునకు సమీపమున ముప్పదిదండముల దూరమునకులోగడ మరణము సంభవించినచో అర్చనము అభిషేకము మొదలగునవి చేయజనదనునది యొకానొకపుడు అగంతుకులగు వేయిమంది బ్రాహ్మణులచే నిండియున్న ఇరువదియొక్క గృహములుగల చిన్నగ్రామమువిషయమని తెలియదగు మరియు.

శ్లో॥ ఏకవీధ్యాంసమారూఢే ఏకవింశద్గృహేస్థితే।
త్రింశద్ధనుషిచాధస్యే దైవంపిత్ర్యంచవర్జయేత్ ॥
శూద్రాణాంమరణంస్యాచ్చే ద్గ్రామమధ్యేకథంచన ।
ఆశౌచంగృహమాత్రస్య గ్రామాశౌచంనవిద్యతే॥

తా॥ ఏకవీధియందు శవమున్నను ఇరువదియొక్క గృహములుగల గ్రామమైనచో నాగ్రామమునందెచ్చట శవమున్నను పెద్దగ్రామమైనను ముప్పదిధనుస్సుల ప్రమాణమునకు లోబడినదూరమున శవమున్నపుడును దేవకర్మనుగాని పితృకర్మనుగానిచేయదగదు.

గ్రామమధ్యమున కూమ్రిలు మొదలగువారు మృతినొందినను ఆయాశౌచము మృతినొందిన గృహమునకే గాని గ్రామమునకులేదు అని స్మృత్యంతరమున చెప్పఁబడెను.

శ్లో॥ పూజామధ్యేమృతేతూష్ణీం పూజాశేషంసమాపయేత్ ।
ప్రతిష్ఠాయాంపునఃప్రేతే నిర్హృతే శేషమాచరేత్ ॥

తా॥ దేవుని పూజించుచుండ నామధ్యకాలమున గ్రామమున యొకానొకడు మృతినొందినవాడగుచుండగా పూజాశేషమును అమంత్రకముగా సమాప్తినొందింపదగు ప్రతిష్ఠయందైనచో ఆమృతినొందినవాని శవము గ్రామముయొక్క వెలుపలకు గొనిపోయి దహింపబడిన పిదప ప్రతిష్ఠాశేషమును సమంత్రముగనే సమాప్తినొందింపవలయును.

శ్లో॥ ప్రతిష్ఠాదిషుకాలేషు యస్మిన్గ్రామేమృతిర్భవేత్ ।
శీఘ్రంబహిశ్శవంనీత్వా కర్మశేషంసమాపయేత్ ॥
అగ్రహారేహరేఃపూజా వర్తమానాతుయత్రచ ।
అంతశ్శవోయదిభవే త్తతోనీత్వాతదాబహిః ॥
తచ్ఛవంభస్మసాద్భూత్వా త్తావత్తంత్రేణపూజయేత్ ॥

తా॥ దేవతాప్రతిష్ఠాదులు జరుగుచున్నపుడా గ్రామమున మరణముసంభవించినచో నాశవమును శీఘ్రముగ వెలుపలకు గొనిపోయి కర్మశేషమును పూరింపదగును ఇట్లే యగ్రహారమందైనను విష్ణుపూజ జరుగుచుండ నందు మృతిసంభవించినచో వెంటనే యా శవమును గ్రామము వెలుపలకు గొనిపోయి భస్మముచేయువరకు తంత్రముగ అనగా నమంత్రకముగ పూజింపవలయునని స్మృత్యంతరమున చెప్పబడె ఈ శ్లోకమున "భస్మసాత్" అని యనుటవలన దహనానంతరమే గ్రామాశౌచమునివర్తించుగాని వెలుపలకు గొనిపోయినంతమాత్రమున నివర్తింపదని భావము "నిర్హృతేశుచితామియాత్" అనువచనముగూడ దహనమైనపిదపనే యాశౌచనివృత్తిని ఉపలక్షణముచే బోధించు గృహాశౌచముగూడ నిట్లే దహనమగువరకనువర్తించునని తెలియదగును మరియు.

శ్లో॥ నతావచ్ఛుధ్యతేభూమి ర్యావత్తత్స్యాదనిర్దశం।
నతత్రకర్మకుర్వీత పిత్ర్యదైవాదికంక్వచిత్ ॥

తా॥ ఏప్రదేశమున మృతినొందెనో ఆప్రదేశమునకు మరణదశాహమతిక్రమించువరకు శుద్ధిగలుగనేరదుగాన నచ్చట దేవకర్మనుగాని పితృకర్మమునుగాని చేయదగదను దశాహపర్యన్తము గృహాశౌచవిధానము అగృహమున ప్రేతకర్మచేయుపక్షముననని తెలియదగును.

శ్లో॥ దహనాంతంగృహాశౌచం యత్రపిండోదకక్రియా ।
దశరాత్రమితిజ్ఞేయం ప్రేతస్తత్రైవతిష్ఠతి ॥

తా॥ ఏగృహమున మృతినొందెనో నాగృహమునకు శవదహనముగువరకే యాశౌచము ఓప్రదేశమున నా ప్రేతనుద్దేశించి పిండదానము ఉదకదానము చేయబడునో ఆ ప్రదేశమునకు దశరాత్రాశౌచము అప్రదేశముననే ప్రేతనివసించునని స్మరింపబడెను. గృహమునందు ప్రేతక్రియజేయుటయున ద్రావిడులకు పిండోదకదానమును తదితరులకు పాలచేతను ఉదకముచేతను పూరింపబడిన రెండుఘటముల స్థాపించుటయునని తెలియదగు ఆరెండుఘటములు దశాహపర్యన్తముండును ప్రేత ఆయుదకమున స్నానముజేసి పాలను త్రాగుటక్కై ప్రతిదినము వచ్చుచుండుగాన దశాహపర్యన్తము గృహమునకుగూడ యాశౌచము ఈరెండువిధములగు ప్రేతక్రియను చేయనిపక్షమున గృహమునకాశౌచములేనేలేదు కొందరు గృహయజమానునకాశౌచముగల్గినమాత్రమున వానిసంబంధమున గృహమునకు గూడ యాశౌచముగల్గును.

శ్లో॥ ద్రవ్యాణిసంబంధాదఘా గృహస్స్వశుచీనిచేత్ ॥

తా॥ యజమానుని యాశౌచదినములయందు వానిసంబంధములగు ద్రవ్యములుగూడ నపవిత్రములగునని స్మరింపబడెగాన గృహముగూడ ద్రవ్యమే గాన నిట్లుచెప్పదగుననిరి యజమానునకాశౌచములేనిచో నెవరిమతమునను గృహాశౌచములేదు.

—♦ ఇక గ్రామాశౌచసంగ్రహము. ♦—

తా॥ గ్రామమధ్యనెంతకాలము శవముండునో యంతకాలము గ్రామమునకాశౌచము శవమును గ్రామము వెలుపలకు గొనిపోయి దహించినపిదప గ్రామమునకుశుద్ధిగల్గు గృహమునకుగూడ నిట్లేనని తెలియదగు గృహమున పిండోదకములనిచ్చినను పాలచేతను ఉదకముచేతను పూరింపబడిన రెండుఘటములనుంచినను గృహమునకుదశరాత్రయాశౌచము అవిలేనిచో నేమియులేదు గృహాధిపతికాశౌచముగల్గినచో తత్సంబంధమున గృహమునకు గూడ యాశౌచమేనని కొందరనిరి గృహస్వామికాశౌచములేనిచో నెవరి మతమునను గృహమునకాశౌచములేదు స్త్రీలు శూద్రులు అనాథులు అనుపనీతులు వీరిశవము గ్రామ మధ్యమున్నను గ్రామమునకాశౌచములేదు ఆగృహమునకుమాత్రమే యాశౌచము ఉపనీతుడు మృతినొందినచో ఏశ్రేణి (వీధి)యందుపనీతుడగువాని శవముండునో ఆవీధికి పదునొకండుబారల దూరమునకు లోగడనున్న ప్రదేశముననున్న మరియొక వీధికిగూడ నాయాశౌచమువర్తించు పదునొకండుబారలదూరమునకు మించిన దూరముననున్న వీధ్య

స్తరమునకాశౌచములేదు ఇట్లైె నాల్గుత్రోవలుకలసిన ప్రదేశము వ్యవధానముగా నున్నను బాణవేగము ప్రసరించుదూరముకంటె మించిన దూరమున్నను శవనిమిత్తకమైన యాశౌచము వర్తింపదు. ఏగ్రామమున నాల్గువందలకు మించిన బ్రాహ్మణులు ఆగంతుకులుగాక నిత్యము వసించుచుందురో ఆగ్రామమున పదునొకండుబారలకు లోబడిన దూరమునను్న వీథ్యన్తరమునగూడ శవనిమిత్తకమైన యాశౌచములేదు పత్తనమునందు ఎచ్చట శవమున్నదో అగృహమునకుదక్క తదితరప్రదేశమునకాశౌచములేదు. ఏగ్రామమున ఇరువదియొకటిగాని అంతకులోబడిగాని బ్రాహ్మణగృహములుగలవో ఆగ్రామమున పదునొకండుబారలదూరమునకు లోగడనున్న వీథ్యన్తరమునకుగూడ యాశౌచముగలదు. ఈయాశౌచముపక్రమింపబడని వైశ్వదేవాదులవిషయము వైశ్వదేవాదులనుపక్రమించిన పిదప గ్రామమునందెవడైనను మృతినొందినచో సుఖముగా నా కర్మశేషమును పూరింపదగును అగ్నిహోత్రవిషయమై గ్రామాశౌచములేనేలేదు పూజజేయుచుండ మధ్యకాలమున నెవడైనను మృతినొందినచో మంత్రములనుచ్చరింపక తంత్రమాత్రమున నాపూజాశేషమును పూరింపదగును. దేవతాప్రతిష్ఠ జరుగుచుండ నామధ్యకాలమున నెవడైనను మృతినొందినచో వానిని దహించిన పిదపనే సమంత్రముగ ప్రతిష్ఠాశేషమును సమాప్తినొందింపవలయునుగాని తంత్రమాత్రమున పూరింపదగదు ఇది గ్రామాశౌచనిర్ణయము.

## —♦ సంపర్కాశౌచనిర్ణయము. ♦—

శ్లో॥ శవానుగమనేచైవ శవనిర్హరణేతథా।
ఆతురవ్యాజనేచైవ శవస్యదహనేపిచ॥
బహుప్రకారమాశౌచం తదీయానాంనకించన।
అదృష్టార్థేష్వనాథానాం కృతేష్వేతేషునాస్త్యఘమ్॥

తా॥ సపిండుడుకానివానియొక్క శవముతోగూడ నడచినను సపిండుడుకానివాని శవమును దహించినను సపిండుడుకానివాని మరణమున విలపించువారినూరడించినను సపిండుడుకానివాని శవమును వహించినను పలువిధములుగల యాశౌచము కలుగుచున్నది ఇది యుపలక్షణముకాన అలంకరణాదులు చేసినపుడుగూడ యాశౌచము కలదని తెలియదగును ఈయర్థమంతయు నిర్హరణ శబ్దమువలననే బోధింపబడునని కొందరనిరి ఇది సంపర్కాశౌచమనబడును ఈయాశౌచము వెనుకచెప్పబడిన శవానుగమనము మొదలగు పనులజేసినవానికొకనికేకల్గునుగాని వానిపుత్రులు భార్య మొదలగువారికిలేదు వానిద్రవ్యమునకుగూడలేదు పుణ్యమునుగోరి అనాథలగు ప్రేతలకు దయతో దహనము మొదలగు

వానిని జేసినచో నాశౌచములేదు స్నానమాత్రమున శుద్ధిగలుగును ఇచ్చట "అసాధలు" అనుటవలన అనుపనీతులు మొదలగువారుకూడ గ్రహింపబడుదురు. అందుసవర్ణుని శవము ననుగమించినచో,

శ్లో॥ అనుగమ్యేచ్ఛయా ప్రేతం జ్ఞాతిమజ్ఞాతిమేవవా।
స్నాత్వాసచేలంస్పృష్ట్వాగ్నిం ఘృతంప్రాశ్యవిశుద్ధ్యతి॥

తా॥ జ్ఞాతియొక్కగాని జ్ఞాతికానివానియొక్కగాని శవమును బుద్ధిపూర్వముగ అనుగమించినచో (కూడనడచినచో) సచేలస్నానముజేసి అగ్నిని స్పృశించి ఘృతప్రాశనముజేసి శుద్ధుడగునని పరాశరుడు పలికె కొందరు జ్ఞాతియొక్క శవముననుగమించుట మొదలగునవి విధివిహితములేకాన ఘృతప్రాశనాగ్ని స్పర్శనములక్కరలేదు కాన నీశ్లోకమునందలి జ్ఞాతిశబ్దమునకు మాతామహుడు మొదలగు బంధువనియు అజ్ఞాతిశబ్దమునకు బంధుత్వములేని ఏయొకానొకడైనను అనియునర్థము వర్ణింపదగుననిరి జ్ఞాతిశబ్దమునకు ముఖ్యార్థమునే చెప్పదగునని మరికొందరనిరి వాస్తవముగ విచారించినచో జ్ఞాతిశబ్దమునకు ముఖ్యార్థమును పరిత్యజించుటకు తగుప్రమాణము కనబడదు కాన జ్ఞాతిశవముననుగమించినపుడుగూడ ఘృతప్రాశనాదులవశ్యముచేయదగు మరియు.

శ్లో॥ అనుగమ్యాంభసిస్నాత్వా స్పృష్ట్వాగ్నింఘృతభుక్శుచిః।

తా॥ శవముననుగమించినచో సచేలస్నానముజేసి అగ్నిని స్పృశించి ఘృతప్రాశనముజేసి శుద్ధుడగునని యాజ్ఞవల్క్యుడుపలికె.

శ్లో॥ ప్రేతభూతంద్విజంవిప్రో యోనుగచ్ఛతికామతః।
స్నాత్వాసచేలంస్పృష్ట్వాగ్నిం ఘృతంప్రాశ్యవిశుద్ధ్యతి॥

తా॥ ఏబ్రాహ్మణుడు మృతుడగు బ్రాహ్మణుని శవమును బుద్ధిపూర్వముగననుగమించునో ఆబ్రాహ్మడు సచేలస్నానముజేసి అగ్నిని స్పృశించి ఘృతప్రాశనముజేసి శుద్ధుడగునని కూర్మపురాణమున చెప్పబడెను. ఘృతప్రాశనముజేసిన పిమ్మట తిరిగి స్నానము జేయవలయును ఎట్లన.

శ్లో॥ అనుగమ్యనరంప్రేతం తద్జ్ఞాతీననుసృత్యచ।
స్నాత్వాఘృతంచమక్షిత్వా పునఃస్నానంసమాచరేత్॥

తా॥ మృతినొందినవానిని వానిజ్ఞాతులను అనుగమించినచో స్నానముజేసి ఘృతప్రాశనముజేసి తిరిగి స్నానముజేయవలయునని శుక్రవచనము ప్రాణాయామములగూడ జేయవలయు ఎట్లన.

శ్లో॥ అనుగమ్యశవంబుద్ధ్యా స్నాత్వాస్పృష్ట్వాహుతాశనం।
సర్పిఃప్రాశ్యపునస్స్నాత్వా ప్రాణాయామైర్విశుద్ధ్యతి ॥

తా॥ బుద్ధిపూర్వముగ శవముననుగమించినచో స్నానముజేసి అగ్నిని స్పృశించి ఘృతప్రాశనముజేసి తిరిగి స్నానముజేసి ప్రాణాయామములజేసినచో శుద్ధుడగునని చమక వచనము.

శ్లో॥ ఆర్ద్రవస్త్రంపరిత్యజ్య శుష్కవస్త్రేణమజ్జనం।
శవానుగమనేక్షౌరే పునస్స్నానంవిధీయతే ॥

తా॥ శవముననుగమించినవాడును క్షురకర్మజేయించుకొనినవాడును ప్రథమమున స్నానముజేసి ఆతడివస్త్రమునువిడిచి తిరిగి పొడివస్త్రమును ధరించి స్నానముజేయవలయు నని మరియొక స్మృతియందు చెప్పబడెను పొడివస్త్రములభింపనిచో పదిరెండుమారులు విదల్పబడిన వస్త్రముచే తిరిగి స్నానముజేయవలయు దిక్కులేనివారు మొదలగువారి విషయమున స్మృత్యంతరమునందు,

శ్లో॥ అనాధమనుపేతంచ ప్రేతంకన్యామనువ్రజన్ ।
అనూచానక్రతుశ్రేష్ఠం నప్రాశ్నీయాద్ఘృతంద్విజః ॥

తా॥ దిక్కులేనివానియొక్కయు ఉపనయనముకానివానియొక్కయు కన్యయొక్కయు ఒకగురువునుండి సాంగముగ వేదము నభ్యసించినవానియొక్కయు క్రతువుల నాచరించినవానియొక్కయు శవముతోగూడ నడచినను ఘృతప్రాశనము జేయనక్కర లేదని చెప్పబడె అగ్నిస్పర్శనుగూడ జేయనక్కరలేదు ఎట్లన,

శ్లో॥ మృతంబాలంచవృద్ధాంశ్చా నాథఃవిప్రమనువ్రజన్ ।
ద్విజఃస్నానేనశుద్ధ్యేత ఘృతప్రాశాగ్నినావినా ॥

తా॥ మృతినొందినబాలుని వృద్ధులను దిక్కులేనివానిని బ్రాహ్మణులగు వీరిని బ్రాహ్మణుడనుగమించినపుడు స్నానమాత్రమున ఘృతప్రాశనాగ్ని స్పర్శనములతో నిమిత్తములేకయే శుద్ధుడగునని జాబాలివచనము అగ్నిస్పర్శనము ఘృతప్రాశనము జేయ వలసివచ్చినపుడవలంబింపనిచో,

శ్లో॥ అగ్న్యభావేఘృతాభావే సచేలస్నానమాచరేత్ ।
సవ్యాహృత్యాచగాయత్ర్యా దశకృత్వోభిమంత్రితాః॥
అర్ఘ్యాంజలీరపఃపీత్వా శుద్ధిమాప్నోతివైద్విజః ॥

తా॥ అగ్నిస్పృశము లేనపుడు సచేలస్నానముజేసి వ్యాహృతులతోఁగూడిన గాయత్రీమంత్రముచే పదిపర్యాయములభిమంత్రింపబడిన సగముదోసిలి యుదకమును త్రాగి బ్రాహ్మణుడు శుద్ధుడగునని స్మృత్యంతరమున జెప్పబడెను.

శ్లో॥ ప్రేతస్యపాదయోరగ్రే నగచ్ఛేయుఃకదాచన ।
యస్మాదగ్రేతుగంతౄణాం ఆయుఃక్షీణంపదేపదే ॥
మృతస్యపశ్చాద్గమనే ప్రాయశ్చిత్తంవిధీయతే।
కిల్బిషాదగ్రగమనే నిష్కృతిర్నోపపద్యతే ॥

తా॥ శవమునననుగమించువారు శవముయొక్క పాదములకంటె ముందునడువజనదు. అట్లునడచినచో అడుగడుగునకాయుఃక్షీణమగు వెనుకవిధింపబడిన ప్రాయశ్చిత్తము శవము వెనుక నడిచినపుడేయగు ముందునడచినచో దానికి ప్రాయశ్చిత్తమేలేదు అని స్మృత్యంతరమున విశేషము చెప్పబడెను శవముతోఁగూడ నడిచినవారును శవమును వహించినవారును దాహకునితోఁగూడ గ్రామమున బ్రవేశింపవలయు నెట్లన,

శ్లో॥ ప్రవేశనాదికంకార్యం దాహకేనాపినైవతు ।
వోఢ్రాచైవానుగంత్రాచ పురాస్నానాచ్చయోషితాం॥
అస్నాత్వాచేత్ప్రవేశేద్గ్రామం శ్మశానాత్బుద్ధిపూర్వకం।
త్రిరాత్రేణవిశుద్ధిఃస్యా దమత్యాహ్నితద్ధైవచ ॥

తా॥ శవమును వహించినవారును కూడఁనడచినవారును దహనముజేసినవానితోఁ గూడ నే గ్రామమున బ్రవేశింపదగును మరియు ఈశవమును వహించినవారును శవముతోఁ గూడ నడచినవారును తాము బుద్ధిపూర్వముగ స్నానముజేయక గ్రామమున బ్రవేశించినను ఇంటివద్ద స్త్రీలు స్నానముచేయకపూర్వము గ్రామమున బ్రవేశించినను త్రిరాత్రి శౌచము నవలంబింపవలయు ఇది బుద్ధిపూర్వముగ కానిచో నేకరాత్రిమేయగును అనగా శవమును వహించినవాడును అనుగమించినవాడును స్త్రీలు స్నానముజేసినపిదప తాము కూడ స్నానముచేసి దాహకునితోఁగూడ గ్రామమున బ్రవేశింపవలయు.

సూ॥ అనుగమ్యాన్వాభాష్యాగ్ర్యానగ్నిం స్పృష్ట్వాపునరవగాహ్య
తైస్సహాద్వారంవిశేరన్॥

తా॥ సవర్ణులయొక్క శవమునను గమించినను అమృతినొందినవారిబంధువులదీనవచనములచే నూరడించినను అగ్నిని స్పృశించి తిరిగి స్నానముజేసి ప్రేతము దహించినవారితోఁ గూడ గ్రామమున బ్రవేశింపదగునని వృద్ధవసిష్ఠునిచే జెప్పబడెను ఇచట అగ్నిస్పర్శనము

ఘృతప్రాశమునకుగూడ నుపలక్షణము దహించినవానితోగూడ నమటచే వానికంటె పూర్వము ప్రవేశింపదగదనిభావము శవముననుగమించినచో నాదినమున కర్మాగ్హతలేదు ఎట్లన,

శ్లో॥ మృతముద్దిశ్యయోగచ్ఛేత్ ఘృతప్రాశనమాచరేత్ ।
వర్జయేత్తదహోరాత్రిం జపహోమార్చనాదికం॥

తా॥ ఎవడు శవముతోగూడ నడచి శుద్ధికొఱకు ఘృతప్రాశనముజేయునో వాడు ఆరాత్రింబవలు జపము హోమము పూజనము మొదలగువాని జేయజనదు అని స్మృత్యంతరమున జెప్పబడెను మరియు.

శ్లో॥ శ్మశానమధ్యంగత్వాతు యోనరోమామధార్చయేత్ ।
సప్తజన్మకృతంపుణ్యం తత్క్షణాదేవనశ్యతి ॥
అనుగమ్యనరంప్రేతం ఇచ్ఛయాయస్తుమానవః ।
ఆరాధయితుమిచ్ఛేన్మాం సవ్రజత్యధమాంగతిం ॥
హరణంచతథాకృత్వా మృతకస్యవసుంధరే ।
భుక్త్వాశ్రాద్ధంమహాభాగే మనుజోమామధార్చయేత్ ॥
చటకత్వమనుప్రాప్య తతోగోధావపుర్గతః॥

తా॥ ఓభూదేవీ ఏమనుష్యుడు స్మశానమునకు బోయివచ్చి పిమ్మట నన్ను పూజించునో వాడు క్రిందటి యేడుజన్మలయందుజేసిన పుణ్యము తత్క్షణమునశించు బుద్ధిపూర్వముగ శవముతోగూడ నడచి పిమ్మట యెవడు నన్ను బూజించునో వాడధోగతి నొందును ఎవడు శవమును వహించిన పిమ్మటగాని శ్రాద్ధమునందు భుజించిన పిదపగాని నన్ను బూజించునో వాడు పిమ్మకగాజన్మించి పిదప ఉడుముగా జనించునని విష్ణువుచే భూదేవినిగూర్చి చెప్పబడెనని వరాహపురాణమున జెప్పబడెను మృతుని బంధువులనూరడించినను అదినమున కర్మార్హతలేదు ఎట్లన.

శ్లో॥ మృతస్యబాంధవైస్సార్ధం కృత్వాతుపరిదేవనం ।
వర్జయేత్తదహోరాత్రం దానంశ్రాద్ధాదికర్మచ ॥

తా॥ మృతినొందినవాని బంధువులతోగూడి విలపించినవాడా రాత్రింబవలు దానము శ్రాద్ధము మొదలగుకర్మల వర్జింపదగునని పారస్కరుడుపలికె వరాహపురాణ వచనమున శవానుగమనాదులతో సరిగ శ్రాద్ధభోజనము నుదహరించుటచే ఏప్రకారము శ్రాద్ధభోజనమున హోమాదులు నిషేధింపబడినవో అప్రకారమీ శవానుగమనాదుల

యందుగూడ హోమాదులకు నిషేధమేయనియు శ్రాద్ధభోజనముజేసినపుడువలె నీషన్మర్భమునగూడ సంక్షేపముగ గాయత్రీజపాదికము జేయదగుననియు భావము హీనవర్ణుని శవముతోగూడ నడచిన చో,

శ్లో॥ క్షత్రియంమృతమజ్ఞానా ద్బ్రాహ్మణో యోనుగచ్ఛతి ।
కృత్వాశౌచమహోరాత్రం పంచగవ్యేనశుద్ధ్యతి॥
శవంచవైశ్యమజ్ఞానా ద్బ్రాహ్మణో యోనుగచ్ఛతి ।
కృత్వాశౌచంపక్షిణీంచ ప్రాణాయామాన్షడాచరేత్ ॥
ప్రేతభూతంతుయశ్శూద్ర బ్రాహ్మణోజ్ఞానమన్ద్బలః।
అనుగచ్ఛేన్నీయమానం త్రిరాత్రమశుచిర్భవేత్ ॥
త్రిరాత్రేతుతతశ్ఛిన్నే నదీంగత్వాసముద్రగాం ।
ప్రాణాయామశతంకృత్వా ఘృతంప్రాశ్యవిశుద్ధ్యతి ॥

తా॥ బ్రాహ్మణుడు మూర్ఖతవలన క్షత్రియుని శవమునను గమించినచో నొక రాత్రిబవలాశౌచము నవలంబించి పంచగవ్యప్రాశనముజేసి పరిశుద్ధుడగును ఇట్లే వైశ్యుని శవమునను గమించినచో పక్షిణ్యాశౌచమునవలంబించి ఆఱుప్రాణాయామముల జేయవలయును బ్రాహ్మణుడు మూఢత్వమువలన శూద్రుని శవముతోగూడ నడచినచో మూడు దినములాశౌచము నవలంబించి పిదప సముద్రగామినియగు నదికిబోయి స్నానముజేసి నూరుప్రాణాయామములజేసి ఘృతప్రాశనముజేసి శుద్ధుడగునని వృద్ధపరాశరవచనము మరియు,

సూ॥ ద్విజశ్శూద్రానుగమనంకృత్వా స్రవంతీమాసాద్యగాయత్ర్యష్టసహస్రంజపేత్ ॥

తా॥ బ్రాహ్మణుడు శూద్రుని శవముతోకూడ నడచినచో నదికిబోయి ఎనిమిది వేలు గాయత్రీజపమును చేయవలయునని విష్ణువచనము, కాన నూరుప్రాణాయామముల గాని ఎనిమిదివేల గాయత్రీజపమును గాని జేయదగునని వికల్పము ఈ రెంటిలో నేదియేని చేసిన పిదప ఘృతప్రాశనము చేయక బూర్వము అగ్నిస్పర్శనమును చేయుదగు అబుద్ధిపూర్వముగ తక్కువర్ణముకలవానిశవమునను గమించినచో,

సూ॥ శూద్రప్రేతస్య బ్రాహ్మణో యదృచ్ఛయానుగమనే స్రవంతీమాసాద్యగాయత్రీ సహస్రంజప్త్వాశుధ్యతి క్షత్రియానుగమనేఽర్ధసహస్రంవైశ్యానుగమనేపాదోనం॥

తా॥ ముందునడచుచున్న శవమును తెలిసికొనక మార్గవశమున శవముతోకూడ నడచుట యదృచ్ఛానుగమనమనఁబడును బ్రాహ్మణుడు శూద్రశవముతో యదృచ్ఛానుగమనము జేసినచో నదికిబోయి వేయిపర్యాయములు గాయత్రినిజపించి శుద్ధుడగును ఇట్లె క్షత్రియశవమునను గమించినచో నైదువందలపర్యాయములును వైశ్యునిశవమునను గమించినచో నేడువందలయేబదిపర్యాయములును గాయత్రిజపమునుచేసిన శుద్ధుడగునని యాంగీరసుడు పలికెను కాన నీయదృచ్ఛానుగమనమున నేకరాత్రముపక్షిణి మొదలైన యాశౌచములేదు క్షత్రియుడు వైశ్యుని శవమును బుద్ధిపూర్వముగ ననుగమించినచో నేకరాత్రిము శూద్రుని శవమునను గమించినచో పక్షిణియు వైశ్యుడు శూద్రుని శవమునను గమించినచో పక్షిణియునగు శూద్రుడు శూద్రునిశవమునను గమించి అమృతినొందినవాని బంధువులస్పృశింపనిచో నేకకాలాశౌచము అనగా పగటిలో నీపనిజరిగినచో నాపగలంతయును, రాత్రిజరిగినచో రాత్రియంతయు నాశౌచమగు ప్రేత బంధువుల స్పృశించినచో నేకరాత్రిమని విజ్ఞానేశ్వరుఁడు మొదలగువారనిరి మరియు,

శ్లో॥ సజాతేదినవస్సైనైవ ద్వ్యహాత్ క్షత్రియవైశ్యయోః।
స్పర్శనంవినానుగమనే శూద్రోనక్తేనశుద్ధ్యతి॥

తా॥ శూద్రుడు సజాతీయుని శవమునను గమించినచో నొకదినమున శుద్ధుడగు క్షత్రియవైశ్యులయొక్క శవములననుగమించినచో పక్షిణియగు శూద్రుడు సజాతీయుని శవమును స్పృశింపక కూడనడచినచో నేకరాత్రిమున శుద్ధుడగు ఇచట నుపలక్షణముచే నేకకాలమని యర్థము జెప్పదగు అనగా రాత్రియైనచో త్రిరాత్రిమంతయు పగలైనచో పగలంతయునని యర్థము కాని వాస్తవముగ విచారింపగా క్షత్రియవైశ్యులు శూద్రుని శవమునను గమించినచో రెండుదినములేయాశౌచమనదగు ఎట్లన ద్వ్యహాశబ్దమునకు ముఖ్యార్థమును విడచుటకు ప్రమాణములేదు బ్రాహ్మణుడు క్షత్రియుని శవమునను గమించినచో సచేలస్నానముజేసి పిమ్మట శాస్త్రవిహితమైన యాశౌచము నవలంబించి తిరిగి సచేలస్నానముజేసి అగ్నిస్పర్శనముజేసి ఎనిమిదివందలపర్యాయములు గాయత్రి మంత్రమును జపించి ఘృతప్రాశనముజేసి తిరిగి స్నానముజేసి మూడుపర్యాయములాచమనముజేసి శుద్ధుడగు శూద్రునిశవమునను గమించినచో ఎనిమిదివేలపర్యాయములు గాయత్రి మంత్రమును జపింపవలయుననునదిమాత్రిము విశేషము.

సూ॥ సచేలమవగాహ్యాత్తిర్యాగ్నిముపస్పృశ్య గాయత్ర్యష్టశతం
జపేత్ ఘృతంప్రాశ్యపునస్స్నాత్వాత్రిరాచామేత్ ॥

తా॥ బ్రాహ్మణుడు క్షత్రియుని శవమునను గమించినచో సచేలస్నానమును చేసి అగ్నిని స్పృశించి ఎనిమిదివందలపర్యాయములు గాయత్రిని జపించి ఘృతప్రాశనము జేసి తిరిగి స్నానము జేసి ముమ్మారాచమనీయము చేయదగునని చ్యవనునిచే చెప్పబడె మరియు,

సూ॥ ద్విజశ్శూద్రానుగమనే స్రవంతీమాసాద్య గాయత్ర్యష్టసహ
స్రంజపేత్ ద్విజప్రేతస్యాష్టశతం ॥

తా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ద్విజులనబడుదురు ఈద్విజుడు శూద్రుని శవమునను గమించినచో నదికిబోయి ఎనిమిదివేలమార్లు గాయత్రీమంత్రమును జపింపదగు ద్విజుడు ద్విజునిశవమునే అనుగమించిచో ఎనిమిదివందలపర్యాయములు జపించిన చాలునని విష్ణువచనము ఇచట చ్యవనునిచే జెప్పబడిన ఘృతప్రాశనము వృద్ధపరాశరునిచే జెప్పబడిన పంచగవ్యప్రాశనముతో వికల్పించు అనగా, రెంటిలో నేదియేని చేయదగునని భావము రెండును చేయవలయునని కొందరనిరి వైశ్యునియనుగమించినపుడు గాయత్రీశతము ఆరు ప్రాణాయామములు వైకల్పికములు రెండును చేయవలెనని కొందరనిరి సవర్ణుడగు ఆతురుని ఊరడించినచో,

శ్లో॥ మృతస్యయావదస్థీని బ్రాహ్మణస్యాహృతానితు ।
తావద్యోబాన్ధవ స్తత్ర రౌతితద్బాన్ధవైస్సహ ॥
తత్రస్నానాద్భవేచ్ఛుద్ధి స్తతస్స్వాచమనంస్మృతం ।
సచేలంస్నానమన్యేషా మకృతేత్వస్థిసంచయే ।
కృతేతు కేవలంస్నానం క్షత్రవిట్ఛూద్రజన్మనాం ॥

తా॥ బ్రాహ్మణుడు సంచయనమగుటకులోగా సవర్ణులైన యాతురులనాదరించినచో స్నానమాత్రము చేయదగు సంచయనమునకు పిమ్మటయైనచో నాచమనము మాత్రము చేయదగు క్షత్రియులు మొదలగువారు సంచయనమునకులోగడ సవర్ణులైన యాతురుల నూరడించినచో సచేలస్నానము జేయదగు సంచయనమైన పిమ్మట కేవల స్నానము మాత్రముచేయదగు ఈశ్లోకమున "రౌతి" అనునది ఆతురవ్యంజనమాత్రమునకుపలక్షణము కాన ఏడ్చుట కన్నీరునిడుచుట దీనవచనములపల్కుట మొదలగు ఆతురవ్యంజనములన్నిటి యందును స్నానాదికమే యొనర్చిన చాలునని తెలియదగు ఉత్తమవర్ణముగలవానివిషయ మున ఆతురవ్యంజనమునందు,

శ్లో॥ అస్థిసంచయనాదర్వాగ్రుదిత్వాస్నానమాచరేత్ ।
అంతర్దశాహేవిప్రస్య ఊర్ధ్వమాచమనంస్మృతం॥

తా॥ అస్థిసంచయనమునకుపూర్వము పేతనుగూర్చి రోదనముచేసినచో స్నానము జేయువలయు ఆయస్థిసంచయనమైన పిమ్మట దశాహమునకులోగడ రోదనముజేసినచో ఆచమనము జేయదగునని పారస్కరుడుపలికెను ఈశ్లోకమునకు క్షత్రియులు మొదలగువారు బ్రాహ్మణుని దశాహము లోగడ రోదనము జేసినచోనని స్మృతిసారసర్వము మొదలగు గ్రంథములయందు వ్యాఖ్యానము చేయబడెను ఇచట విప్రశబ్దమునుగ్రహించుట క్షత్రియులు మొదలగువారికుపలక్షణమని అఖండాదర్శము మొదలగు గ్రంథములయందు చెప్పబడెను ఈచెప్పబడిన రెండువిధములచేతను వెనుకచెప్పబడినది ఉత్తమవర్ణవిషయకమైన ఆతురవ్యంజనమేయగు ఇక హీనవర్ణవిషయమైన ఆతురవ్యంజనమునందు.

శ్లో॥ అనస్థిసంచయేవిప్రో రౌతిచేత్ క్షత్రవైశ్యయోః।
నద్యాంస్నాత్వాసచేలంతు ద్వితీయేహనిశుధ్యతి॥
కృతేతుసంచయేవిప్రః స్నానేనైవవిశుధ్యతి॥

తా॥ అస్థిసంచయనమునకు పూర్వము బ్రాహ్మణుడు క్షత్రియునిగూర్చిగాని వైశ్యునిగూర్చిగాని రోదనముజేసినచో నదియందు సచేలస్నానముజేసి మరుసటి దినమున శుద్ధుడగు సంచయనమైనపిదపయగుచో నాబ్రాహ్మణుడు స్నానముననే శుద్ధుడగునని బ్రహ్మపురాణమున జెప్పబడె ఇచట విప్రశబ్దమును గ్రహించుట క్షత్రియునకుపలక్షణము కావున క్షత్రియుడు వైశ్యునివిషయమున రోదనముజేసినపుడుగూడ ఏకరాత్రమని తెలియదగు ఇక శూద్రునివిషయమున రోదనముజేసినచో.

శ్లో॥ అస్థిసంచయనాదర్వాగ్యదివిప్రోశ్రుపాతయేత్।
మృతేశూద్రేగృహంగత్వా త్రిరాత్రేణవిశుధ్యతి॥
అస్థిసంచయనాదూర్ధ్వం మాసోయావద్ద్విజాతయః।
అహోరాత్రేణశుధ్యన్తి వాససాంక్షాలనేనచ॥

తా॥ శూద్రుడు మృతినొందినపుడు బ్రాహ్మణుడాశూద్రుని గృహమునకేగి అస్థిసంచయనముగుటకులోగడ కన్నీరు విడచినచో త్రిరాత్రమున శుద్ధుడగు అస్థిసంచయనమైనపిదప మాసములోగానైనచో ద్విజులు ఒకయహోరాత్రమునను వస్త్రములక్షాలనము జేయుటచే శుద్ధులగుదురు అని పారస్కరుడు పలికెను క్షత్రియవైశ్యులు శూద్రవిషయమున రోదనముజేసినచో ద్విరాత్రము ముందుచెప్పబడుగాన ఇచట విప్రశబ్దము బ్రాహ్మణునిమాత్రము బోధించు ద్విజాతిశబ్దముమాత్రము బ్రాహ్మణక్షత్రియ వైశ్యుల బోధించు కాన సంచయనమునకుపూర్వము బ్రాహ్మణుడు శూద్రునిగూర్చి రోదనము జేసినచో

త్రిరాత్రము ఈస్థితియందు క్షత్రియవైశ్యులకుద్విరాత్రము సంచయనమైపిమ్మట నీముప్పురకు నేకరాత్రిమేయగునని తెలియదగు క్షత్రియవైశ్యశూద్రులు అస్థిసంచయనముగుటకు లోగడ శూద్రునిగూర్చి రోదనముజేసినచో,

శ్లో॥ సజాతేర్దినవస్త్నైవ ద్వ్యహాత్ క్షత్రియవైశ్యయోః ॥

తా॥ శూద్రునివిషయమున రోదనముజేసిన సజాతీయునకు అనగా శూద్రునకు సంచయనమునకు పూర్వమైనచో నొకదినమున శుద్ధిగల్గు క్షత్రియవైశ్యులకు దినద్వయమున శుద్ధిగల్గునని క్రిందట నుదహరించిన పారస్కరవచనమునకు మాధవీయాదులయందు వ్యాఖ్యానము చేయబడెను ఈవచనమనుగమన విషయమని స్మృతిసారసర్వస్వాదులయందు వ్యాఖ్యానము చేయబడెను ఈరెండువిషయములు లభించుటకొరకు రెండు వ్యాఖ్యానములను గ్రహింపదగును మరియు,

శ్లో॥ స్పర్శంవినానుగమనే శూద్రోనక్తేనశుద్ధ్యతి ॥

తా॥ శూద్రునిశవమును వానిబంధువులను స్పృశింపక కూడనడచినచో శూద్రుడొకరాత్రిచే శుద్ధుడగునను ఉత్తరార్ధముతో విరోధముగల్గుగాన నీపారస్కరవచనము ఆతురవ్యంజనవిషయకము కానేరదనదగదు "వినిర్త్యయదాశూద్రాః" అని యుదహరింపబడు వచనమునందువలె అనుగమనశబ్దమునకు సమీపించుట అని యర్థము చెప్పబడు "అస్థిసంచయనాదర్వాక్" అను వెనుకనుదహరింపబడిన పారస్కరుని వచనమునందు "గృహంగత్వా" అనునది వివక్షచేయబడలేదు.

శ్లో॥ శావేశావగృహంగత్వా శ్మశానేనాంతరేపివా।
ఆతురవ్యంజనంకృత్వా దూరస్థోప్యశుచిర్భవేత్ ॥
అస్థిసంచయనాదర్వా గాతురవ్యంజనేకృతే।
దూరస్థోప్యశుచిర్విప్రః పరితస్తుశుచిర్భవేత్ ॥

తా॥ మృతమునందస్థిసంచయనముగులోగా మృతినొందిన గృహమునకుబోయిగాని శ్మశానమధ్యప్రదేశమునగాని మృతప్రదేశమునకు దూరమునందుండి ఆతురవ్యంజనము జేసినను తన్మాత్రమున నాబ్రాహ్మణుడశుచియగు అస్థిసంచయనమైనపిమ్మట నిట్టియాశౌచములేదను దేవలుడు మొదలగువారి వచనములయందు సంచయనమునకుపూర్వము మృతగృహమున బ్రవేశింపకున్నను ఆశౌచము చెప్పబడెను ఆతురవ్యంజనమనగా దుఃఖము అదియేనివలన తెలియబడునో నది యాతురవ్యంజనము అనగా ఏడ్చుట మొదలగునది, బ్రాహ్మణునకు క్షత్రియులు మొదలగువారియందు స్నేహమున్నచో సంచయనమైన పిమ్మట వారి కాదరింపదగు అపుడు స్నానమాత్రము విధింపబడెను శూద్రులవాశౌచాంతమునను యాదరింపదగు ఎట్లన.

శ్లో॥ వినివర్త్యయదాశూద్రా ఉదకాన్తముపస్థితాః ।
ద్విజైస్తదానుగంతవ్యా ఏషధర్మస్సనాతనః ॥

తా॥ ఎపుడు శూద్రులు ఉదకదానమును సమాప్తినొందించియుందురో అపుడు బ్రాహ్మణులచే నూరడింపదగుదురు ఇది సనాతనధర్మము అని బ్రహ్మపురాణవచనము స్నేహాదికమున సపిండుకానివానిశవమును వహించినచో,

శ్లో॥ అసపిండంద్విజంప్రేతం విప్రోనిర్హృత్యబంధువత్ ।
విశుద్ధ్యతిత్రిరాత్రేణ మాతురాప్తాంశ్చబాంధవాన్ ॥
యద్యన్నమత్తితేషాంయ స్సదశాహేనశుద్ధ్యతి ।
అనదన్నన్నమహ్నైవ నచేత్తస్మిన్గృహేవసేత్ ॥

తా॥ మృతినొందిన సపిండుడుకాని బ్రాహ్మణుని బంధువునివలెవహించినను ఇట్లే తల్లియొక్క ఆప్తులవహించినను త్రిరాత్రమున శుద్ధుడగు ఆయాశౌచముగలవారి యన్నమును భుజించినచో దశాహమున శుద్ధుడగు వారియన్నమును భుజింపక వారిగృహమున నివసింపనిచో నొకదినమున శుద్ధుడగునని మనువచనము అనగా నెవడు ప్రేతను వహించి వారిగృహముననే వసించి వారి యన్నమును మాత్రము భుజింపడో వానికి త్రిరాత్రము ఎవడు వానిగృహమున వసించి యన్నమును భుజించునో వానికి దశరాత్రము ఎవడు వానిగృహమున వసింపక వానియన్నమును భుజింపకుండునో వానికేకరాత్రము ఎవడు ప్రేతను గొనిపోయినపిదప గ్రామమునకు వెలుపలనే యుండునో వానికి సజ్యోతిరాశౌచము.

శ్లో॥ యఃప్రమీతమలంకుర్యా ద్వహేద్వాథదహేత్ద్విజం ।
సశుద్ధ్యత్యేకకాలేన కాలశేషంబహిర్వసన్ ॥
గ్రామేవసన్దినాచ్ఛుద్ధ్యేత్ త్ర్యహాత్ప్రేతగృహేవసన్ ॥

తా॥ ఎవడు మృతినొందిన ద్విజుని అలంకరించునో లేక వహించునో లేక దహించునో వాడు గ్రామమునకు వెలుపలనివసించినవాడై యేకకాలమున శుద్ధుడగును అనగా పగలైనచో నాపగటిశేషమునను రాత్రియైనచో నారాత్రిశేషమునను శుద్ధుడగు గ్రామమునవసించినచో నొకదినమునను ప్రేతయొక్క గృహమునవసించినచో దినత్రయమునను శుద్ధుడగునని వృద్ధమనువచనము మరియు.

సూ॥ ప్రేతస్పృశోగ్రామంనప్రవిశేయురానక్షత్రదర్శనాద్రాత్రా
వాదిత్యస్య॥

తా॥ ప్రేతను స్పృశించినవారు పగలైనచో నక్షత్రదర్శనమగువరకును రాత్రియగుచో సూర్యదర్శనమగువరకును గ్రామమున బ్రవేశింపజనదని హారీతుడుపలికెను.

శ్లో॥ అహ్నిచేద్వహనంకుర్యా దూర్ధ్వంమస్తమయాద్రవేః ।
స్నాత్వాగృహంవిశేద్విప్రో రాత్రౌచేదుదయాద్రవేః॥
అసగోత్రమబంధుంచ ప్రేతీభూతంద్విజోత్తమః।
దహిత్వాచవహిత్వాచ ప్రాణాయామేనశుద్ధ్యతి॥

తా॥ బ్రాహ్మణుఁడు సగోత్రుఁడు బంధువు కాని ప్రేతనుదహించుట పగలైనచో అస్తమయమైనపిమ్మటను రాత్రియందైనచో సూర్యోదయమైనపిమ్మటను స్నానముజేసి ప్రాణాయామమున శుద్ధుడగును అని దేవలుడుపలికె ఈస్నానప్రాణాయామములేకాక అగ్నిస్పర్శనముగూడ జేయవలయు.

శ్లో॥ యఃకశ్చిన్నిహరేత్ప్రేత మసపిండంకథంచన ।
స్నాత్వాసచేలంస్పృష్ట్వాగ్నిం తస్మిన్నేవాహ్నివైశుచిః ॥

తా॥ ఎవడైనను సపిండుడుకానివానిని వహించినచో వాడు సచేలస్నానముజేసి అగ్నిని స్పృశించి ఆదినముననే అనగా అస్తమయమైన పిమ్మట శుద్ధుడగునని యంగిరసుడుపలికె అనగా ప్రేతను వహించిన పిదప సచేలస్నానముజేసి పగలైనచో నస్తమయపర్యంతమును రాత్రియైనచో ఉదయమగువరకును గ్రామమునకు వెలుపల నేయుండి పిమ్మట స్నానముజేసి అగ్నిని స్పృశించి ప్రాణాయామముజేసి కృచ్ఛ్రపాదమునకు ప్రతినిధినిజేసి పంచగవ్యప్రాశనముజేసి బ్రాహ్మణుల స్వస్తివచనములగొని శుద్ధుడగును కృచ్ఛ్రపాదాదులవిషయమున స్మృతివచనము ముందుదహరింపబడును అగ్నిస్పర్శనము మొదలుకొని స్వస్తివాచనమువరకునుగల యీకర్మలును గ్రామప్రవేశాదులవలనఁ లిగెడి ఏకరాత్రాద్యాశౌచములయందుగూడ సమానమేయగు కర్తకానివాడు దహనసంస్కారముజేసినపిదప సంచయనము తిలోదకము మొదలగువానిలోనే యొకటినేనిచేయకపూర్వము ముఖ్యకర్తవచ్చినచో వాదాహకునకు వెనుక జెప్పబడినినిమిత్తభేదమునను సరించి సద్యోతిరాశౌచముగాని ఏకరాత్రముగాని త్రిరాత్రముగాని అశౌచముకాదగును అట్లుకానిచో దశరాత్రముకలదని తెలియదగు.

శ్లో॥ అజ్ఞాతించనరందగ్ధ్వా త్రిరాత్రమశుచిర్భవేత్ ।
జ్ఞాతీనాందర్శనాచ్ఛుద్ధి స్సంచితేదశరాత్రకం ॥

తా॥ జ్ఞాతికానివానికి దహనసంస్కారము జేసినచో త్రిరాత్రిమాశౌచముగల్గును సంచయనముకాకపూర్వము ముఖ్యకర్తవచ్చినచో నిట్లు త్రిరాత్రిమున శుద్ధియగు అట్లు కాక తానే సంచయనముజేసినచో దశరాత్రాశౌచము నవలంబింపవలయునని స్మృత్యన్తరమున జెప్పబడె.

శ్లో॥ అసగోత్రస్సగోత్రోవా యదిస్త్రీయదివాపుమాన్।
ప్రథమేఽహనియోదద్యా త్సదశాహంసమాపయేత్ ॥

తా॥ అసగోత్రుడుకాని సగోత్రుడుకాని స్త్రీగాని పురుషుడుకాని మొదటి దినమున నెవడు తిలోదకము నిచ్చునో వాడేపదిదినమును తిలోదకము నివ్వవలయునని వృద్ధమనువుచే జెప్పబడెను మరియు,

శ్లో॥ ఏకోద్దిష్టాన్తఏవస్యా త్సంస్కర్తుశ్శుద్ధతాత్వఘాత్ ॥

తా॥ దహనసంస్కారము జేసిన వానికి ఏకోద్దిష్టాన్తమున శుద్ధిగల్గునని బోధాయనుడు పలికె అనగా సంచయనమునుచేసినను తిలోదకము నారంభించినను దశరాత్రానంతరమున పదునొకండవదినమున తనచేతగాని ముఖ్యకర్తచేతగాని ఏకోద్దిష్టము చేయబడిన పిదప శుద్ధికలుగునని భావము ఈదశరాత్రాశౌచము ముఖ్యకర్త మరియొకడుండ వాని సంబంధము నుచ్చరించి సంస్కరించినపక్షముననని తెలియదగును అట్టి ముఖ్యకర్త లేక దిక్కులేని ప్రేతను సంస్కరించినచో ఆశౌచము స్వల్పమేనని తెలియదగు.

శ్లో॥ అసపిండోయదిదహేత్ ద్వితీయేత్వస్థిసంచయః।
ఏకోద్దిష్టంతృతీయేహ్ని మరణాత్తువిధీయతే॥

తా॥ సపిండుడుకానివాడు దహనముజేసినచో మృతినొందిన మరుసటి దినమున అస్థిసంచయనము మూడవదినమున నేకోద్దిష్టమును జేయదగునని స్మృత్యన్తరమున జెప్పబడె ధనలోభమున ప్రేతనువహించినచో పూర్ణాశౌచము ఎట్లన.

శ్లో॥ యదినిర్హరతేప్రేతం ప్రలోభాక్రాన్తమానసః।
దశాహేనద్విజశ్శుధ్యే ద్ద్వాదశాహేనభూమిపః।
వైశ్యఃపంచదశాహేన శూద్రోమాసేనశుధ్యతి ॥

తా॥ ధనలోభమున ప్రేతను వహించినచో బ్రాహ్మణుడు పదిదినములచేతను క్షత్రియుడు పండ్రెండుదినములచేతను వైశ్యుడు పదునేను దినములచేతను శూద్రుడు మాసముచేతను శుద్ధుడగునని కూర్మపురాణమున జెప్పబడెను ఇది సవర్ణవిషయము అసవర్ణుని శవమును వహించినచో వానిజ్ఞాతులవలె యాశౌచము నవలంబింపవలయు.

సూ॥ అపరశ్చేద్వర్ణః పూర్వం వర్ణముపస్పృశేత్పూర్వో వా పరంత
ఛ్చవోక్తమాశౌచం॥

తా॥ తక్కువ వర్ణముగలవాడెక్కువ వర్ణమునందలి శవమునుగాని ఎక్కువ వర్ణముగలవాడు తక్కువ వర్ణమునందలి శవమునుగాని వహించినచో నాశవముయొక్క జాతికి చెప్పబడిన యాశౌచము నవలంబింపదగు ఇదియు స్నేహాదులచే వహించినపక్షమున నని తెలియదగు.

శ్లో॥ యోఽసవర్ణమమూల్యేన నీత్వాచైవ దహేన్నరః ।
ఆశౌచంతుభవేత్తస్య ప్రేతజాతిసమంసదా ॥

తా॥ ఎవడు సవర్ణుడు కానివానిని ధనము గైకొనక వహించి దహించునో వానికి ప్రేతయొక్క జాతికి చెప్పబడిన యాశౌచమవలంబింపదగును ధనలోభమున అసవర్ణుని శవమును వహించినచో నాశవముయొక్క జాతికి చెప్పబడిన యాశౌచముకంటె ద్విగుణమైన యాశౌచము నవలంబింపవలయు నెట్లన.

శ్లో॥ అపరశ్చేత్పరంవర్ణం పరోవాప్యపరంయది ।
వహేచ్ఛవంతదాశౌచం దృష్ట్వార్థేద్విగుణంభవేత్ ॥

తా॥ అధికవర్ణముకలవాడు హీనవర్ణుని శవమునుగాని హీనవర్ణుడధికవర్ణుని శవమునుగాని ధనాదికమునుకోరి వహించినచో నాశవముయొక్క జాతికి చెప్పబడిన యాశౌచముకంటె ద్విగుణముగ నాచరింపదగునని వ్యాఘ్రుడు పలికెను.

శ్లో॥ యోసవర్ణమమూల్యేన నీత్వాచైవదహేన్నరః।
ఆశౌచంతుభవేత్తస్య ప్రేతజాతిసమంసదా ॥

తా॥ అని వెనుక నుదహరింపబడిన వచనము అపత్కాలవిషయము ఈ యుదహరింపబడిన వచనములయందలి నిర్హరణశబ్దమునకు ప్రేతను అలంకరించుట వహించుట దహించుటలలోనే యొకటేనియని యర్థము వర్ణింపనగు.

శ్లో॥ ప్రేతస్యవాసస్స్రగ్గంధ భూషణాద్యైరలంక్రియా ।
వహనందహనంచేతి నిర్హారాద్యోనిరుచ్యతే ॥

తా॥ నిర్హారశబ్దమునకు ప్రేతను వస్త్రములు పుష్పమాలికలు గంధము ఆభరణమును మొదలగువానిచే నలంకరించుటయనిగాని మోయుటయనిగాని దహించుటయనిగాని యర్థము వర్ణింపదగు ఇట్టి నిర్హారణమునందు ఏయేయాశౌచము చెప్పబడినదో వంతటి యాశౌచమున శుద్ధికలుగనేరదు ఇకనేమన ప్రాయశ్చిత్తముకూడ చేయుదగినది ఎట్లన.

శ్లో॥ కృచ్ఛ్రపాదోఽసపిండస్య ప్రేతాలంకరణేకృతే।
అజ్ఞానాదుపవాసస్స్యాదశక్తౌస్నానమిష్యతే॥

తా॥ సపిండుడుకానివానికి ప్రేతాలంకరణమునుచేసినచో పాదకృచ్ఛ్రము నాచరింపదగు అది యజ్ఞానవశమునయైనచో నుపవసింపదగు అట్లుపవసించుటకు సామర్థ్యము లేనిచో స్నానముజేయదగునని విజ్ఞానేశ్వరునిచేజెప్పబడెను స్మృత్యంతరమున మరియొక విశేషము చెప్పబడెను.

శ్లో॥ సజ్యోతిస్తుబహిర్వాసో రాత్రౌనక్షత్రదర్శనాత్।
ప్రాశయేత్పంచగవ్యంచ బ్రాహ్మణైస్స్వస్తివాచయేత్॥

తా॥ పగలైనచో సూర్యాస్తమయమగువరకును రాత్రియైనచో సూర్యోదయమగువరకును గ్రామమునకు వెలుపలనుండదగు రాత్రియందు నక్షత్రదర్శనమైన పిదప పంచగవ్యప్రాశనముజేసి బ్రాహ్మణులచే స్వస్తివచింపజేయవలయు ఈప్రాయశ్చిత్తము సపిండుడుకానివానివిషయము,

శ్లో॥ విహితంతుసపిండానాం ప్రేతనిర్హరణాదికం।
తేషాంకరోతియఃకశ్చిత్ తస్యాధిక్యంనవిద్యతే॥

తా॥ ప్రేతను వహించుట మొదలగునవి సపిండులకు విధింపబడినవి కాన నా సపిండులలోనే యొకానొకడీవహించుట మొదలగువానినొనర్చినను వానికేవిధమైన ప్రాయశ్చిత్తవిశేషమును లేదు అని దేవలుడు మొదలగువారిచేజెప్పబడెను మరియు,

శ్లో॥ యస్సమానోదకంప్రేతం వహేద్వాథదహేత్తదా।
తస్యాశౌచందశాహంతు అన్యేషాంతుత్ర్యహంవిదుః॥

తా॥ ఎవడు సమానోదకుని శవమును వహించునో లేక దహించునో వానికి పదిదినములాశౌచము తదితర సమానోదకులకు త్రిరాత్రమేయగునని దేవలు మొదలగువారిచే జెప్పబడె మరియు,

శ్లో॥ మిత్రబంధుసుహృత్పుత్ర ధనధాన్యగృహోజ్ఝితం।
అనాథంబ్రాహ్మణంప్రేతం యేవహంతిద్విజాతయః॥
పదేపదేయజ్ఞఫల మానుపూర్వ్యాల్లభంతి తే।
నతేషామశుభంకించి త్పాపంవాశుభకర్మణాం॥
జలావగాహనాత్తేషాం సద్యశ్శౌచంవిధీయతే॥

తా॥ మిత్రుడు బంధువు సుహృదయుఁడు పుత్రుఁడు ధనము ధాన్యము గృహము అనునవేనియులేక దిక్కులేక మృతినొందిన బ్రాహ్మణుని యేబ్రాహ్మణులు వహింతురో వారు అడుగడుగునకు అశ్వమేధయాగము జేసిన ఫలమునొందెదరు వారికేమాత్రము అశుభముకాని పాపముకాని లేదు అట్టియోగ్యమగు పనిజేసినవారలకు స్నానమాత్రముననే తత్కాలమున శుద్ధిచెప్పబడెనని పరాశరుఁడు పలికెను మరియు,

శ్లో॥ అనాథంబ్రాహ్మణందగ్ధ్వా క్షత్రియంవైశ్యమేవవా।
సద్యఏవమహాయజ్ఞ ఫలంప్రాప్నోతిమానవః॥

తా॥ దిక్కులేని బ్రాహ్మణునిగాని క్షత్రియునిగాని వైశ్యునిగాని వారివారి సవర్ణులు దహించినచో గొప్పయజ్ఞమునుచేసిన ఫలము నొందెదరని స్మృత్యంతరమున జెప్పఁబడె.

శ్లో॥ ప్రేతస్పర్శనసంస్కారే బ్రాహ్మణోనైవదూష్యతే।
వోఢాచైవాగ్నిదాతాచ సద్యస్స్నాత్వావిశుద్ధ్యతి॥

తా॥ ప్రేతను స్పృశించినందునను సంస్కరించినందునను బ్రాహ్మణుడు దూషింపబడడు వహించినవాడును అగ్నినిదరిగొల్పినవాడును స్నానముజేసి తత్కాలమున శుద్ధులగుదురని వృద్ధయాజ్ఞవల్క్యులు పలికె ఇచ్చట స్నానము ప్రాణాయామమునకుగూడ నుపలక్షణముకాన ప్రాణాయామముగూడ జేయఁదగు.

శ్లో॥ ప్రవేశనాదికంకర్మ ప్రేతసంస్పర్శినామపి।
ఇచ్ఛతాంతత్క్షణాచ్ఛుద్ధిః పరేషాంస్నానసంయమాత్॥

తా॥ అను యాజ్ఞవల్క్యవచనము విజ్ఞానేశ్వరునిచే నీక్రిందివిధమున వ్యాఖ్యానము జేయబడెను వెనుక చెప్పబడిన వేపాకునమలుట మొదలుకొని గృహమున బ్రవేశించుటవఱకుగల కర్మ జ్ఞాతులకుమాత్రమేకాదు ధర్మార్థము ప్రేతాలంకారము మొదలగువాని నొనర్చినవారికిగూడ కాదగు కాని శవమును ధర్మార్థవహించినవారలకును దహించినవారలకును తత్కాలముననే శుద్ధికోరినవారలకు స్నానప్రాణాయామములచే తత్కాలముననే ఆశౌచనివృత్తియగునని చెప్పబడెను.

శ్లో॥ ఇతిసంస్కృత్యగచ్ఛేయు ర్గృహంబాలపురస్సరాః।
విదశ్యనింబపత్రాణి నియతాద్వారివేశ్మనః॥
ఆచమ్యాగ్న్యాదిసలిలం గోమయంగౌరసర్షపాన్।
ప్రవిశేయుస్సమాలభ్య కృత్వాశ్మనిపదంశనైః॥

తా॥ అనుయాజ్ఞవల్క్యుని వచనమునకుగూడ విజ్ఞానేశ్వరునిచే నీక్రిందివిధమున వ్యాఖ్యానము చేయబడెను ఇట్లు కులవృద్ధులవచనముల బాగుగావిని శోకమును విడచి బాలురముందిడుకొని గృహమునుగూర్చిపోవలయు ఇట్లువచ్చి గృహద్వారమున నిశ్చలగుమ మనస్సుకలవారై వేపాకుల దంతముచే నమలి ఆచమనముజేసి అగ్ని ఉదకము గోమయము తెల్లావాలు వీటిని స్పృశించి మరియు శంఖునిచే జెప్పబడిన గరికిచిగుళ్లు పగడము అగిం వృమభము వీటినిగూడ స్పృశించి రాతియందు పదమునుంచి మెల్లగ గృహమున బ్రవేశ్ని పదగును శవమును చూచినచో,

శ్లో॥ ఊహ్యమానంశవంధృష్ట్వా సవాసాజలమావిశేత్ ।
అలంకృతంశవంధృష్ట్వా సచేలస్నానమాచరేత్ ॥
ఆచమ్యకేవలంప్రేతం దృష్ట్వాకాష్ఠవదాచరేత్ ॥

తా॥ శ్మశానమునకు గొనిపోబడుచున్నట్టిగాని అలంకరింపబడినట్టిగాని ప్రేతను చూచినను బుద్ధిపూర్వకముగ ।నలంకరింపబడక కాష్టమువలెనున్న ప్రేతను చూచినను సచేలస్నానముజేయువలయు దైవవశమున నలంకరింపబడని ప్రేతను చూచినచో ఆచమున ముజేసి శుద్ధుడగునని స్మృత్యన్తరమున జెప్పబడెను మరియు,

శ్లో॥ బ్రహ్మచారీనకుర్వీత శవదాహాదికాఃక్రియాః।
యదికుర్యాత్ చరేత్కృచ్ఛ్రంపునస్సంస్కారమేవచ॥

తా॥ బ్రహ్మచారి శవవహనము శవదహనము మొదలగుక్రియల జేయదగదు. అట్లుచేసినచో కృచ్ఛ్రవ్రతమునాచరించి తిరిగి ఉపనయనముజేసికొనవలయునని దేవలుడు పలికెను.

బోధాయనః॥ సూ॥ అధోపనీతస్యావ్రతాని॥

తా॥ అనియుపక్రమించి, నూతకాన్నము, శవదహనము, శ్రాద్ధభోజనము మొద లగుకొన్నిటిని పరిగణించి, "ఏతేపునస్సంస్కార్యాః" అనిచెప్పెను, అనఁగా, ఉపనయన మైనపిమ్మట బ్రహ్మచారి. ఈచెప్పఁబడిన శవదహనాదుల నాచరించినచో తిరిగి ఉపన యనసంస్కారముజేసికొనవలయునని యర్థము. తండ్రిమొదలగువారి విషయమున నీదో షములేదు.

శ్లో॥ ఆచార్యంస్వముపాధ్యాయం పితరంమాతరంగురుం।
నిహృత్యదహతిప్రేతాన్ నవ్రతేనవియుజ్యతే ॥

తా॥ మిత్రుఁడు బంధువు సుహృదయుఁడు పుత్రుఁడు ధనము ధాన్యము గృహము అనునవేవియులేక దిక్కులేక మృతినొందిన బ్రాహ్మణుని యే బ్రాహ్మణులు దహింతురో వారు అడుగడుగునకు అశ్వమేధయాగము జేసిన ఫలమునొందెదరు వారికేమాత్రము అశుభముకాని పాపముకాని లేదు అట్టియోగ్యమగు పనిజేసినవారలకు స్నానమాత్రముననే తత్కాలమున శుద్ధిచెప్పబడెనని పరాశరుఁడు పలికెను మరియు,

శ్లో॥ అనాథంబ్రాహ్మణందగ్ధ్వా క్షత్రియంవైశ్యమేవవా ।
సద్యఏవమహాయజ్ఞ ఫలంప్రాప్నోతిమానవః ॥

తా॥ దిక్కులేని బ్రాహ్మణునిగాని క్షత్రియునిగాని వైశ్యునిగాని వారివారి సవర్ణులు దహించినచో గొప్పయజ్ఞమునుచేసిన ఫలము నొందెదరని స్మృత్యంతరమున జెప్పఁబడె.

శ్లో॥ ప్రేతస్పర్శనసంస్కారే బ్రాహ్మణో నైవదూష్యతే ।
వోఢాచైవాగ్నిదాతాచ సద్యస్స్నాత్వావిశుధ్యతి॥

తా॥ ప్రేతను స్పృశించినందునను సంస్కరించినందునను బ్రాహ్మణుడు దూషింపబడడు వహించినవాడును అగ్నినిదరిగొల్పినవాడును స్నానముజేసి తత్కాలమున శుద్ధులగుదురని వృద్ధయాజ్ఞవల్క్యులు పలికె ఇచ్చట స్నానము ప్రాణాయామమునకుగూడ నుపలక్షణముకాన ప్రాణాయామముగూడ జేయఁదగు.

శ్లో॥ ప్రవేశనాదికంకర్మ ప్రేతసంస్పర్శినామపి।
ఇచ్ఛతాంతత్క్షణాచ్ఛుద్ధిః పరేషాంస్నానసంయమాత్ ॥

తా॥ అను యాజ్ఞవల్క్యవచనము విజ్ఞానేశ్వరునిచే నీక్రిందివిధమున వ్యాఖ్యానము జేయబడెను వెనుక చెప్పబడిన వేపాకునమలుట మొదలుకొని గృహమున బ్రవేశించుటవఱకుగల కర్మ జ్ఞాతులకుమాత్రమేకాదు ధర్మార్థము ప్రేతాలంకారము మొదలగు వాని నొనర్చినవారికిగూడ కాదగు కాని శవమును ధర్మార్థవహించినవారలకును దహించిన వారలకును తత్కాలముననే శుద్ధిగోరినవారలకు స్నానప్రాణాయామములచే తత్కాలముననే ఆశౌచనివృత్తియగునని చెప్పబడెను.

శ్లో॥ ఇతిసంస్మృత్యగచ్ఛేయు ర్గృహంబాలపురస్సరాః।
విదశ్యనింబపత్రాణి నియతాద్వారివేశ్మనః ॥
ఆచమ్యాగ్న్యాదిసలిలం గోమయంగౌరసర్షపాన్ ।
ప్రవిశేయుస్సమాలభ్య కృత్వాశ్మనిపదంశనైః॥

తా॥ అనుయాజ్ఞవల్క్యుని వచనమునకుగూడ విజ్ఞానేశ్వరునిచే నీక్రిందివిధమున వ్యాఖ్యానము చేయబడెను ఇట్లు కులవృద్ధులవచనముల బాగుగావిని శోకమును విడచి బాలురముందిడుకొని గృహమునుగూర్చిపోవలయు ఇట్లువచ్చి గృహద్వారమున నిశ్చలగుమ మనస్సుకలవారై వేపాకుల దంతముచే నమలి ఆచమనముజేసి అగ్ని ఉదకము గోమయము తెల్లావాలు వీటిని స్పృశించి మరియు శంఖునిచే జెప్పబడిన గరికెచిగుళ్లు పగడము అగిం వృషభము వీటినిగూడ స్పృశించి రాతియందు పదమునుంచి మెల్లగ గృహమున బ్రవేశ్శి పదగును శవమును చూచినచో,

శ్లో॥ ఊహ్యమానంశవందృష్ట్వా సవాసాజలమావిశేత్ ।
అలంకృతంశవందృష్ట్వా సచేలస్నానమాచరేత్ ॥
ఆచమ్యకేవలంప్రేతం దృష్ట్వాకాష్ఠవదాచరేత్ ॥

తా॥ శ్మశానమునకు గొనిపోబడుచున్నట్టిగాని అలంకరింపబడినట్టిగాని ప్రేతను చూచినను బుద్ధిపూర్వకముగ నలంకరింపబడక కాష్టమువలెనున్న ప్రేతను చూచినను సచేలస్నానముజేయవలయు దైవవశమున నలంకరింపబడని ప్రేతను చూచినచో ఆచమున ముజేసి శుద్ధుడగునని స్మృత్యన్తరమున జెప్పబడెను మరియు,

శ్లో॥ బ్రహ్మచారీనకుర్వీత శవదాహాదికాఃక్రియాః।
యదికుర్యాత్ చరేత్కృచ్ఛ్రంపునస్సంస్కారమేవచ॥

తా॥ బ్రహ్మచారి శవవహనము శవదహనము మొదలగుక్రియల జేయదగదు. అట్లుచేసినచో కృచ్ఛ్రవ్రతమునాచరించి తిరిగి ఉపనయనము జేసికొనవలయునని దేవలుడు పలికెను.

బోధాయనః॥ సూ॥ అధోపనీతస్యావ్రతాని॥

తా॥ అనియుపక్రమించి, నూతకాన్నము, శవదహనము, శ్రాద్ధభోజనము మొద లగుకొన్నిటిని పరిగణించి, "ఏతేపునస్సంస్కార్యాః" అనిచెప్పెను, అనఁగా, ఉపనయన మైనపిమ్మట బ్రహ్మచారి. ఈచెప్పఁబడిన శవదహనాదుల నాచరించినచో తిరిగి ఉపన యనసంస్కారముజేసికొనవలయునని యర్థము. తండ్రి మొదలగువారి విషయమున నీదో షములేదు.

శ్లో॥ ఆచార్యంస్వముపాధ్యాయం పితరంమాతరంగురుం ।
నిహృత్యతుదహాత్ప్రేతాన్ నవ్రతేనవియుజ్యతే ॥

తా॥ బ్రహ్మచారి ఆచార్యుని తనయుపాధ్యాయుని, తండ్రిని, తల్లిని, గురువును, వీరిని వహించినను, దహించినను, వ్రతభ్రష్టుడు కానేరడు అనిమనువచనము.

సూ॥ బ్రహ్మచారిణశ్శవ కర్మణావ్రతనివృత్తిరన్యత్రమాతాపిత్రో ర్గురోర్వా ॥

తా॥ బ్రహ్మచారికి శవకర్మనాచరించినందువలన వ్రతభంగమగుననుటు తలిదండ్రులు, గురువు, వీరికంటె నితరులవిషయమునందుమాత్రమని వసిష్ఠుఁడుపలికెను.

శ్లో॥ ఆచార్యపితుపాధ్యాయాన్ నిర్హృత్యాపివ్రతీవ్రతి।
సకటాన్నంచనాశ్నీయాన్నచతైస్సహసంవసేత్ ॥

తా॥ బ్రహ్మచారి, తండ్రిని, ఆచార్యుని, ఉపాధ్యాయుని, దహించినను వ్రతభ్రష్టుడుకానేరడు. కాని, ఆబ్రహ్మచారి, ఆచార్యోపాధ్యాయుల దహించినపుడాశౌచముగలవారియన్నమును భుజింపక వారితోగూడి వసింపకనుండదగును అని యాజ్ఞవల్క్యుడుపలికె. ఈశ్లోకమునందలి కటశబ్దముచే నాశౌచము లక్షణావృత్తిచే బోధింపబడునని విజ్ఞానేశ్వరుఁడు పలికెను.

శ్లో॥ యథావ్రతస్థోపిసుతః పితుఃకుర్యాత్క్రియాంనృప।
తథామాతామహస్యాపి దౌహిత్రఃకర్తుమర్హతి ॥

తా॥ పుత్రుఁడు బ్రహ్మచారియైనను తండ్రికెట్లు ఉత్తరక్రియలనాచరించునో అట్లు దౌహిత్రుఁడు బ్రహ్మచారియైనను మాతామహునకు జేయుదగునని భవిష్యోత్తర పురాణమున చెప్పఁబడెను.

శ్లో॥ పిత్రోర్గురోర్విపత్తౌతు బ్రహ్మచార్యపియస్సుతః।
సవ్రతశ్చాపికుర్వీత అగ్నిపిండోదకక్రియాః ॥
తేనాశౌచంనకర్తవ్యం సన్ధ్యాచైవనలుప్యతే।
అగ్నికార్యంచకర్తవ్యం సాయంప్రాతశ్చనిత్యశః ॥

తా॥ తలిదండ్రులయొక్కయు గురువుయొక్కయు మరణమున, పుత్రుఁడు బ్రహ్మచారియైనను, వ్రతస్థుడైయుండికూడ, దహనము, పిండదానము, ఉదకదానము మొదలగునవి చేయదగును. ఆబ్రహ్మచారికి, అస్పృశ్యతారూపమైన యాశౌచములేదు, సంధ్యకులోపములేదు. సాయంప్రాతఃకాలములయందు అగ్నికార్యమును చేయుచుండవలయునని సంవర్తుఁడుపలికె. ఇదిరెండుమొదలగుదినములయందు మొదటిదినమునందు మాత్రము, అస్పృశ్యతయు, కర్మాధికారములేకపోవుటయు కల్గియేయుండును. రెండు మొదలగు దినములయందుగూడ పిండోదకములనిచ్చు సమయమున కర్మాంగమైనయాశౌచముకలదు. కర్మాంతమున స్నానమున శుద్ధిగల్గు.

శ్లో॥ ఆచార్యంవాప్యుపాధ్యాయం గురుంవాపితరంచవా ।
మాతరంవాస్వయందగ్ధ్వా వ్రితస్థ స్తత్రిభోజనం ॥
కృత్వాపతతినైతస్మా త్ప్రేతాన్నంతునభక్షయేత్ ।
అన్యత్రభోజనంకుర్యా న్నచతైస్సహాసంవసేత్ ॥
ఏకాహమశుచిర్భూత్వా ద్వితీయేహానిశుద్ధ్యతి ॥

తా॥ బ్రిహ్మచారిగాని కృచ్ఛ్రాదివ్రితములయందు నిష్ఠకలవాడుకాని తనయొక్క ఆచార్యునిగాని ఉపాధ్యాయునిగాని గురువునుగాని తండ్రినిగాని తల్లినిగాని స్వయముగ దహించి ఆప్రేతయొక్క గృహమున భుజించినచో వ్రితభ్రిష్టుడగుగాన మరియొకగృహమున భుజింపవలయు ఆశౌచవంతులతోగూడి వసింపజనదు. ఇట్లాచరించినచో నొకదినము మాత్రిమాశౌచముకలవాడైయుండి రెండవదినమున శుద్ధుడగునని బ్రిహ్మపురాణమున జెప్పఁబడెను. వెనుక నుదహరింపఁబడిన సంవర్తవచనమునందలి వ్రితస్థశబ్దమునకు కృచ్ఛ్రాదివ్రితనిష్ఠుడనిమాత్రిమేయర్థము.

శ్లో॥ బ్రిహ్మచారియదాకుర్యా త్పిండనిర్వపణంపితుః ।
తావత్కాలందదాశౌచం తతస్నాత్వావిశుద్ధ్యతి ॥

తా॥ బ్రిహ్మచారి తనతండ్రికి పిండనిర్వపణముజేసినచో నాక్రియజేయునంతకాలమే యాశౌచమగు పిమ్మట స్నానముజేసి శుద్ధుడగునని ప్రిజాపతిజెప్పెను, ఈక్రియాంతమున స్నానముచే జెప్పఁబడినశుద్ధి రెండుమొదలగుదినములయందుమాత్రము వర్తించు. అసపిండుడగు ఏయొకానొకడుకాని తానాశౌచములేనివాడైయుండి ఆశౌచముకలవారితో సంపర్కమునుచేసినచో వానికెన్నిదినములు సంపర్కముకలదో అన్నిదినములును ఆశౌచముకల్గియుండు.

శ్లో॥ ప్రేతకర్మోపదర్శిత్వం తత్కృతిశ్చాపిభిస్సహా ।
సహావాసస్సపఙ్త్యాది సంపర్కార్థంప్రచక్షతే ॥

తా॥ కర్తప్రేతకర్మనాచరించుచుండ తానుప్రిదష్టగానుండుటయు ఆశౌచవంతులతోగూడి ఆప్రేతకర్మనాచరించుటయు ఆశౌచవంతులతోగూడి వసించుట వారిపంక్తియందుగూర్చుండుట నివియన్నియు సంపర్కశబ్దార్థములు మరియు,

శ్లో॥ యస్తైస్సహాసపిండోపి ప్రకుర్యాచ్ఛయనాసనం ।
బాంధవోఽబాంధవోవాపి సదశాహేనశుద్ధ్యతి ॥

తా॥ సపిండుడుకానివాఁడైయుండి ఏబంధువుడుకాని తదితరుడుకాని అసపిండులతోఁగూడి శయనించుచు కూర్చుండుచునుండునో అతడు దహనశుద్ధుడగు అనఁగా దహనము సంపర్కముకలిగియున్నచో దశాహాశౌచము కొన్నిదినములుమాత్రమే సంపర్కమున్నచో నాదినములుమాత్రమే యాశౌచము క్షణము అర్ధఘటిక మొదలగుస్వల్ప కాలమే సంపర్కమైనచో స్నానమాత్రమేయగును, ఇక సంపర్కాశౌచసంగ్రహము.

## —♦ ఇకసంపర్కాశౌచసంగ్రహము. ♦—

బ్రాహ్మణ క్షత్రియవైశ్యులు సవర్ణుని (తమ తమ కులమునందలివాని) శవముతోఁగూడ నడచినచో వరుసగా సచేలస్నానము అగ్నిస్పర్శనము ఘృతప్రాశనము తిరిగి స్నానము ప్రాణాయామము వీటినాచరింపవలయు రెండవసారిచేయు స్నానము పొడిబట్టతోఁగాని ఆపొడిబట్టలేనిచో పండ్రెండుపర్యాయములు విదల్పబడిన బట్టలోఁగాని చేయవలయును ఈస్నానమును బ్రాహ్మణులు తడిబట్టతోఁగూడ చేయఁజెల్లునని కొన్నిగ్రంథములయందు చెప్పఁబడెను. మూఁడుప్రాణాయామములుజేయవలయు శూద్రుడు సవర్ణుని శవముతోఁగూడ నడచినచో నేకరాత్రము దిక్కులేనివాడు ఉపనయనముకానివాడు కన్య వీరిశవములతోఁ నడచినచో అగ్నిస్పర్శనాదులక్కరలేదు. సచేల స్నానము ప్రాణాయామముమాత్రము చేయదగును. ప్రాణయామము తిరిగి స్నానముజేసినపిదప జేయవగును దిక్కుకలవానియొక్కయుఉపనయనమైనవానియొక్కయు వివాహమైనస్త్రీయొక్కయు శవతోఁగూడ నడచినచో ఘృతప్రాశనము అగ్నిస్పర్శనము జేయదగు అగ్నిఘృతములు లేనిచో వ్యాహృతులతోఁగూడిన గాయత్రీమంత్రముచే పదిపర్యాయము లభిమంత్రింపబడిన సగముదోసిలి యుదకమును త్రావినచో శుద్ధికల్గును శవముతోఁగూడనడచునప్పుడు శవముకంటె ముందునడువదగదు ప్రక్కలయందుకూడ నడువజనదు. వెనుకనే నడువవలయును శవానుగమనముగాని శవదహనముగాని శవవహనముగాని యొనర్చినచో స్త్రీలు స్నానముజేసినపిదప తానుకూడ స్నానముజేసి అగ్నిస్పర్శనాదులన్నిటిని తత్కాలము నందే యొనర్చి గ్రామమునబ్రవేశింపవలయును. స్త్రీలుస్నానముజేయకపూర్వము తాను స్నానముజేయక గ్రామమున బుద్ధిపూర్వకముగ బ్రవేశించినచో త్రిరాత్రమాశౌచము అబుద్ధిపూర్వకముగ బ్రవేశించినచో నేకరాత్రము ప్రేతయొక్క బంధువులతోఁగూడియే గ్రామమున బ్రవేశింపనగు శవముతోఁగూడ నడచినదినమున సచేలస్నానాదులజేసినను జపము హోమము అర్చనము దానము శ్రాద్ధము మొదలగునవి చేయదగవు సంధ్యావందనముమాత్రముచేయదగు గాయత్రీజపము సంక్షేపముగాజేయవలయు ఔపాసనము

దేవతార్చనము మరియొకనిచే జేయంపదగు దానము శ్రాద్ధము మరుసటిదినమున జేయదగు ఆతురవ్యంజనమునగూడ నిట్లే తెలియదగును బ్రాహ్మణుఁడు క్షత్రియుని శవముతో గూడ నడచినచో తత్కాలమున సచేలస్నానముజేసి పిమ్మట నేకరాత్రాశౌచము నవలంబించి మరుసటిదినము సచేలస్నానముజేసి అగ్నిని స్పృశించి ఎనిమిదివందలమారులు గాయత్రిని జపించి ఘృతప్రాశనముజేసి తిరిగి స్నానముజేసి మూడుమారులాచమనము జేయదగు వైశ్యుని శవముతోగూడనడచినను నిట్లేనని తెలియదగును కానియందుపక్షిణ్యాశౌచము మాత్రమువిశేషము ఆరుప్రాణాయామములధికము ఇదిగాయత్రీజపముతో వికల్పించునని కొందరనిరి శూద్రునిశవముతోగూడనడచినచో తత్కాలమున సచేలస్నానముజేసి పిమ్మట త్రిరాత్రమాశౌచము నవలంబించి నాల్గవదినమున సముద్రగామినియగు నదియందు స్నానముజేసి అగ్నిని స్పృశించి ఎనిమిదివేలపర్యాయములు గాయత్రిని జపించి ఘృతప్రాశనముజేసి తిరిగి స్నానముజేసి ముమ్మారుప్రాణాయామముజేయవలయు క్షత్రియునకు వైశ్యశవానుగమనముజేసినచో నేకరాత్రాశౌచము శూద్రశవానుగమనమున పక్షిణియగు కొందరు ద్విరాత్రమనిరి వైశ్యునకు శూద్రశవానుగమనమును క్షత్రియునకువలెనే యాశౌచము బ్రాహ్మణునివలె నగ్నిస్పర్శనము మొదలగునవి యన్నియుజేయదగు. ఇక మార్గాదులయందు శవమని తెలిసికొనక యదృచ్ఛచే క్షత్రియ శవానుగమనము నాచరించినచో బ్రాహ్మణునకు నదీస్నానము ఐదువందలపర్యాయములు గాయత్రీజపము జేయదదు ఇట్లే వైశ్య శవానుగమనముజేసినచో నదీస్నానము ఏడువందల యేబదిపర్యాయములు గాయత్రీజపము జేయదగును. ఇట్లు యదృచ్ఛచే శూద్రశవానుగమనముజేసినచో నదీస్నానము సహస్రగాయత్రీజపము జేయదగును. ఇంతియకాని ఏకరాత్రాద్యాశౌచము లేదు. బ్రాహ్మణుఁడు సవర్ణునివిషయమున సంచయమునకుపూర్వము ఏడ్చుట కన్నీరునిడుచుట దీనవచనములబల్కుట మొదలగు ఆతురవ్యంజనములజేసినచో స్నానమాత్రము సంచయనమైనపిమ్మటయగుచో నాచమనముమాత్రము ఎక్కువవర్ణముగలవాని విషయమున తక్కువ వర్ణముగలవాడు సంచయనమగులోగా నాతురవ్యంజనముజేసినచో స్నానమాత్రము సంచయనమైనపిమ్మట ఆచమనమాత్రము బ్రాహ్మణుఁడు క్షత్రియ వైశ్యులవిషయమున సంచయనమగులోగా నాతురవ్యంజనముజేసినచో సచేల స్నానముజేయదగు పిమ్మట నేకరాత్రాశౌచము నవలంబించి మరుసటిదినమున నదియందు సచేలస్నానముజేసి శుద్ధుడగును, సంచయనమైనపిమ్మట స్నానమాత్రమేయగు క్షత్రియునకు వైశ్యవిషయకమైన ఆతురవ్యంజనమునగూడ నీవిధమేనని తెలియదగు, బ్రాహ్మణుఁడు శూద్రునివిషయమున సంచయనమగులోగా నాతురవ్యంజనముజేసినచో త్రిరాత్రాశౌ

చము క్షత్రియవైశ్యుల కీసందర్భమున ద్విరాత్రాశౌచము సంచయనమైనపిమ్మట శూద్రు నివిషయమున ఆతురవ్యంజనము జేసినచో నీమూడువర్ణములవారికిని ఏకరాత్రమేయగు మరుసటిదినమున నదియందు సచేల స్నానముజేసి శుద్ధులగుదురు సూతకగృహమునకుబో యిగాని శ్మశానమునగాని మార్గముమధ్యమునగాని ఎచ్చటనీయాతురవ్యంజనముజేసినను వెనుకవిధింపబడిన యాశౌచముకలుగును. క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణునకును స్నేహ మున్నచో నపుడు సంచయనమైనపిదప బ్రాహ్మణుడు వారినాదరింపవలయు నపుడు స్నానముననే శుద్ధియగు బ్రాహ్మణునకు శూద్రునియందు స్నేహమైనచో నపుడాశౌచా న్తమున నాదరింపదగు ఆశౌచమధ్యకాలముననైనచో వెనుకచెప్పఁబడిన యాశౌచముగల్గు స్నేహాదులచే సపిండుడుకాని ప్రేతకు అలంకరణముగాని వహనముగాని దహనముగాని ఈచెప్పఁబడిన మూడునుగాని ఎవడుచేయునో వాడు సచేల స్నానముజేసి పగలైనచో నస్తమయపర్యంతమును రాత్రియగుచో నుదయపర్యంతమును గ్రామమునకు వెలుపలనుండి నక్షత్రోదయమైనపిమ్మటగాల సూర్యోదయమైనపిమ్మటగాని తిరిగి సచేల స్నానముజేసి అగ్నిని స్పృశించి ఘృతమునుగాని పంచగవ్యమునుగాని ప్రాశనముజేసి తిరిగిస్నానముజేసి ప్రాణాయామముజేసి కృచ్ఛ్రపాదమునకు ప్రతినిధినొనర్చి బ్రాహ్మణులచే స్వస్తివచన ములగొని శుద్ధుడగును. వహించుట దహించుట మొదలగునవి యొనర్చినపిమ్మట తత్కా లముననే గ్రామమును ప్రవేశించినచో నొకరాత్రింబవలంతయు నాశౌచమవలంబించి మరుసటిదినమున వెనుక జెప్పబడిన ప్రాయశ్చిత్తమునంతను యొనర్చుకొనిన పిమ్మట శుద్ధు డగును ప్రేతాలంకరణాదులనొనర్చి ఎవడు గ్రామమును ప్రవేశించి ప్రేతగృహమున వసిం చునో వానికి త్రిరాత్రమాశౌచము ఆయాశౌచముగలవారియన్నమును భుజించినచో దశ రాత్రాశౌచము అగ్నిస్పర్శనము మొదలుకొని స్వస్తివాచనమువరకునుగల యైదుకర్మలును అందరకు సమానము ఎవడు ప్రేతకగ్నిసంస్కారమునొనర్చునో వానికి దహనానంతరము సంచయనముగాని తిలోదకముగాని యారంభింపకపూర్వము ముఖ్యకర్తవచ్చినచో వెనుక జెప్పబడినరీతిని సజ్యోతిరాశౌచముగాని ఏకరాత్రిముకాని త్రిరాత్రముకానియగును తిలోదకమునారంభించినపిదపగాని సంచయనమైనపిమ్మటగాని ముఖ్యకర్తవచ్చినను రాకు న్నను దశరాత్రాశౌచమేయగును పిమ్మట పదునొకండవదినమున ముఖ్యకర్తరానిచో తనచే జేయబడినట్టిగాని వచ్చినచో నాముఖ్యకర్తచే జేయబడినట్టిగాని ఏకోద్దిష్టమున శుద్ధిగల్గును ఈదశరాత్రాశౌచము ముఖ్యకర్తదేశాన్తరమునందుండగా వానిసంబంధమును పురస్కరించు కొని దహనము జేసిన పక్షముననని తెలియదగు దిక్కులేని ప్రేతనుదహించినచో త్రిరా త్రమేయగును అత్రిరాత్రాశౌచముకూడ సంచయన తిలోదకములజేసినచోగల్గు రెండవ

దినమున సంచయనము మూడవదినమున నేకోద్దిష్టముఁజేసి నాయేకోద్దిష్టాంతమున శుద్ధుడగును, దహనమాత్రమే యొనర్చినచో స్నానమాత్రమున శుద్ధిగల్గునని పూర్వము చెప్పఁబడె. మాతృబంధువులగు మేనమామ మొదలగువారి దహించినచో వారిగృహమున వసింపకపోయినను త్రిరాత్రము తిలోదకము నారంభించినను సంచయనము చేయబడినను పక్షిణ్యాశౌచముగలవారలకు దశరాత్రమునని తెలియఁదగును. ఇదియును మరియొక కర్తలేక తానే సంస్కరించిన పక్షమునని తెలియఁదగును మరియొక కర్తయున్నచో దశరాత్రమని చెప్పబడినది. సమానోదకుని దహించినచో తిలోదకాదులనొనర్పకున్నను దశరాత్రమేయగు కొంతద్రవ్యమునుగొని సవర్ణుని శవమునకలంకరణాదులనొనర్చినచో పూర్ణాశౌచము. స్నేహాదులచే హీనవర్ణుని శవమునకలంకరణాదులొనర్చినచో నాయావర్ణములకు చెప్పఁబడిన ద్వాదశాహాద్యాశౌచముల నవలంబింపవలయును వారివలన ధనముగొని యీయలంకరణాదులొనర్చినచో నాద్వాదశాహాద్యాశౌచమునకు ద్విగుణమైన యాశౌచమునవలంబింపదగు. ఈ చెప్పఁబడిన అన్నియాశౌచములకును అంతమున అగ్నిస్పర్శనము మొదలుకొని స్వస్తివాచనమువరకుగల ప్రాయశ్చిత్తమునంతను జేసికొనవలయును ధర్మార్థమై దిక్కులేని ప్రేతకు వహన దహనాదులొనర్చినచో బంధుత్వములేనివారలకుగూడ స్నానప్రాణాయామములచేతనే శుద్ధిగలుగును యాశౌచమేమాత్రమును లేదు. అగ్నిస్పర్శనాదులుగూడ లేవు పుత్రులుకాని జ్ఞాతులుకాని తదితరులుకాని ధర్మార్థము ప్రేతాలంకరణాదులయందు ప్రవర్తించినవారుకాని ప్రేతను స్పృశించినవారుగాని స్నానముఁజేసివచ్చి గృహమునబ్రవేశించుసమయమున ద్వారప్రదేశమున నిలుచుండి నియమింపబడిన మనస్సుకలవారై వేపాకునమలి గండూషముజేసి ఆచమనముజేసి అగ్నిని ఉదకమును గోమయమును తెల్లావాలను గరికచిగుళ్లను పఁడెమును వృషభమును స్పృశించి ద్వారదేశమున నొక రాతినుంచి దానియందు ముందుగా పదమునుంచి దీపముతోగూడ మెల్లమెల్లగా లోపలప్రవేశింతురు. మరియు అలంకరింపబడినట్టిగాని శ్మశానమునకుగొనిపోబడుచున్నట్టిగాని శవమును చూచినచో సచేల స్నానముజేయువలయును కేవలశవమును అబుద్ధిపూర్వకజూచినచో నాచమనమును బుద్ధిపూర్వముగఁజూచినచో స్నానమును చేయదగును. బ్రహ్మచారి ప్రేతవహనాదులనొనర్చినచో నపుడు కృచ్ఛ్రవ్రతము నాచరించి తిరిగి యుపనయనము జేసికొనవలయును ప్రేతవహనాదులొనర్పక కేవలము సూతకాన్నమును భుజించినపుడు కూడనిట్లేజేయదగు తలిదండ్రులయొక్కగాని గురువుయొక్కగాని మృతియందు సన్నిధానమున మరియొక కర్తలేనిచో తానుబ్రహ్మచారియైనను ప్రేతకృత్యమునంతయుజేయవలయును కాని ప్రేతగృహమునవసింపజనదు ఆశౌచవంతులతోగూడి వసింపదగదు.

వారియన్నమును భుజింపదగదు భిక్షాటనముఁజేసి పరగృహమున భోజనముజేయవలయును. ఇట్లుజేసినచో బ్రహ్మచారికి దహనదినమందుమాత్రమాశౌచము రెండవదినము మొదలు కొని పిండోదకములనిచ్చుకాలమున కర్మాంగమైన యాశౌచముకల్గు పిమ్మట కర్మాంత మున స్నానముఁజేసిన శుద్ధిగల్గు గృహస్థుడైనను ఏ యొకానొకడుకాని తానాశౌచముతే నివాడైయుండి ఆశౌచవంతులతోగూడ శయనాదులగాని ప్రేతకర్మోపదేశనము (ఇవి ఇట్లుచేయదగునని కర్తకుచెప్పుట) నుగాని ఎన్నిదినములొనర్చునో వానికన్నిదినములు నాశౌచమేయగు క్షణము అర్ధఘటిక మొదలగు స్వల్పకాలమీ సహశయనాదులొనర్చిన చో స్నానమాత్రము. ఇది సంపర్కాశౌచనిర్ణయముసమాప్తము.

—♦ ఇఁక ద్రవ్యాశౌచనిర్ణయము. ♦—

శ్లో॥ ద్రవ్యాణామపిచాశౌచం స్వామ్యాశౌచేవిధీయతే ।
ఆశౌచాంతేతుశుద్ధ్యన్తి వారిణాప్రోక్షితానిచేత్ ॥

తా॥ స్వామికియాశౌచముకల్గిఁనచో తత్సంబంధాశౌచము వానిసంబంధములగు తంతులములు మొదలగు ద్రవ్యములకుగూడ గల్గును ఆశౌచాంతమున జలముచే ప్రోక్షింప బడి ఆద్రవ్యములు శుద్ధినొందుకాన ఆశౌచదినములయందాశౌచవంతులయొక్క ద్రవ్య ముల ప్రతిగ్రహింపదగదు.

శ్లో॥ దధిక్షీరఘృతాదీనాం నదోషోస్తిస్వయంగృహే ॥

తా॥ పెరుగు పాలు నెయ్యి చల్ల బెల్లము ఉప్పు తేనె మాంసము పువ్వుము మూలము ఫలము శాకము కాష్ఠము తృణము నూతియందున్న యుదకము నూనె ఔష ధము చర్మము పొలమునందున్న ధాన్యము ఇవి స్వామియొక్క హస్తస్పర్శనము. లేకుండు నట్లుగా వానియజ్ఞముచే తానుగ్రహించిన దోషములేదు. కొందరు స్వామిచేభూమి యందుంచబడినచో గ్రహింపదగుననిరి. కాని అదియుక్తముకాదు “స్వామిస్పృష్టానిదు ష్యన్తి” స్వామిచే స్పృశింపబడినవై ద్రవ్యములు దుష్టములగునని స్మృతులయందు చెప్ప బడెను. ఇట్లే అంగడియందున్న ద్రవ్యములు మరియొకనిచే తూపించియివ్వబడినచో దోష ములేదు కాన గ్రహింపదగును.

శ్లో॥ సంపర్కాశౌచవాన్యస్తు యశ్చాత్యాశౌచవాన్భవేత్ ।
తస్యద్రవ్యాణిశుద్ధాని గ్రాహ్యానిస్యుర్మనీషిభిః॥

తా॥ సంపర్కాశౌచము కలవానియొక్కయు అతిక్రాన్తాశౌచము కలవానియొక్కయు తండులాది ద్రవ్యములు శుద్ధములేకాన వానిబ్రతిగ్రహించినచో దోషములేదు.

శ్లో॥ ఆపత్కాలే ప్రతిగ్రాహ్యా మామమైకాహికం ద్విజైః ॥

తా॥ మిక్కిలి యెండయందు తిరుగుట మొదలగువానిచేగాని దుర్భిక్షము దేశక్షోభము మొదలగువానిచేగాని ప్రాణసంశయము ప్రాప్తించినపుడు వేరుగతిలేని సందర్భమున భార్య పుత్రులు మొదలగు వారొకదినము భుజించుటకు చాలిన తండులాది ద్రవ్యమును ప్రతిగ్రహింపదగు.

శ్లో॥ పూర్వసంకల్పితం ద్రవ్యం యజ్ఞాదిషు న దుష్యతి ।
పక్వాన్నం తుస్థితం భోజ్యం పరైర్దత్తం మనీషిభిః ॥

తా॥ ఉపక్రమింపబడిన యజ్ఞము వివాహము ఉపనయనము చౌలము సీమంతము పుంసవనము దేవతోత్సవము దేవతాప్రతిష్ఠ మొదలగువానియందు పూర్వముతనచే సంకల్పింపబడిన ద్రవ్యము నా దేవతకొఱకుగాని బ్రాహ్మణునికొరకుగాని ఇవ్వదగు వారు ప్రతిగ్రహింపదగు సూతకము రాకపూర్వము వండబడియున్న పక్వాన్నముగూడ అశౌచవంతులయొక్క స్పర్శలేకుండునట్లుగా నితరులచే వడ్డింపబడినచో బ్రాహ్మణులు భుజింపదగును.

శ్లో॥ దాతృభోక్త్రోరన్యతరో జానాత్యాశౌచకారణం।
తదన్నం నప్రదేయంస్యాన్న చభోజ్యమితిస్మృతిః ॥

తా॥ అన్నము బెట్టెడిదాత తనకాశౌచనిమిత్తమగు జననమునుగాని మరణమునుగాని తెలిసికొనియుండి భుజించెడివాడు తెలిసికొనకున్నను తనయన్నమును బ్రాహ్మణునకు బెట్టతగదు భుజించెడివాడాయన్నదాత కాశౌచనిమిత్తము నెరింగియుండి దాత యెరుగకున్నను నాయన్నమును భుజింపదగు.

శ్లో॥ యదిభోజనమధ్యేతు జానాత్యాశౌచకారణం।
అన్యగేహోదకైరాపోశనాద్వైవదుష్యతి ॥

తా॥ దాతగాని భోక్తగాని భోజనాదికమునకుపూర్వము జననాదికమును వినక భోజనమధ్యకాలమున వినినచో నవుడు పాత్రమందున్న యన్నమునుమాత్రము భుజించి మరియొకగృహమునుండి యుదకమును తెప్పించి యుత్తరాపోశనముజేసి హస్త

ప్రక్షాళనాదికముగూడ నితరగృహమునందలి యుదకముచేతనే చేయవలయు పాత్రియందున్న యన్నమునుభుజించులోగా నుదకమును త్రాగవలసివచ్చినచో నదిగూడ నితరగృహమునందలి యుదకముచేతనే జేయదగు పాత్రియందున్న యన్నము లోగడనే యివ్వబడినదగుటచే స్వత్వమునివర్తించుటచే స్వామిసంబంధములేదు కాన నదిభుజించినదోషములేదు యజ్ఞాదులయందువలె మరియొకరు వడ్డించినను గ్రహింపదగదు యజ్ఞాదులయందు మాత్రము పూర్వముసంకల్పింపబడిన ద్రవ్యముమాత్రము పక్వమైయున్నచో పిమ్మటయాశౌచము ప్రాప్తించినచో నాయన్నము నితరులచే వడ్డింపజేసికొని భుజింపదగు ఆయజ్ఞాదులయందుకాక మరియొకచోటనైనచో పాత్రియందున్న యాన్నముమాత్రము భుజింపదగును. ఈచెప్పబడిన విషయములకు ప్రమాణములగు ఋషివచనములు క్రమముగా వ్రాయబడుచున్నవి, ఎట్లన,

శ్లో॥ ద్రవ్యాణిస్వామిసంబంధా దఘాహాస్వశుచీని చ।
స్వామిశుద్ధ్యైవశుధ్యన్తి వారిణాప్రోక్షితాన్యపి ॥

తా॥ ఆశౌచదినములయందాశౌచవంతుని ద్రవ్యములుగూడ స్వామిసంబంధము వలన నపరిశుద్ధములేయగు అవిస్వామిశుద్ధుడైనపిదప నుదకముచే ప్రోక్షింపబడినవై పవిత్రములగునని స్మృత్యన్తరమున జెప్పఁబడెను. మరియు,

శ్లో॥ చండాలాగ్నిరమేధ్యాగ్ని స్సూతకాగ్నిశ్చకర్హిచిత్ ।
పతితాగ్నిశ్చితాగ్నిశ్చ నశిష్టగ్రహణోచితాః ॥

తా॥ చండాలుని అగ్నియు అపవిత్రములైన వస్తువులనాశ్రయించిన యగ్నియు ఆశౌచవంతుని యగ్నియు పాపాత్మునియగ్నియు శ్మశానాగ్నియు శిష్టులచే గ్రహింపదగవు అని దేవలుడుపలికె కానసూతకముకలవాని యగ్నికిగూడ నాశౌచముకలదు. ఇక పెరుగు పాలు మొదలగువాని విషయమునందు.

శ్లో॥ లవణేమధుమాంసేచ పుష్పమూలఫలేషుచ ।
శాకకాష్ఠతృణేష్వప్సు దధిసర్పిఃపయస్సుచ॥
తైలౌషధాజినేచైవ పక్వాపక్వేస్వయంగ్రహః ।
పణ్యద్రవ్యేషుసర్వేషు నాశౌచంమృతసూతకే ॥

తా॥ ఉప్పు మద్యము మాంసము పుష్పము మూలము (దుంప) ఫలము కూర కాష్ఠము తృణము ఉదకము పెరుగు నెయ్యి పాలు నూనె ఔషధము చర్మము పక్వ

మగు భక్ష్యాదికము అపక్వములగు తండులములు మొదలగునవి యివి యాశౌచవంతుని హస్తస్పర్శనములేకుండునట్లుగా వానియనుమతిని తానుగ్రహించినను లేక ఆశౌచవంతు డంగడియందు వీని నిప్పింపగా గొనినను నాదగ్రివ్యములకు మృతసూతకమునందాశౌచము లేదని మరీచిపలికెను. ఈపక్వాపక్వములకు దోషములేదనుట అన్నసత్రమున బ్రవర్తిం చినవారివిషయమని విజ్ఞానేశ్వరాదులనిరి.

శ్లో॥ అన్నసత్రప్రవృత్తానా మామమన్నమగర్హితం ।
భుక్త్వాపక్వాన్నమేతేషాం త్రిరాత్రంతుపయఃపిబేత్ ॥

తా॥ అన్నసత్రాధికారి యాశౌచవంతుడైనను వానిసంబంధమగు తండుల ముల గ్రహింపవచ్చును కాని వానిసంబంధమగు పక్వమైన యన్నమునుగ్రహించినచో మూడురాత్రులు పాలుత్రాగియుండవలయునని యంగిరసుడుపలికె లవణాదులుమాత్ర మన్నసత్రములేకున్నను గ్రహింపవచ్చును అదియెట్లన.

శ్లో॥ యత్తుక్షేత్రగతంధాన్యం కూపవాపీషుయజ్జలం ।
అభోజ్యాదపితద్భోజ్యం యచ్చగోష్ఠగతంపయః॥
ఆమంమాంసంమధుఘృతం దధిక్షీరమథౌషధం।
గుడస్తక్రంతథోదస్వి ద్భోజ్యాన్యేతానినిత్యశః ॥

తా॥ పొలమునందున్న ధాన్యమును నుయ్యి దిగుడుబావులయందున్న యుద క మును గోవులయందున్నపాలు యింకను బియ్యము మాంసము మద్యము నెయ్యి పెరుగు పాలు ఔషధము బెల్లము చల్ల నీరుకలువనిచల్ల యివి సూతకునిసంబంధములైనవైనను దోషములేదుగాన గ్రహింపదగునని యంగిరసుడు పలికెను ఇచ్చటపొలమునందున్న ధాన్య మనుటచే గృహమునందున్న ధాన్యమునకు నిషేధము బావి దిగుడుబావులయందలి యుదక మనుటచే భాండమునందున్న జలమునకు నిషేధము గోవులయందున్నపాలనుటచే నాశౌ చవంతులచే స్పృశింపబడినపాలకు నిషేధము అంతియకాని పిదుకబడినపాలకు నిషేధమన దగదు అనినచో పాలబితికినగాని పెరుగు ఘృతము సంభవింపవు కాన నవి గ్రహింపబడక పోవలసివచ్చును, కాన సూతకముగలవారిచే స్పృశింపబడని పెరుగు పాలు నెయ్యి గ్రహింపదగునని తెలియదగు మరియు.

శ్లో॥ ఆశౌచంయస్యసంపర్కా దాపతేద్గృహమేధినః ।
క్రియాస్తస్యనలుప్యన్తె గృహ్యాణాంచనతద్భవేత్ ॥

తా॥ ఎవనికి సంపర్కముచేత నాశౌచముకల్గునో వానికి కర్మలోపములేదు అదియుగాక వానిగృహమునందున్న భార్యాపుత్రాదులకును తండులాది ద్రవ్యములకును ఈయాశౌచములేదు ఈకర్మలోపములేదనుట ఇతరులచే జేయింపదగని సంధ్యావందనాదులవిషయమునమాత్రమని తెలియదగు హోమము దేవతార్చనము మొదలగువానికి నిషేధము వెనుకనే చెప్పఁబడెఁది. కొందరీవెనుకటి శ్లోకమును “ క్రియాస్తస్యప్రలుప్యన్తే ” అనిపఠింతురు ఆపక్షమున హోమాదిక్రియలకు లోపమని తెలియదగు ఇఁక నతిక్రాన్తవిషయమున.

శ్లో॥ అతిక్రాన్తేదశాహేతు పశ్చాజ్జ్ఞానాతిచేద్గృహే।
త్రిరాత్రింసూతకంతస్య నతద్ద్రవ్యస్యకస్యచిత్ ॥

తా॥ తానాశౌచమువలంబింపదగినకాలము దశాహముగాని త్రిరాత్రముగాని అతిక్రమించినపిదప నాయాశౌచనిమిత్తమగు జననమునుగాని మరణమునుగాని వినినచో నతడుమాత్రము త్రిరాత్రముగాని పక్షిణిగాని అతిక్రాన్తాశౌచమునవలంబింపవలయు ఆయాశౌచము వానిద్రవ్యమునకు దేనికినిలేదని బృహస్పతిచెప్పెను ఇకనాపత్కాల విషయమున.

శ్లో॥ నాద్యాచ్ఛూద్రస్యపక్వాన్నం విద్వానాశౌచినోపిచ।
ఆదదీతామమేవాస్మా దవృత్తావేకరాత్రకం ॥

తా॥ శూద్రునియొక్కయు ఆశౌచవంతునియొక్కయు పక్వాన్నమును విద్వాంసుడు భుజింపదగదు దుర్భిక్షాదులచే జీవనముజరుగనపుడు వారివలన తనకుటుంబమునకొక దినముమాత్రము భుజింపజాలిన తండులాదుల గ్రహింపదగునని అంగిరసుడుపలికెను కాన పక్వాన్నాదులగ్రహింపదగదు వివాహాదులయందు పూర్వముసంకల్పింపబడిన ద్రవ్యము విషయమై.

శ్లో॥ వివాహోత్సవయజ్ఞాదిష్వన్తరామృతసూతకే।
పూర్వసంకల్పితంద్రవ్యం దీయమానంనదుష్యతి ॥

తా॥ వివాహము చౌలము ఉపనయనము మొదలగు సంస్కారకర్మలయందును దేవతోత్సవ ప్రతిష్ఠాదులయందును యజ్ఞాదులయందును మధ్యకాలమున తనకు సూతకముసంభవించినను పూర్వమివ్వసంకల్పించిన ద్రవ్యమునిచ్చినచో దోషములేదని పరాశరుడుపలికె ఇకపక్వాన్నవిషయమున.

శ్లో॥ వివాహోత్సవయజ్ఞాదిష్వన్తరామృతసూతకే।
శేషమన్నంపరైర్దేయం దాతౄనోభ క్తౄంశ్చనస్పృశేత్॥

తా॥ వివాహము ఉత్సవము యజ్ఞము మొదలగునవి జరుగుచుండ నామధ్యకాలమున జాతముకాని మృతముకాని సంభవించినచో మిగిలినయన్నము సూతకములేనివారు వడ్డింపదగు ఆశౌచవంతులావడ్డించెడివారలను భుజించెడివారలను తాకజనదు అనిస్మృత్యన్తరమున జెప్పఁబడెను ఈ యితరులచేవడ్డింపబడినయన్నమును భుజింపదగుననుట యజ్ఞాదాదులయందుమాత్రమనియు అందును పూర్వముసంకల్పింపబడిన పక్షమున నేననియు తెలియదగు యజ్ఞాదాదులకంటె నితరసమయమునందును పూర్వముసంకల్పింప బడినయన్నమున్నను నదియేవిధముచేతను భుజింపదగదు యజ్ఞాదాదులయందుగూడ సూతకమువచ్చిన పిదప వండబడినయన్నమునుభుజింపజనదు. ఇకనన్యతర పరిజ్ఞాన విషయమున.

శ్లో॥ ఉభాభ్యామపరిజ్ఞాతే భోక్తుర్దోషోనవిద్యతే।
ఏకేనాపిపరిజ్ఞాతే భోక్తుర్దోషముపావహేత్॥

తా॥ అన్నదాతయొక్క ఆశౌచమునిమిత్తము అన్నదాతకును భుజించెడివానికిని ఇరువురకును తెలియబడినచో నిరువురకును దోషములేదు ఇరువురిలోనే యొకడు తెలిసికొనియున్నను దోషముకలదు. అనగా దాతకు తెలిసియుండి యన్నముపెట్టినచో దాతకుదోషము భుజించెడివాడు తెలిసికొనియుండి భుజించినచో వారికిదోషమని షట్త్రింశన్మతమున జెప్పఁబడెను. యజ్ఞాదాదులకంటె ఇతరవిషయమునందు భోజనమధ్యకాలమున సూతకము తెలియబడినచో.

శ్లో॥ భుంజానేషుతువిప్రేషు త్వంతరామృతసూతకే।
అన్యగేహోదకాచాన్తా స్సర్వేచశుచయఃస్మృతాః॥

తా॥ బ్రాహ్మణులు భుజించుచుండగా నాగృహయజమానునకు భోజనమధ్యకాలమున నూతకముగాని మృతముగాని సంభవించినచో నాబ్రాహ్మణులందరును మరియొక గృహమునుండి తేబడినయుదకముచే పానము ఆపోనము ఆచనముజేసినవారైనచో శుద్ధులేయగుదురని షట్త్రింశన్మతముననే జెప్పఁబడెను.

## ఇక ద్రవ్యాశౌచసంగ్రహము.

సూతకముకలవానినుండి తండులములు మొదలగుద్రవ్యమును బంగారము వస్త్రము మొదలగునవియు ప్రతిగ్రహించజనదు సూతకవంతునిగృహమునుండి అగ్నినిగూడ తేగు.

డదు. అందు బెల్లము ఉప్పు తేనె పుష్పము మూలము ఫలము కూర కట్టెలు గడ్డి నూనె ఔషధము చర్మము ఇవి యజమానుని హస్తస్పర్శ లేకుండునట్లుగా వానియనుజ్ఞచే తాను గ్రహింపవచ్చును నూతియందున్న యుదకమును గ్రహింపవచ్చును భాండమందున్న యుదకము గ్రహింపజనదు పొలమునందున్న ధాన్యము గ్రహింపదగు గృహమునందున్నచో గ్రహింపదగదు పెరుగు పాలు నెయ్యి మజ్జిగ ఇవి యితరులచే పిదుకబడి తయారుచేయబడినచో వానిని గ్రహింపవచ్చును. అంగడియందున్న ద్రవ్యములితరులచే తూపించియివ్వబడినచో గ్రహింపదగును. అతిక్రాన్తాశౌచముకలవానినుండియు సంపర్కాశౌచముకలవానినుండియు తండులాదిద్రవ్యములగూడ స్వామియొక్క హస్తస్పర్శ లేకుండునట్లుగా గ్రహింపదగును పక్వాన్నమునుమాత్రము భుజింపదగదు అన్నదాత తనయాశౌచనిమిత్తము నెరిగియుండినచో తనయన్నమును బ్రాహ్మణునకు బెట్టతగదు అన్నదాతయొక్క ఆశౌచనిమిత్తము నెరిగియున్నచో భోక్త వానియన్నమును భుజింపజనదు భోజనము జేయుచుండ మధ్యకాలమున అన్నదాతయొక్క ఆశౌచము తెలియబడినచో పాత్రమందున్న యన్నమును మాత్రము భుజించి మరియొకగృహమునుండి యుదకమును తెప్పించుకొని ఉత్తరాపోశనము హస్తప్రక్షాలనము మొదలగునవి యొనర్పదగదు పాత్రమునందున్న యన్నము తినునప్పుడు గా నుదకమును త్రాగవలసివచ్చినచో నితరగృహమునందలి యుదకమునే త్రాగవలయును. వివాహము ఉపనయనము సీమంతము చౌలము మొదలగు సంస్కారకర్మలయందును యజ్ఞములయందును దేవతలయొక్క ఉత్సవములయందును ప్రతిష్ఠలయందును మధ్యకాలమున నూతకము ప్రాప్తించినను ఆసూతకవంతుని ద్రవ్యము సూతకమురాకపూర్వమే దేవతకొరకుగాని బ్రాహ్మణులకొరకుగాని ఇవ్వ సంకల్పింపబడియున్నచో నాద్రవ్యము స్వామియొక్క హస్తస్పర్శనము లేకుండునట్లుగా నితరులచే నివ్వబడినచో గ్రహింపదగును లేక స్వయముగా గ్రహింపవచ్చును సూతకమురాకపూర్వము వండబడినయన్నమువున్నచో నితరులచే వడ్డింపజేసికొని భుజింపదగు సూతకము వచ్చినతరువాత నితరులచే వండబడినను నాయన్నమును భుజింపదగదు వివాహాదులకంటె నితరమున సూతకమురాకపూర్వము వండబడినయన్నము నితరులువడ్డించినను భుజింపదగదు. దుర్భిక్షము మొదలగు నేయొకానొక కారణముచేగాని ప్రాణసంశయము ప్రాప్తించినపుడు వేరుగతిలేనిసందర్భమున భార్యాపుత్రాదులకొకదినము మాత్రము భుజించుటకు చాలిన బియ్యము మొదలగునవి సూతకవంతునివలననుండిగూడ గ్రహింపవచ్చును అంతకెక్కుడుగా గ్రహింపదగదు యావజ్జీవము నిత్యాన్నదానముజేయుదునని నియమమూనినవానియొక్క తండులాది ద్రవ్యము గత్యంతరమున్నను గ్రహింపదగును పక్వములగు భక్ష్యములగూడ గ్రహింపవచ్చును కాని పక్వాన్నమునుమాత్రమెప్పుడును గ్రహింపదగదు.

## —♦ ఆశౌచాపవాదనిర్ణయము. ♦—

శ్లో॥ ఆశౌచంస్యాద్గృహస్థానా మన్యేషాంస్నానమాత్రకం ॥

తా॥ వెనుక జెప్పబడినయాశౌచమంతయును గృహస్థులకుమాత్రమేయగు మిగిలిన యాశ్రమములవారలకు బంధుగులయొక్క జననమునగాని మరణమునగాని స్నానమాత్రమేయగును.

శ్లో॥ పిత్రోరాశౌచమస్త్యేవ తత్రాపిబ్రహ్మచారిణః ॥

తా॥ అయితరయాశ్రములయందుగూడ బ్రహ్మచారికిమాత్రము తలిదండ్రుల యొక్కమరణమునందాశౌచముకలదు, అందును బ్రహ్మచారి తలిదండ్రులస్వయముగనే సంస్కరించినచో మొదటిదినమంతయును నాశౌచము రెండు మొదలగుదినములయందు ప్రేత కర్మనాచరించుసమయమునమాత్రి మాశౌచముకల్గియుండి కర్మాంతమునజేపెడి స్నానమున శుద్ధికలుగును మరియొకడు సంస్కరించినచో మొదటిదినమునందుకూడ తిలోదకాదులనిచ్చు సమయమునమాత్రమే యాశౌచమగును.

శ్లో॥ గృహిణామప్యుపక్రాన్తే స్నానంయజ్ఞాదికర్మణి ॥

తా॥ యజ్ఞాదికర్మలు అనఁగా యజ్ఞము వివాహము ఉపనయము చౌలము మొదలగు స్మార్తకర్మలును పురాణప్రోక్తములగు మహాదానాదులును ఆగమసిద్ధములగు దేవతాప్రతిష్ఠ మొదలగునవియును నుపక్రమింపబడినపిదప జాతాదులుసంభవించినచో గృహస్థులకుగూడ నాశౌచములేదు.

శ్లో॥ ఋత్విగ్దీక్షితయోర్యజ్ఞే కర్తృభోక్త్రోశ్చపైతృకే ।
వివాహేదాతృవరయోః కన్యాయాశ్చనసూతకం ॥

తా॥ యజ్ఞముపక్రమింపబడినపిదప ఋత్విక్కులకును దీక్షితునకును ఆశౌచములేదు శ్రాద్ధమారంభింపబడినపిదప కర్తకును భోక్తలకును ఆశౌచములేదు వివాహమారంభింపబడినపిదప కన్యాదాతకును వానిభార్యకును కన్యాదానపర్యన్తమును వరునకును కన్యకును శేషహోమాన్తము వివాహసమాప్తినొందువరకును ఆశౌచములేదు ఇచటయజ్ఞమునుగ్రహించుట మహాదానాదులకుగూడ నుపలక్షణము.

శ్లో॥ తథాకర్మవిపాకాదౌ వ్యాధితస్యనసూతకం ।
ఉత్క్రాన్తిదానేకర్తవ్యే వ్యాధితస్యనసూతకం ॥

తా॥ కర్మవిపాకము మహిషిదానము మొదలగువానియందు వ్యాధిగ్రస్తుడగు వానికి సూతకములేదు ఇక్లైమృతినొందబోవువానికి ఉత్క్రాన్తిదానముచేయవలసివచ్చిన

పుడుగూడ సూతకములేదు ఇదికాలవిలంబమును సహింపనిపక్షమునని తెలియదగు కాల విలంబమును సహించినచో నాశౌచముకలదు.

శ్లో॥ అసాధారణకృత్యేషు రాజాదేర్నాస్తిసూతకం ॥

తా॥ రాజు మొదలగువారలకు అసాధారణములగు అనగా నితరులచే సాధింప శక్యముకాని పనులు తటస్థించినపుడు సూతకములేదు ఇచట "ఆది" శబ్దముచే వైద్యుడు మొదలగువారు గ్రహింపబడుదురు అనగా రాష్ట్రమునకుపద్రవము సంభవించినపుడు దానినివర్తింపజేయుటకు యుద్ధమునుగాని ఆయుద్ధప్రయాణకాలమున జేయదగిన శాన్తి హోమాదులగాని చేయవలసివచ్చినపుడు రాజునకు సూతకములేదు ధాతుపరీక్షాదుల జేయ వలసివచ్చినపుడు మరియొక వైద్యుడులేనిచో వైద్యునకు సూతకములేదు దాసీదాసులు మొదలగువారికిగూడ తాముమాత్రమే చేయకలిగి ఇతరులచే జేయసాధ్యపడని కృత్యము లయందు వేరుగతిలేని సందర్భమునందాశౌచములేదు ఇక ఋషివచనములు వ్రాయబడు చున్నవి.

శ్లో॥ నైష్ఠికానాంవనస్థానాం యతీనాంబ్రహ్మచారిణాం।
నాశౌచంసూతకేప్రోక్తం శావేచాపితథైవచ ॥

తా॥ నైష్ఠికులకును అరణ్యమునందున్నవారలకును యతులకును బ్రహ్మచారుల కును జాతమునందును మృతమునందును ఆశౌచములేదని దేవలుడు చెప్పెను మరియు,

శ్లో॥ నైష్ఠికానాంవనస్థానాం యతీనాంబ్రహ్మచారిణాం।
నాశౌచంకీర్తితంసద్భిః పతితేచతథామృతే।

తా॥ నైష్ఠికులకును వనమందున్నవారలకును యతులకును బ్రహ్మచారులకును ఆశౌచములేదు పాపాత్ముడు మృతినొందినచో గృహస్థులకుగూడ సూతకము లేదని కూర్మపురాణమున జెప్పబడెను సూతకముకలవాని గృహమున వసించియున్నను బ్రహ్మ చారికి సూతకములేదు కాని అందుభోజనాదుల జేయదగదు వారిసంపర్కమును చేయ గూడదు.

శ్లో॥ బ్రహ్మచారీగృహేయేషాం హూయతేచహుతాశనః।
సంపర్కంచనకుర్వంతి నతేషాంసూతకంభవేత్ ॥

తా॥ ఆశౌచవంతుని గృహమునందున్న అగ్నికిని బ్రహ్మచారికిని ఆశౌచవంతు లతోడ సంపర్కలేనిచో నాశౌచములేదు ఆశౌచవంతులగ్నిగృహమున బ్రవేశింపదగదు

ఎచట చాశౌచవంతులుండిరో ఆగృహమున బ్రహ్మచారి ప్రవేశింపదగదు అగ్నిగృహము ననే యుండవలయు అట్లైనచో దోషములేదు ఆచట బ్రహ్మచారి భుజింపగూడదు.

శ్లో॥ సూతకేతుయదావిప్రః బ్రహ్మచారీవిశేషతః।
పిబేత్పానీయమజ్ఞానా త్సమశ్నీయాత్ స్పృశేతవా ॥
పానీయపానేవిప్రస్య పంచగవ్యస్యప్రాశనం।
త్రిరాత్రింభోజనేప్రోక్తం స్పృష్ట్వాస్నానంసమాచరేత్ ॥

తా॥ బ్రాహ్మణుడు అందును బ్రహ్మచారి సూతకునియింట నుదకమును త్రావునో లేక అజ్ఞానమువలన భుజించునో లేక వారిని స్పృశించునో వాడు ఉదకమును త్రావినచో పంచగవ్యప్రాశనమును భుజించినచో కృచ్ఛ్రపాదమును స్పృశించినచో స్నానమును చేయవలయు ఈప్రాయశ్చిత్తము గృహమునకు ఆశౌచమున్నపక్షమునవేనని తెలియదగు అదిలేనిచో నిదిలేదు ఆగృహాశౌచముండుట లేకుండుటలు గ్రామాశౌచ ప్రకరణమున ప్రతిపాదింపబడినవి గృహమునకాశౌచమున్నచో నాగృహమున భిక్షాన్నమును భుజించినచో కృచ్ఛ్రపాదమునాచరింపదగు సూతకవంతులయన్నమును భుజించినచో నాసూతకవంతులకెన్ని దినములాశౌచమో అన్ని దినములును ఆశౌచమునవలంబింపవలయు ఆయాశౌచాంతమున బ్రహ్మచారి కృచ్ఛ్రవ్రతమును పునరుపనయనమును చేసికొనవలయును గృహస్థుడును అట్లే ఆశౌచము నవలంబించి పిమ్మట చాంద్రాయణవ్రతము నాచరింపవలయునని ప్రసవాశౌచప్రకరణమున ప్రతిపాదింపబడెను.

శ్లో॥ శిల్పినఃకారవోవైద్యాః దాసీదాసాశ్చనాపితాః।
రాజానఃశ్రోత్రియాశ్చైవ సద్యశ్శౌచాఃప్రకీర్తితాః ॥
సవ్రతస్సత్రపూతశ్చ ఆహితాగ్నిశ్చయోద్విజః।
రాజ్ఞశ్చసూతకంనాస్తి యస్యచేచ్ఛతిపార్థివః ॥
ఉద్యతోనిధనేదానే ఆర్తోవిప్రోనిమంత్రితః।
తథైవఋషిభిర్దృష్టం యథాకాలేనశుద్ధ్యతి ॥

తా॥ శిల్పులు కారువులు వైద్యులు దాసీదాసులు మంగలులు రాజులు శ్రోత్రియులు చాన్ద్రాయణాది వ్రతములననుష్ఠించుచున్నవారు సత్రయాగము జేయుచున్నవారు ఆహితాగ్ని రాజు ఎవనికి సూతకములేకుండునటుల గోరునో వాడును ఆర్తుడును నిమంత్రితుడగు బ్రాహ్మణుడును వీరు సద్యశ్శౌచముకలవారు అనగా,

శ్లో॥ హిరణ్యరూప్యవస్త్రాణాం కాష్ఠపాషాణచర్మణాం ।
సంస్కర్తాతత్క్రియాభిజ్ఞః శిల్పీత్యుక్తోమనీషిభిః ॥

తా॥ సువర్ణము వెండి వస్త్రము కొయ్య రాయి చర్మము వీనిని పలుతెరగుల రచించెడి నేర్పుకల్గి అట్లురచించెడివాడు శిల్పియనబడును ఇచట వస్త్రములకు చిత్తరువుల లిఖించి సంస్కరించువాడని యర్థము ఉదుకుట మొదలగువానిచే సంస్కరించెడి చాకలి కారువులలో పరిగణింపబడెను ఈ చెప్పబడిన లక్షణములుకల శిల్పులను చాకలి మొదలగు కారువులును రాజు ఇతరులచే సాధ్యపడని మంత్రాభిచారము మొదలగు కర్మలయందు ఏపురోహితుడు మొదలగువారికాశౌచము లేకపోవునుగాక అని ఇచ్ఛయించునో ఆపురోహితుడు మొదలగువారికిని రాజునకును సూతకములేదు ఇచ్చట నిధనశబ్దముచే తత్సాధనభూతమైన యుద్ధము లక్షణావృత్తిచే బోధింపబడును కాన యుద్ధమునుగాని దానమునుగాని యుపక్రమించిన రాజు అని యర్థము ఆర్తుడనగా వ్యాధిగ్రస్తుడు నిమంత్రితుడు అనగా శ్రాద్ధాదులయందు నియోగింపబడినవాడు వీరికి ఇతరులచే సాధ్యపడని కర్మలయందాశౌచములేదు తదితరకర్మలయందాశౌచముకలదు ఇచ్చట నిమంత్రణ శబ్దమునకు పాదప్రక్షాళనమైనపిదప ఆసనమునందు గూర్చుండగా జేయబడు నిమంత్రణమని యర్థము రోగపీడితులకు కర్మవిపాకాదులయందు కాలవిలంబమును సహింపనిపక్షమునసే యాశౌచములేదు శ్రోత్రియులకు సద్యశ్శౌచమనునది యుగాన్తరవిషయము "యథా కాలేనశుధ్యతి" అనగా దశాహాదికాలముచే నెట్లుశుద్ధుడగునో అట్లు తత్కాలమునందే శుద్ధుడగునని ఋషులచే తెలియబడెనని యర్థము.

శ్లో॥ శిల్పినశ్చిత్రకారాద్యాః కర్మయత్సాధయన్త్యలం।
తత్కర్మనాన్యోజానాతి తస్మాచ్ఛుద్ధాస్స్వకర్మణి॥
సూపకారేణయత్కర్మ కరణీయంప్రదృశ్యతే।
తదన్యోనైవజానాతి తస్మాత్ శుద్ధస్సూపకృత్॥
చికిత్సకోయత్కురుతే తదన్యేనసశక్యతే।
తస్మాత్ చ్చికిత్సకఃస్పర్శే శుద్ధోభవతినిత్యశః॥
దాసీదాసాశ్చయత్కించిత్ కర్మకుర్వన్తిలీలయా।
తదన్యోనక్షమఃకర్తుం తస్మాత్తేశుచయఃస్మృతాః॥
రాజాకరోతియత్కర్మ స్వప్నేప్యన్యస్యతత్కథం।
ఏవంసతినృపశ్శుద్ధః సంస్పర్శేమృతసూతకే॥

యత్కర్మరాజభృత్యానాం హస్త్యశ్వగమనాదికం ।
తన్నాస్తియస్మాదన్నస్య తస్మాత్తేశుచయస్స్మృతాః ॥

తా॥ చిత్రకారుఁడు మొదలగు శిల్పులును వంటజేసెడివాడును వైద్యుఁడును దాసీదాసులును వీరు అభ్యాసపాటవమున జేయజాలిన ఆయాపనుల మరియొకరు చేయజాలరు కాన ఆపనులజేయవలసివచ్చినపుడు వారికాశౌచములేదు రాజు చేయదగిన రాజ్యపరిపాలనాదికమును స్వప్నమునందుకూడ మరియొకడు చేయజాలడు అందువలన జాతమృతాదులు సంభవించినను రాజు శుద్ధుడేయగును రాజు భృత్యులచే జేయబడు ఏనుగులు గుఱ్ఱములు మొదలగువానిని నడపుట మరియొకరు జేయజాలరు కాన వారు శుద్ధులగుదురని ఆదిత్యపురాణమున జెప్పబడెను ప్రయాణసమయమునందగు శాన్తిహోమాదికమున ఋత్విగ్వరణము మొదలగువానియందు బ్రాహ్మణులకు రాజును స్పృశించుట ఆవశ్యకము యజమానునకుగూడ సంకల్పాదులయందు శుచిత్వమావశ్యకము మరియు,

శ్లో॥ కారవఃశిల్పినోవైద్యా దాసీదాసాస్తథైవచ ।
రాజానోరాజభృత్యాశ్చ సద్యశ్శౌచాఃప్రకీర్తితాః ॥

తా॥ కారువులు శిల్పులు వైద్యులు దాసీదాసులు రాజులు రాజభృత్యును వీరికి సద్యశ్శౌచమని ప్రచేతసుడు పలికె ఈదాసులు మొదలగువారలకు తాము తామమాత్రమేచేయుగగిన కృత్యములయందుమాత్రమాశౌచములేదు తదితరకర్మయందు కలదు ఆయాశౌచముకూడ స్వామి వర్ణమునకు చెప్పబడిన యాశౌచముతో సమమేయగు ఎట్లన.

శ్లో॥ దాసీదాసశ్చసర్వోవై యస్యవర్ణస్యయోభవేత్ ।
తద్వర్ణస్యభవేచ్ఛౌచం దాస్యామాసంతుసూతకం॥

తా॥ దాసీదాసులకు జ్ఞాతిమరణజనన నిమిత్తకమైన యాశౌచము ప్రాప్తించినపుడు వారేవర్ణమునకు దాస్యమును చేయుచుండిరో వావర్ణమునకు చెప్పబడినన్ని దినములాశౌచము. దాసిప్రసవించినపుడుమాత్రము మాసము సూతకమని అంగిరసుడు పలికెను మరియు,

శ్లో॥ రాజ్ఞాంచసూతకంనాస్తి వ్రతానాంచసత్రిణాం।
దీక్షితానాంచసర్వేషాం యస్యచేచ్ఛతిపార్థివః ।
తపోదానప్రవృత్తేషు నాశౌచంమృతసూతకే ॥

తా॥ రాజులకును వ్రతస్థులకును నిత్యసత్రముకలవారలకును యజ్ఞాదులయందు దీక్షబూనినవారలకును ఇతరులవలన సాధ్యములుకాని పనులవిషయమున రాజుచే గోర

బడినవారలకును చాన్ద్రాయణాదులయందును మహాదానములయందును ప్రవర్తించియున్న వారలకును జాతమృతములయందాశౌచములేదు అని వృద్ధపరాశరుమపల్కె మరియు,

శ్లో॥ ఋత్విజాందీక్షితానాంచ యజ్ఞీయంకర్మకుర్వతాం।
సత్రివ్రతిబ్రహ్మచారి దాతృబ్రహ్మవిదాంతథా॥
దానేవివాహేయజ్ఞేచ సంగ్రామేదేశవిప్లవే।
ఆపద్యపిచకష్టాయాం సద్యశ్శౌచంవిధీయతే॥

తా॥ యజ్ఞసంబంధమగు కర్మను చేయుచున్న ఋత్విక్కులకు మంత్రవరణము మొదలుకొని ప్రయోగము పరిసమాప్తినొందువరకును ఆశౌచములేదు ఇట్లే యజమానునకును పత్నికిని దీక్షబూనినదిమొదలుకొని అవభృదస్నానమగువరకు నాశౌచములేదు మరియు గోష్ఠమున నివసించువ్రతముకలవాడు చాన్ద్రాయణాది వ్రతములననుష్ఠించుచున్నవాడు బ్రహ్మచారి మహాదానముజేయ నుపక్రమించినవాడు బ్రహ్మవేత్త వీరలకును దానము వివాహము యజ్ఞము యుద్ధము దేశోపద్రవము కష్టమైన ఆపదలు తటస్థించినపుడు ఆశౌచములేదని యాజ్ఞవల్క్యుడు చెప్పెను నిర్ణయసింధువునందు ఋత్విక్కులకు మధుపర్కగ్రహణమైన పిమ్మటనుండి యాశౌచములేదని చెప్పుచు,

శ్లో॥ గృహీతమధుపర్కస్య యజమానాచ్చఋత్విజః।
పశ్చాదాశౌచపతితే నభవేదితినిశ్చయః॥

తా॥ యజమానునివలననుండి మధుపర్కమును గ్రహించిన ఋత్విక్కులకు పిమ్మట ఆశౌచనిమిత్తము కల్గినను ఆశౌచములేదు అను బ్రహ్మపురాణమునందలి వచనముదహరింపబడెను ఇక యజమానునివిషయమున,

శ్లో॥ తద్వద్గృహీతదీక్షస్య త్రైవిద్యస్యమహామఖే।
స్నానంత్వవభృధేయావ త్తావత్తస్యనసూతకం॥

తా॥ గొప్పయజ్ఞమునందు దీక్షబూనియున్న శ్రోత్రియునకు దీక్షామధ్యకాలమునందాశౌచనిమిత్తము సంభవించినను అవభృధస్నానమగువరకు నాశౌచములేదు అని బ్రహ్మపురాణమునందు ఆశౌచములేకపోవుటకీవభృధస్నానముత్తరావధిగ జెప్పబడినది నిర్ణయసింధువునందుమాత్రము అవభృథమునకు పూర్వమే కర్మప్రాప్తియని చెప్పబడినది మరియు,

శ్లో॥ నదీక్షిణ్యాః పరంయజ్ఞే నకృచ్ఛ్రాదితపశ్చరన్॥

తా॥ దీక్షణీయేష్టియైనపిదప యజ్ఞదీక్షితునకును కృచ్ఛ్రచాంద్రాయణాదులనాచరించుచున్నవానికిని ఆశౌచములేదని ఛందోగపరిశిష్టమున జెప్పఁబడెను అట్లైనచో ఋత్విక్కులకుగూడ అవభృథస్నానమగువరకు నాశౌచములేదనినచో వారివిషయమున సంకోచవచనములులేవు. “యజ్ఞీయం కర్మకుర్వతాం” అని సాధారణముగా జెప్పఁబడె కాన వారివారిప్రయోగము పరిసమాప్తినొందువరకే వారికాశౌచములేదు. క్రిందటి యాజ్ఞవల్క్యవచనమునందలి “బ్రహ్మవిత్” అనుపదమునకు సన్యాసిఅని అర్థము. దేశోపద్రవముకల్గినపుడు దానినుపశమింపజేయు శాంతికర్మనాచరించుటకును బహుకుటుంబముకలవాడు కష్టమగు ఆపత్తునందు అనగా దుర్భిక్షాదులయందు తలిదండ్రులు మొదలగువాని పోషించుటకుపకరించు ప్రతిగ్రహము జేయవలసివచ్చినపుడును సద్యశ్శౌచమని భావము మరియు,

శ్లో॥ ఆశౌచంకర్మమధ్యేతు శావంసూతకమేవవా ।
ఆపతేద్యదిసర్వేషాం సద్యశ్శౌచంవిధీయతే ॥
మాతాపిత్రోశ్చమరణే పుత్రస్యమరణేతథా ॥

తా॥ కర్మ మధ్యకాలమున జాతాశౌచముకాని మృతాశౌచముకాని ప్రాప్తించినచో నాకర్మయందు దీక్షబూనినవారలందరకును తత్కాలముననే శుద్ధికల్గు తలిదండ్రుల మరణమునందును పుత్రునిమరణమునందుగూడ నిట్లైతెలియదగును అనిస్మృత్యంతరమున జెప్పఁబడెను ఏకపుత్రుడైనచో.

శ్లో॥ దీక్షితోప్యేకపుత్రశ్చే న్మాతాపిత్రోర్మృతిర్యది ।
సంస్కృత్యశాలామాగత్య యజ్ఞశేషంసమాపయేత్ ॥

తా॥ తలిదండ్రులకు మృతిసంభవించినపుడు తాను యజ్ఞమునందు దీక్షబూనియున్నను వారికి తానొకడుమాత్రమే పుత్రుడైనచో వారికి దహనసంస్కారముజేసి యజ్ఞశాలకువచ్చి పిమ్మట యజ్ఞశేషమును సమాప్తినొందింపదగునని ఆస్మృత్యంతరముననే జెప్పఁబడెను.

శ్లో॥ జ్యేష్ఠస్యతుక్రతోర్మధ్యే మాతాపిత్రోర్మృతిర్యది ।
దీక్షారూపంనిధాయాత్ర సంస్కార్యాత్పితరావిహసః ॥

తా॥ జ్యేష్ఠుడు యజ్ఞమునాచరించుచుండ నాయజ్ఞమధ్యకాలమున తలిదండ్రులు మృతినొందినచో నాయజ్ఞశాలయందు దీక్షారూపమునుంచి తలిదండ్రులను సంస్కరింపవలయునని వృద్ధగార్గ్యుడుపలికెను మరియు,

శ్లో॥ దీక్షితోఽప్యేకపుత్రశ్చే న్మాతాపిత్రోర్మృతిర్యది।
దీక్షారూపంనిధాయాత్ర సంస్కుర్యాన్నోదకప్లవః॥
సంస్కృత్యశాలామాగత్య యజ్ఞశేషంసమాపయేత్ ।
పావయేద్దర్భపుంజీలై ర్దీక్షారూపంయథావిధి॥

తా॥ తలిదండ్రులు మృతినొందునపుడు తానుదీక్షితుడైనను వారికి తానొకడే పుడ్రుడైనచో యజ్ఞశాలయందు దీక్షారూపమునుంచి తానుపోయి వారికిసంస్కారముచేయవలయుకాని యుదకదానమునుచేయుదగదు ఇట్లు సంస్కరించి మరలయజ్ఞశాలకువచ్చి యజ్ఞశేషమును సమాప్తినొందింపదగును దీక్షారూపమును దర్భలచే శుద్ధిజేయవలయునని శాణ్డిల్యుడుచెప్పెను ఇచట నిట్లుతెలియదగు జ్యేష్ఠుడు దీక్షితుడైనచో దీక్షారూపమును శాలయందుంచి దహనమాత్రముజేసి తిరిగిశాలకువచ్చి యజ్ఞశేషమును సమాప్తినొందింపదగు కనిష్ఠుడుదహనవ్యతిరిక్తమగు కర్మనంతను జేయదగును దశాహమధ్యమున యజ్ఞముసమాప్తమైనచో నవభృథస్నానమువరకారంభించి అదిమొదలుకొని జ్యేష్ఠుడే దశాహకృత్యమును ఏకోద్దిష్టమును చేయవలయు పిమ్మట యజ్ఞమును సమాప్తినొందించి షోడశము మొదలగునవి యొనర్పదగును కనిష్ఠుడు దీక్షితుడైనచో స్నానమాత్రముజేసి శాలయందే యుండవలయు జ్యేష్ఠుడు దేశాన్తరముననున్నచో కనిష్ఠునకే జ్యేష్ఠన్యాయము వర్తించు ఏకపుత్రుడైనచో దహనముమాత్రమపుడొనర్చి అవభృథస్నానాన్తమున దశాహకృత్యమును తానేనిర్వర్తింపదగు ఏకోద్దిష్టాన్తమున యజ్ఞశేషమును పూరింపదగు పౌండరీకాది మహాయజ్ఞములయందు దశాహమధ్యకాలమున యజ్ఞముసమాప్తినొందనచో ఏకపుత్రుడు దహనవ్యతిరిక్తమగు దశాహకృత్యమును ఇతరునిచే జేయింపవలయు.

శ్లో॥ రాజ్యనాశస్తుయేనస్యా ద్వినా రాజ్ఞస్స్వమండలే ।
ప్రయాస్యతశ్చసంగ్రామే హోమేప్రాస్థానికేసతి ॥
మన్త్రాదితర్పణేవాపి ప్రజానాంశాంతికర్మణి ।
గోమంగళాద్వా వైశ్యానాం కృషికాలాత్యయేసతి ॥
ఆశౌచంనభవేల్లోకే సర్వత్రాన్యత్రవిద్యతే ॥

తా॥ రాజు ఏకర్మనుచేయనిచో తనమండలమున రాజ్యనాశనముకల్గునో ఆకర్మయందును దండయాత్రవెడలునపుడు ప్రయాణారంభమునజేయదగిన హోమమునందును ప్రజలక్షేమమునిమిత్తము చేయదగిన మంత్రతర్పణము మొదలగు శాన్తికర్మలయందును కృషినారంభించుసమయమున దున్నుటవలన గోవులకు పీడకలుగకుండుటకును గోవుల

యొక్క దేహదార్ఢ్యముకొఱకును గోత్రదేవతనుద్దేశించి వైశ్యులచేజేయబడు పూజ బలి కర్మ మొదలగువానియందును ఇంకను అనన్యగతికములగు అత్యావశ్యకములగు కర్మల యందు ఆశౌచములేదు గత్యన్తరమున్నను ఆవశ్యకముకాకపోయినను ఆశౌచముకలదని భావము ఇట్లుబ్రహ్మపురాణమున జెప్పఁబడెను మరియు బ్రహ్మపురాణమునందే ఈక్రిం దివిధమున జెప్పఁబడెను.

శ్లో॥ ఇష్టదేవప్రతిష్ఠాయాం గణయాగాదికర్మణి ।
శ్రాద్ధాదౌపిత్రృయజ్ఞేచ కన్యాదానేచనోభవేత్॥

తా॥ ఇష్టదేవతయొక్క ప్రతిష్ఠ మొదలగువానియందును గ్రామదేవతల యొక్క కొలుపులు మొదలగువానియందును శ్రాద్ధాదులయందును పిత్రృయజ్ఞమునందును కన్యాదానమునందును ఈయాశౌచములేదు ఈరాజు మొదలగువారి కాశౌచములేకపో వుట అనన్యగతికములగు కర్మలయందుమాత్ర ముపక్రమింపబడకపోయినను వర్తించును. యజ్ఞాదులయం దుపక్రమింపబడినపిమ్మట నేయాశౌచములేదు ఒకప్పుడాయజ్ఞాదులుకూడ నుపక్రమింపబడకబోయినను ఆశౌచములేదు అదియెట్లన.

శ్లో॥ యజ్ఞేసంభృతసంభారే వివాహేశ్రాద్ధకర్మణి॥

తా॥ సంపాదింపబడిన అన్నిసంభారములుసుకల వివాహమునందును యజ్ఞము నందును శ్రాద్ధకర్మమునందును ఆశౌచములేదని స్మృత్యన్తరమున జెప్పఁబడెను. ఇచట సంపాదింపబడిన సంభారములనగా శ్రాద్ధమునందు పక్వాన్నమనియు యజ్ఞవివాహముల యందు బియ్యము మొదలగు వస్తువులనియు భావమని చంద్రికయందు వ్రాయబడెను అది యును ఆవశ్యకములైనయజ్ఞాదులవిషయము అదియెట్లన వసంతకాలమతిక్రమించినచో నా సంవత్సరమున మరికాలములేకపోవుటవలన ప్రతిసంవత్సరము చేయదగినజ్యోతిష్టోమమునకు లోపముకలిగినచో గొప్పప్రత్యవాయముకలుగు స్నాతకునకప్పుడు వివాహకానిచో పిమ్మట వివాహమునకు బహువిఘ్నములు తటస్థించినచో పతితత్వమునాపాదించు అనాశ్రమిత్వము కలుగును.

శ్లో॥ అనాశ్రమీనతిష్ఠేత దినమేకమపిద్విజః॥

తా॥ బ్రాహ్మణుఁడొకదినమైనను ఏయాశ్రమమునులేకనుండదగదని నిషేధింప బడెను శ్రాద్ధమునందు పక్వాన్నములన్నియు సిద్ధమైనపిదప ఆశౌచములేదనుట ఆపద్వి షయము అనాపద్విషయమునందు తృతీయవరణము మొదలుకొనిమాత్రమే యాశౌచము

లేదు ఆత్మతీయవరణమగుటకుగా ఆశౌచముప్రాప్తించినచో సూతకముండదని వెంటనే చేయదగును.

శ్లో॥ శ్రాద్ధవిఘ్నే సముత్పన్నే అంతరామృతసూతకే ।
అమాయాన్తుప్రకుర్వీత శుద్ధావేకేమనీషిణః ॥

తా॥ దైవమానుషమూలకమగు శ్రాద్ధవిఘ్నము తటస్థించినచో నాశ్రాద్ధము నవమనాడాచరింపదగు మృతాశౌచమువలనగాని జాతాశౌచమువలనగాని విఘ్నముక ల్గినచో నాయాశౌచ శుద్ధిదినమునాచరింపవలయుననని స్మృత్యన్తరమున జెప్పఁబడె ఇట్లే శిష్టాచారముకలదు.

శ్లో॥ పూర్వంప్రవృత్తసీమంత చౌలోపనయనాదిషు।
వివాహేషుప్రతిష్ఠాసు వృషోత్సర్గాదికేషుచ॥
పూర్వప్రవృత్తయజ్ఞేషు పాకయజ్ఞేషుసప్తసు ।
శాన్తిహోమేషుసర్వేషు యుద్ధార్థవిహితేషుచ ॥
వ్యాధ్యాదిశమనాయాథ శాన్తికేదానకర్మణి॥

తా॥ ఉపక్రమింపబడిన సీమంతము చౌలము ఉపనయనము మొదలగువాని యందును వివాహము దేవతాప్రతిష్ఠ వృషోత్సర్జనము యజ్ఞములు సప్తపాకయజ్ఞములు వ్యాధి మొదలగునవి శమించుటకొరకాచరింపబడు శాన్తికర్మలు దానములు మొదలగు వానియందును యుద్ధమునకుబయలు వెడలెడిసమయమున జేయబడు హోమాదులయందును ఆశౌచములేదని బృహస్పతిపలికెను "ఉపక్రమము" అనుశబ్దమునకు వృద్ధశాతాతపుడిట్లు ర్థమును వర్ణించె.

శ్లో॥ ప్రారంభోవరణంయజ్ఞే సంకల్పోవ్రతసత్రయో ।
నాందీముఖంవివాహాదౌ శ్రాద్ధేపాకపరిక్రియా ॥
నిమంత్రణంవాశ్రాద్ధేషు ప్రారంభస్స్యాదితిస్మృతిః ॥

తా॥ యజ్ఞమునందు ఋత్విగ్వరణమున్ను వ్రతమునందును సత్రము అనఁగా గోష్ఠావాసదీక్షయందును సంకల్పమున్ను వివాహాదులయందు నాందిముఖమున్ను శ్రాద్ధమునందు పాకక్రియయు ప్రారంభమనబడు లేక శ్రాద్ధమునందు బ్రాహ్మణులని మంత్రించుట ప్రారంభమనబడు ఈ శ్లోకమునందలి పాకపరిక్రియ అనుశబ్దమునకు పాదప్రక్షాళనమైనపిదప బ్రాహ్మణులు కూర్చుండియుండగా అన్నాదులప్రోక్షించుట అని నిర్ణయసింధువు శుద్ధిప్రదీపిక మొదలగు గ్రంథములయందు వ్యాఖ్యానముచేయబడె అయితిము

నందు ప్రోక్షణము ఆపద్విషయమున ప్రారంభమగు అనాపద్విషయమునందు అటుపిమ్మటనగు తృతీయవరణము ఆరంభమనబడునని వ్యవస్థ మరికొందరు పాకపరిక్రియయనంగా పాకపరిసమాప్తియనిరి ఈయర్థము పాకోపకల్పనాదూర్ధ్వం అనువచనమునకనుకూలముగనున్నది కాన యుక్తమనదగు కాన ఆపద్విషయమున పాకపరిసమాప్తియు అనాపద్విషయమున తృతీయవరణమును ఉపక్రమమనదగు లేక పాకపరిసమాప్తియజమానుని విషయము నిమంత్రణము భోక్తృవిషయము అనివ్యవస్థ జేయదగును కర్తృవిషయమున సంకల్పముకూడ ఆరంభమని కొన్నివచనములుకలవు అవి అనాపద్విషయములని తెలియందగు యజ్ఞమునందు వరణమనగా మధుపర్కాంతమని నిర్ణయసింధువున జెప్పంబడెను ఈవిషయమున యమునకు మరియొకవిశేషమును చెప్పెను.

శ్లో॥ పాకోపకల్పనాదూర్ధ్వం సూతకే మృతకేపివా॥
కారయేచ్ఛ్రాద్ధశేషం స్వేన పక్వాన్నం పరివేషయేత్ ॥

తా॥ పాకముసిద్ధమైనపిదపగాని తృతీయవరణమైనపిదపగాని ఆశౌచము ప్రాప్తించినచో స్వయముగనే శ్రాద్ధముజేయుకలయు కాని పక్వమగు అన్నమునుమాత్రమాశౌచములేని మరియొకరిచే వడ్డింపజేయదగు మరియు,

శ్లో॥ యజ్ఞకాలే వివాహేషు దేవయాగే చ నిష్కృతౌ ।
హూయమానే తథైవాగ్నౌ నాశౌచం నచ సూతకం ॥

తా॥ యజ్ఞకాలమునందును వివాహమునందు శేషహోమాంతముకల కర్మకలాపమునందును దేవయాగమునందును ప్రాయశ్చిత్తమునందును అగ్నిహోమమునందును ఆశౌచములేదని దక్షుడుపలికె వివాహేషు అనుబహువచనము శేషహోమాంతముకల కర్మకలాపమును అభిప్రాయముకలదని స్మృతిముక్తాఫలమునందు వ్యాఖ్యానముచేయబడెను నాంతమముగాసైనచో కంకణమోచనమువరకును ఆశౌచములేదు నాకబలి మొదలగు కర్మలు కూడ "అపరేద్యుస్త్రిభ్యః ప్రతీయేరన్" అనుసూత్రమునందు చెప్పబడినటుల తాత్పర్యదర్శనము మొదలగు గృహ్యవ్యాఖ్యానములయందు చెప్పబడెను దక్షుని వచనమునందలి దేవయాగము లౌకికమనియు అగ్నౌహూయమానః అనుటచే ఔపాసనహోమకాలము వివక్షితమనియు తెలియదగు ఇదియుపలక్షణము కాన జపాదికర్మమధ్యమున జననమరణములు వినబడినను అవిసమాప్తినొందువరకు ఆశౌచములేదు.

శ్లో॥ వివాహకాలేకన్యాయా లాజహోమాదికర్మణి ।
ప్రాయశ్చిత్తపరస్యాపి స్వాధ్యాయనిరతస్యచ ॥

తా॥ కన్యయొక్క వివాహకాలమునందు లాజహోమము మొదలగు శేషహోమాంతముకల కర్మలయందును ప్రాయశ్చిత్తకర్మలయందును స్వాధ్యాయమునందు నిష్ఠకలవానికిని ఆశౌచములేదని బ్రహ్మపురాణమున జెప్పబడె ఏకాదశి మొదలగు వ్రతములవిషమున విష్ణురహస్యమునందు ఈవిధమున జెప్పఁబడె.

శ్లో॥ సూతకేమృతకేచైవ నత్యాజ్యంద్వాదశీవ్రతం।
ఏకాదశీవ్రతంనిత్యం కుర్యాత్కామ్యంతువర్జయేత్ ॥

తా॥ ఏకాదశీవ్రతము నిత్యము కామ్యము అని రెండువిధములు అందునిత్యైకాదశీవ్రతము ద్వాదశీవ్రతము జాతాశౌచ మృతాశౌచములయందుగూడ విడువవగదు సూతకమునందు కామ్యైకాదశీవ్రతమునుమాత్రము వర్జింపవగు పూర్వముపక్రమింపబడియున్నచో కామ్యమునుకూడ జేయదగునని కూర్మపురాణమున జెప్పఁబడె అదియెట్లన.

శ్లో॥ కామ్యోపవాసేప్రక్రాన్తే అంతరామృతసూతకే।
తత్రకామ్యవ్రతంకుర్యా ద్దానాధ్యయనవర్జితం ॥

తా॥ కామ్యోపవాసమునుపక్రమించిన పిదప జాతాశౌచముకాని మృతాశౌచముకాని సంభవించినచో నపుడు దానాధ్యయనములదక్క మిగిలిన వ్రతకలాపమునంతను వ్రతదినముననే ఆచరించి శుద్ధిదినమున దానాధ్యయనములజేయవగును ఇతరవ్రతములయందుగూడ నీన్యాయమేనని తెలియదగును వరాహపురాణమునందితికర్తవ్యతనుగూడ అనగా వ్రతకలాపమునకుగూడ సంకోచము చెప్పఁబడినది.

శ్లో॥ సూతకేతునరఃస్నాత్వా ప్రణమ్యశిరసాహరిం।
ఏకాదశ్యాంనభుంజీత వ్రతమేతన్నలుప్యతే ॥
మృతకేపినభుంజీత ఏకాదశ్యాంసదానరః ॥

తా॥ జాతాశౌచదినములయందుగాని మృతాశౌచదినములయందుగాని ఏకాదశి సంభవించినచో నిత్యైకాదశీవ్రతముకలమనుజుడు స్నానముజేసి విష్ణువునకు శిరమువంచి నమస్కరించి యాదినముపవసింపవగు ఇట్లైనజో వ్రతమునకులోపముకలుగదు ఇంక నుపరాగ (గ్రహణ) విషయమునందు.

శ్లో॥ స్మార్తకర్మపరిత్యాగో రాహోరన్యత్రసూతకే ॥

తా॥ రాహుదర్శనమున గలిగెడి సూతకమునదక్క మరియొకనిమిత్తమున గలిగినసూతకమునందు స్మార్తకర్మనువర్జింపదగునని వ్యాఘ్రుడుపలికెను అనఁగా రాహుదర్శనమునగలుగు సూతకమున దానశ్రాద్ధాదులును స్మార్తకర్మజేయదగునని భావము మరియు,

శ్లో॥ మృతకేసూతకేచైవ నదోషోరాహుదర్శనే।
స్నాత్వాశ్రాద్ధంప్రకుర్వీత దానంశాఠ్యవివర్జితం॥

తా॥ మృతాశౌచమునందుగాని జాతాశౌచమునందుగాని గ్రహణముసంభవించినచో రాహుదర్శనమైనపిదప స్నానముజేసి శ్రాద్ధమును శక్త్యనుసరించి దానమును చేయదగునని వృద్ధవసిష్ఠుడుపలికె శుద్ధమోక్షమైనపిదప తిరిగి యాశౌచముకలుగు ఇచట నిట్లు తెలియదగును యజ్ఞము మహాదానము కృచ్ఛ్రము చాన్ద్రాయణము బ్రహ్మచర్యము మొదలగు కర్మల నుపక్రమించినపిదప నాకర్మమధ్య సూతకముగాని మృతముగాని సంభవించినచో జ్ఞాతులకు తిలోదకమునుగూడ జేయజనదు ఇకనేమన ఆయుపక్రమింపబడినకర్మ సమాప్తినొందినచో జేయదగు మరియు దశాహమధ్యమున నీయుపక్రమింపబడిన కర్మ సమాప్తమగుచో నాదశాహశేషమునశుద్ధియగు ఆదశాహమతిక్రమించినపిదపమూడు మాసములకులోగానైనచో త్రిరాత్రాశౌచము ఆరుమాసములలోగానైనచో పక్షిణ్యాశౌచమగును సంవత్సరములోగానైనచో నేకరాత్రము సంవత్సరమునకు పిమ్మటయైనచో స్నానమాత్రమున శుద్ధుడగు యీయాశౌచాన్తమున తిలోదకమునుగూడజేసి శుద్ధుడగు.

శ్లో॥ ఆదిష్టీనోదకందద్యా దావ్రతస్యసమాపనాత్।
సమాప్తేతూదకంకృత్వా త్రిరాత్రమశుచిర్భవేత్॥

తా॥ కృచ్ఛ్రము బ్రహ్మచర్యము మొదలగు వ్రతములనవలంబించినవాడు ఆవ్రతమధ్యకాలమున జ్ఞాతిమృతినొందినచో తిలోదకమును ఈయజనదు వ్రతముసమాప్తమైన పిదప తిలోదకమునిచ్చి వెనుక జెప్పఁబడినరీతిని త్రిరాత్రాద్యాశౌచమునవలంబింపదగునని మనువు పలికె.

## ఇఁక నాశౌచాపవాదసంగ్రహము.

బ్రహ్మచారులకును యతులకును జ్ఞాతిమరణమున నాశౌచములేదు స్నానముమాత్రముచేయదగు పతితుడు మృతినొందినచో జ్ఞాతులగు గృహస్థులకుగూడ స్నానమాత్రమేయగును యజ్ఞములయందు దీక్షితులకును పత్నులకును దీక్షణీయ మొదలుకొని అవభృ

థము సమాప్తినొందువరకాశౌచములేదు. ఋత్విక్కులకు మంత్రివరణమైనది మొదలు కొని ప్రయోగము పరిసమాప్తినొందువరకు నాశౌచములేదు వివాహమునందు కన్యకును వరునకును నాందీముఖమైనది మొదలు శేషహోమాన్తముకల వివాహము సమాప్తినొందు వరకు నాశౌచములేదు వాస్తవముగానైనచో కంకణమోచనమువరకాశౌచములేదు. కన్యయొక్క తలిదండ్రులకు కన్యాదానపర్యన్తమే యాశౌచములేదు శ్రాద్ధమునందు కర్తకును భోక్తలకును పాదప్రక్షాలనానంతరమగు తృతీయనిమంత్రణమైనది మొదలు కొని ఆశ్రాద్ధముసమాప్తినొందువరకాశౌచములేదు. అపక్వపక్షమున పాకముపూర్తియైన నది మొదలుకొని యాశౌచములేదు లేక అపక్వపక్షమున కర్తకుపాకముపూర్తియైనది మొ దలును అనాపక్వపక్షమున సంకల్పము మొదలుకొనిన్ని ఆశౌచములేదు భోక్తకు తృతీయ నిమంత్రణమైనది మొదలుకొనియాశౌచములేదు కృచ్ఛ్రాదివ్రతములయందును ప్రాయశ్చిత్త ములయందును శాన్తిహోమములయందును దేవతాప్రతిష్ఠాదులయందును మంత్రపునశ్చర్యా దులయందును సంకల్పమైనది మొదలు కర్మసమాప్తినొందువరకాశౌచములేదు సీమంతము నందును పుంసవనమునందును నాందీముఖమైనది మొదలుకొని కర్మసమాప్తినొందువరకు వధూవరులకాశౌచములేదు జాతకర్మము నామకరణము మొదలుకొని స్నానాన్తముగల సంస్కారకర్మలయందు కుమారునకును ఆచార్యునకును నాందీముఖమైనది మొదలుకొని కర్మసమాప్తివరకాశౌచములేదు. ఇట్లే యెచ్చటెచ్చట నాందీముఖము విధింపబడినదో అచ్చటచ్చట ఆనాందీముఖమైనది మొదలుకొని ప్రధానకర్మసమాప్తినొందువరకు నాశౌ చములేదు. సప్తపాకయజ్ఞములయందు సంకల్పము మొదలుకొని కర్మసమాప్తివరకాశౌచము లేదు. ఈయన్నికర్మలయందును ఆశౌచమును వినినవెంటనే స్నానము జేయవలయు పిమ్మట కర్మసమాప్తినొందిన పిదప నాయాశౌచమును గ్రహింపవలయు ఆశౌచమధ్యకా లమున నాయుపక్రమింపబడిన కర్మసమాప్తమైనచో నాశౌచశేషమున నేశుద్ధియగు ఆశౌచ మతిక్రమించినచో జ్ఞాతివిషయమున మూడుమాసములలోగానైనచో త్రిరాత్రము ఆరు మాసములలోగానైనచో పక్షిణి. సంవత్సరములోగానైనచో నేకరాత్రము అటుపిమ్మ టయగుచో స్నానముజేసి తిలోదకమునొసర్చి శుద్ధుడగు మేనమామ మొదలగు వారివిష యమున త్రిరాత్రము మొదలగు ఆశౌచముయొక్క మధ్యకాలమునందు కర్మసమాప్తినొం దినచో నాత్రిరాత్రాదిశేషమున శుద్ధియగు త్రిరాత్రాదులతిక్రమించినచో స్నానమా త్రమగు సంధ్య జపము వైశ్వదేవము మొదలగు కర్మలజేయుచు మధ్యకాలమున జనన మరణములవినినచో స్నానముజేసి కర్మసమాప్తినొందించి పిమ్మట నాశౌచమునుగ్రహింప వలయు జపమధ్యమునందు మంత్రన్యాసముజేసికొనినవాడు లేచుటకు వీలులేదు కావున

స్నానములేదని తెలియదగును యజ్ఞమునందును వివాహాదులయందును తలిదండ్రుల మరణము సంభవించినచో కనిష్ఠునకు స్నానమాత్రము జ్యేష్ఠునకు దీక్షారూపమును శాలయందుంచి శ్మశానమునకుపోయి దహనముజేసి స్నానముజేసి తిరిగిశాలకువచ్చి వెనుకటివలె దీక్షారూపమునుధరించి దర్భపుంజీలములచే తిరిగి తనను పవిత్రునిజేసుకొని యజ్ఞశేషమును అవభృథములోగడవరకు నిర్వర్తించి సంచయనము మొదలుకొని దశాహకృత్యమును ఏకోద్దిష్టమును చేసి పిమ్మట జేయదగిన అవభృథాది యజ్ఞశేషమును పూరించి షోడశాది శ్రాద్ధములజేయవలెనని కొందరనిరి మరికొందరు అవభృథస్నానముజేసినపిదప దశాహకృత్యముజేయవలయునని అందు రెండవపక్షమే సమంజసమని తోచుచున్నది. కనిష్ఠుడు సమీపమందున్నచో సంచయనాదులు వానిచేజేయింపవలయు జ్యేష్ఠుడు దేశాన్తరమందున్నచో కనిష్ఠునకే జ్యేష్ఠన్యాయముపతించు వివాహమునందుగూడ నిట్లే యగుగాని శేషహోమాన్తముగల కర్మకలాపమునంతను నెరవేర్చి పిదప తలిదండ్రులకుత్తరక్రియలజేయదగును విశేషము ప్రధానహోమము మొదలుకొని శేషహోమమగులోగా దంపతులలోనే యొకరు మృతినొందినను అపుడే శేషహోమాంతముగల కర్మకలాము నంతను నిర్వర్తించి సంస్కారమునుచేయదగు పౌండరీకాది మహాయజ్ఞములయందు దశాహమధ్యకాలమునందు యజ్ఞముసమాప్తినొందనిచో సంచయనాది దశాహకృత్యమును ఏకోద్దిష్టమును కనిష్ఠునిచేజేయించి జ్యేష్ఠుడు షోడశాదిశ్రాద్ధములజేయవలయును ఏకపుత్రుడైనచో నేకోద్దిష్టమువరకు మరియొకనిచే జేయింపవలయును ఉపనయనమున నాందీముఖమైనపిమ్మటను గాయత్ర్యుపదేశమగుటకు లోగడను తలిదండ్రులమరణము సంభవించినచో తత్కాలము స్నానముజేసి శీఘ్రముగ గాయత్ర్యుపదేశముజేయించి శ్మశానమునకుబోయి దహనముజేసి తిరిగి గృహమునకువచ్చి కర్మసమాప్త్యనంతరమున సంచయనాదులజేయదగు వటువు కనిష్ఠుడైనచో స్నానమాత్రముజేయదగు శ్మశానమునకు పోగూడదు జ్యేష్ఠుడు దేశాన్తరమందున్నచో కనిష్ఠుడే వెనుకజెప్పంబడినరీతిని జ్యేష్ఠునివలెజేయదగు రాజులకు యుద్ధము మొదలగునవి సంభవించినపుడు ప్రయాణారంభమున జేయదగిన హోమాదులయందాశౌచములేదు పురోహితుడు మొదలగువారికిగూడ మరియొకరిచే జేయశక్యముగాని మంత్రాభిచారము మొదలగువానియందాశౌచములేదు మరియొక వైద్యుడు సమీపమునలేనిచో వైద్యునకు ధాతుపరీక్ష మొదలగువానియందాశౌచములేదు దాసీ దాసులకు మరియొకదాసిగాని దాసుడుగాని సమీపమునలేని సమయమున భార్యాపుత్రాదులచే జేయసాధ్యముకాని కార్యము సంభవించినపుడాశౌచములేదు ఇట్లే రాజ

భృత్యులకుగూడ మరియొకరు సాధింపలేని కార్యము సంభవించినపుడాశౌచములేదు. వ్యాధికలవాడు కర్మవిపాకము మొదలగువాని నాచరింపవలసివచ్చినపుడు కాలవిలంబమును సహింపనిపక్షమునందు మాత్రమాశౌచములేదు. మరణమునొందబోవువాడు ఉత్క్రాన్తి దానము జేయవలసినపుడా శౌచములేదు. దుర్భిక్షాదులయందు ప్రాణసంశయముకలిగినపుడు ప్రతిగ్రహాదులయందాశౌచములేదు. వైశ్యులకు కృషికాలమతిక్రమించుచుండగా గోమంగళాదులయందాశౌచములేదు రాజపురోహితులు వైద్యులు మొదలగువారికనన్యసాధ్యములగు అనగా నితరులెవరును జేయలేని పనులయందుమాత్రమాశౌచములేదు ఇతరులచే సాధింపదగినపనియందును నిత్యనైమిత్తిక కర్మలయందును ఆశౌచముకలదు శ్రాద్ధమునందు తృతీయనిమంత్రణమైన పిదపగాని లేక పాకముసిద్ధమైనపిదపగాని సంకల్పమైనపిదపగాని ఆశౌచము ప్రాప్తించినచో వెంటనేస్నానముజేసి స్వయముగనే శ్రాద్ధముజేయవలయు పక్వమయినయన్నమును ఆశౌచములేని మరియొకనిచే వడ్డింపజేయవలయును పాత్రయందున్నయన్నమును భోక్తయేయుదకమువ బ్రోక్షింపవలయు అన్నత్యాగమును కర్తయే స్పృశింపకజేయదగు భోక్తకు తృతీయనిమంత్రణము మొదలుకొనియే యాశౌచములేదు. ఆశౌచమధ్యకాలమునందేకాదశి సంభవమగుచో స్నానముజేసి హరినిగాని హరునిగాని మనసుచే ధ్యానించి నమస్కరించి యుపవాసమునుజేసి ద్వాదశీదినమునందు ప్రాతఃకాలమున స్నానముజేసి హరినిగాని హరునిగాని మనసుచేధ్యానించి నమస్కరించి పారణము జేయవలయు ఆవ్రతమే కామ్యమయినచో జేయదగదు కామ్యమయినను ఆశౌచమురాక పూర్వముపక్రమింపబడియున్నచో నవశ్యముగజేయదగును నిత్యములు కామ్యములునగు ఇతరవ్రతములయందుగూడ నిదియేన్యాయము ఆశౌచమధ్యకాలమున చన్ద్రగ్రహణముగాని సూర్యగ్రహణముగాని సంభవించినచో స్నానముజేసి శుద్ధమోక్షమగువరకు దానము శ్రాద్ధము జపము హోమము మొదలగునవియన్నియు జేయవగును శుద్ధమోక్షమయినపిదప మరల యాశౌచముకలుగును ఇది యాశౌచాపవాదనిర్ణయము.

## ఇక ఆశౌచనియమనిర్ణయము.

శ్లో॥ ప్రేతకార్యంచసంధ్యాంచ వినావైతానకర్మచ।
అన్యకర్మసువిప్రస్య నాధికారోస్తిసూతకే॥

తా॥ ప్రేతకార్యము సంధ్యావందనము అగ్నిహోత్రముతప్ప మిగిలిన కర్మలయందాశౌచవంతునకధికారములేదు.

శ్లో॥ వైతానంప్రేతకార్యంచ మంత్రోచ్చారణపూర్వకం।
స్నానంకృత్వార్ద్రవస్త్రస్సన్ కుర్యాదితివినిశ్చయః॥

తా॥ అగ్నిహోత్రమును ప్రేతకార్యమును స్నానముజేసి తడివస్త్రములుకలవాడై మంత్రోచ్చారణపూర్వముగనే చేయవలయు ఇచట ప్రేతకర్మమున మంత్రోచ్చారణము దహనసంచయనాదివిషయము నవశ్రాద్ధాదులయందు వేదమంత్రములేదు.

శ్లో॥ సంధ్యామానసమంత్రాస్స్యాత్ప్రాణాయామస్త్వమంత్రికః।
అర్ఘ్యంవాచికమంత్రంస్యా దితిసంధ్యావిధిర్భవేత్ ॥

తా॥ మార్జనాదికమునందు మంత్రముల మనసుచే స్మరింపవలయు అర్ఘ్యమంత్రమును వాక్కుచే బాగుగ నుచ్చరింపదగు ప్రాణాయామమంత్రముల మనసుచేకూడ స్మరింపదగదు.

శ్లో॥ అగ్నావౌపాసనేహోమ మన్యగోత్రేణకారయేత్ ॥

తా॥ ఔపాసనాగ్నియందితరగోత్రునిచే హోమముజేయింపవలయు అనగా నాశౌచములేని మరియొకనిచేనని భావము.

శ్లో॥ దేవతాన్తరనామాని సూతకేనైవకీర్తయేత్।
పరమేశ్వరనామాని సమ్యగేవతుకీర్తయేత్ ॥

తా॥ అగ్నిమొదలగు దేవతాన్తములయొక్క నామములను సూతకమునందుచ్చరింపజనదు పరమేశ్వరుని నామములనే బాగుగ కీర్తింపవలయును.

శ్లో॥ అధశ్శాయీబ్రహ్మచారీ ప్రతిగ్రహవివర్జితః।
దేవాలయప్రవేశంచ తాంబూలంచవివర్జయేత్ ॥
అన్యోన్యంనస్పృశేరంశ్చ సూతకస్యాసమాపనాత్ ।
సపిండావాసపిండావే త్యేవంశాస్త్రవినిర్ణయః ॥
సపిండానాంతుసంస్పర్శే సచేలస్నానమాత్రకం।
అసపిండస్పర్శనేతు ప్రాయశ్చిత్తముదీరితం॥

తా॥ సూతకవంతుండు అధశ్శయనము బ్రహ్మచర్యము జేయదగు ప్రతిగ్రహమును దేవాలయప్రవేశమును తాంబూలమును అన్యోన్యస్పర్శనమును సూతకదినములుగడచువరకును వర్జింపదగును సూతకమునందు సపిండులుగాని ఆశౌచవంతులైన యసపిండులుగాని స్పృశింపజనదు అందు సపిండులు స్పృశించినచో సచేలస్నానముచేయవలయును,

అసపిండుడైన యాశౌచవంతుని స్పృశించినచో స్నానము మొదలగు ప్రాయశ్చిత్తము ప్రపవాశౌచప్రకరమున మాచే బ్రతిపాదింపబడినది.

శ్లో॥ ఆశౌచాంతేతుసంప్రాప్తే గోమయాదివిలేపనైః।
గృహశుద్ధిర్విధాతవ్యా పుణ్యాహంచైవవాచయేత్ ॥

తా॥ ఆశౌచమతిక్రమింపగనే గోమయాదులయొక్క పూతలచే గృహమును శుద్ధిజేసి పుణ్యాహముజేయింపవలయును ఇఁక స్మృతివచనములు.

శ్లో॥ దానంప్రతిగ్రహోహోమః స్వాధ్యాయఃపితృకర్మచ।
ప్రేతపిండక్రియావర్జ మాశౌచేవినివర్తతే ॥

తా॥ ప్రేతనుద్దేశించి చేయదగు పిండదానము మొదలగు క్రియలుతక్క మిగిలినదానము ప్రతిగ్రహము హోమము స్వాధ్యాయము పితృకర్మము మొదలగుకర్మలన్నియు నాశౌచమున నివర్తించునని శంఖునిచే జెప్పఁబడెను మరియు.

శ్లో॥ సన్ధ్యాంపంచమహాయజ్ఞాన్ నైత్యకంస్మృతికర్మచ।
తన్మధ్యేహాపయేదేవ మాశౌచాన్తేపునఃక్రియా ॥

తా॥ ఆశౌచము మధ్యకాలమునందు సంధ్యావన్దనము పంచమహాయజ్ఞములు నిత్యమువాచరింపదగిన స్మార్తకర్మలు వీనినివదలివేయుదగు ఆశౌచాన్తమున తిరిగియనుష్ఠింపదగునని జాబాలిపలికెను ఇచట సంధ్యను నిషేధించుట వాచికసంధ్యావిషయము. అంతియకాని అన్నివిధములచేతను సంధ్యనువర్జింపదగుననుటకాదు అదియెట్లన.

శ్లో॥ సంధ్యామిష్టించరుంహోమం యావజ్జీవంసమాచరేత్।
నత్యజేత్సూతకేవాపి త్యజన్గచ్ఛేదధోద్విజః ॥
సూతకేమృతకేవాపి సంధ్యాకర్మనసంత్యజేత్ ।
మనసోచ్చారయేన్మంత్రాన్ ప్రాణాయామమృతేద్విజః ॥

తా॥ సంధ్యను దర్శపూర్ణమాసలను స్థాలీపాకమును అగ్నిహోత్రమును యావజ్జీవము నాచరింపదగు సూతకమునందుగూడ నాచరింపదగుగాని విడువదగదు అట్లువిడిచినచో నాబ్రాహ్మణుఁడు నరకమునొందు సూతకమునందును మృతమునందును సంధ్యావందనమును విడువదగదు మనసుచే బ్రాణాయామముదక్క మిగిలిన మంత్రముల నుచ్చరింపదగునని పులస్త్యునిచే జెప్పఁబడెను. ఇచట ఇష్టిచరువులగ్రహించుట ఇష్టిస్థాలీపాకములకుగూడ లోపముసంభవింపదు అగ్నిహోత్రమునకిక నేమిచెప్పవలయునని కైముతిక

న్యాయముచే అగ్నిహోత్రమున కావశ్యకత్వమును ప్రతిపాదించుటకేగాని ఆయిష్టిచరువు లచేయదగునని విధించుకొరకుకాదని కొందరనిరి.

సూ॥ సూతకేసావిత్ర్యాంజలింప్రక్షిప్యప్రదక్షిణీకృత్యసూర్యంధ్యా యన్నమస్కుర్యాత్ ॥

తా॥ సూతకమునందు గాయత్రీమంత్రముచే నుదకాంజలినుంచి ప్రదక్షిణము జేసి సూర్యునిధ్యానించుచు నమస్కరింవదగునని వైఖానసిపలికె.

శ్లో॥ సూతకేమృతకేకుర్యాత్ప్రాణాయామమమంత్రకం ।
తథామార్జనమంత్రాంస్తు మనసోచ్చార్యమార్జయేత్ ॥
గాయత్రీంసమ్యగుచ్చార్య సూర్యాయార్ఘ్యంనివేదయేత్ ।
మార్జనంతునవాకార్య ముపస్థానంతునైవహి॥

తా॥ జాతాశౌచమునందుగాని మృతాశౌచమునందుగాని ప్రాణాయామము నమంత్రకముగ జేయవలయు ఆపోహిష్ఠాదిమంత్రముల మనసుచే నుచ్చరించి మార్జనముజే సికొనవలయును గాయత్రిని బాగుగనుచ్చరించి సూర్యునకర్ఘ్యమునివ్వవలయు ఒకపక్ష మున మార్జనమునువర్జింపదగు ఉపస్థానమునుమాత్రము వర్జింపదగునని భరద్వాజుడు పలికెను ఇచటనుపస్థానమనగా సూర్యాద్యుపస్థానము గాయత్రీ జపవిషయమునందు వ్యాసుడొక విశేషమును చెప్పెను.

శ్లో॥ ప్రక్షిపేత్సూతకేప్యర్ఘ్యం గాయత్రీంసమ్యగుచ్చరన్ ।
దత్వాప్రదక్షిణంకుర్యా త్సూర్యంధ్యాయేద్ద్విజోత్తమః ॥
దశకృత్వస్తుగాయత్రీం మనసైవాశుచిఃస్మరేత్ ॥

తా॥ సూతకమునందు గాయత్రీమంత్రమును బాగుగనుచ్చరించుచు అర్ఘ్యము నుంచవలయు ఇట్లర్ఘ్యప్రదానముజేసి ప్రదక్షిణముజేసి సూర్యునిధ్యానింపవలయు గాయ త్రీమంత్రమును పదిపర్యాయములు మనసుచే స్మరింపవలయును మరియు,

శ్లో॥ ఆపన్నశ్చాశుచిఃకాలే తిష్ఠన్నపిజపేద్దశ ॥

తా॥ ఆపన్నుడును ఆశౌచవంతుడును సకాలముననిలుచుండి పదిపర్యాయములైనను జపింపవలయునని ఆశ్వలాయనుడుపలికెను జపాంతమునందుత్తమేశిఖరేజాతే అనుమంత్ర మును మనసుచే స్మరింపవలయు మరియు,

సూ॥ ఆశౌచేహోమదాన ప్రతిగ్రహస్వాధ్యాయానివర్తంతేనాశౌ
చేకస్యచిదశ్నీయాత్ ॥

తా॥ ఆశౌచమునందు హోమము దానము ప్రతిగ్రహము స్వాధ్యాయము నివర్తించు ఆశౌచమునందు సపిండవ్యతిరిక్తుఁడగువానియన్నమును భుజింపజనదని విష్ణువుపలికె ఇచటహోమమనగా వైశ్వదేవము ఔపాసనము ఇతరగోత్రునిచే జేయింపదగును.

శ్లో॥ విప్రోదశాహమాసీత వైశ్వదేవవివర్జితః ॥

తా॥ జ్ఞాతి మరణముసంభవించినపుడు బ్రాహ్మణుఁడు పది దినములు వైశ్వదేవమును విడచియుండవలయునని సంవర్తుఁడుపలికె.

శ్లో॥ అగ్నిహోత్రేతుహోమార్థం శుద్ధిస్తాత్కాలికీస్మృతా।
పంచయజ్ఞాన్నకుర్వీత హ్యాశుద్ధఃపునరేవసః ॥

తా॥ అగ్నిహోత్రహోమముకొరకు తత్కాలమునందుమాత్రము శుద్ధిగలుగు మరియు నాశౌచవంతుఁడు పంచమహాయజ్ఞముల చేయజనదని గోభిలుఁడుపలికె.

శ్లో॥ దర్శంచపూర్ణమాసంచ కర్మవైతానికంచయత్ ।
సూతకేపిత్యజేన్మోహాత్ ప్రాయశ్చిత్తీయతేహిసః ॥

తా॥ సూతకమునందుగూడ దర్శపూర్ణమాసలను తదితరములగు శ్రౌతకర్మలను అజ్ఞానమువలన విడచినచో నతఁడు యథోక్తప్రాయశ్చిత్తము నాచరింపవలయునని మనువుపలికె.

శ్లో॥ సూతకేతుసముత్పన్నే స్మార్తకర్మకథంభవేత్ ।
పిండయజ్ఞంచరుంహోమ మన్యగోత్రేణకారయేత్ ॥

తా॥ సూతకముసంభవించినచో స్మార్తౌపాసనసాధ్యములగు పిండయజ్ఞము చెరువు హోమము వీట్లనన్యగోత్రికునిచే జేయింపనగు అన్యగోత్రికునిచే నవియనుష్ఠింపబడు సమయమున యజమానుఁడుస్నానముజేసి తడివస్త్రముకలవాఁడై తానే ఆయాదేవతల నుద్దేశించి త్యాగముజేయవలయు। ఆయుద్దేశత్యాగములు కర్తచేతనే జేయఁదగినవియని జాతుకర్ణ్యవచనమునకు స్మృత్యర్థసారము మొదలగువానియందు వ్యాఖ్యానముజేయఁబడెం.

శ్లో॥ సూతకేమృతకేచైవ త్వశక్తౌశ్రాద్ధభోజనే ।
ప్రవాసాదినిమిత్తేషు హావయేన్నతుహాపయేత్ ॥

తా॥ సూతకమునందును మృతకమునందును శక్తిలేనపుడును శ్రాద్ధభోజనము జేసినపుడును పరదేశగమనము మొదలగు నిమిత్తములయందును హోమమితరులచే జేయిం పనగుగాని విడువవదగదని బృహస్పతి వచియించె మరియు,

శ్లో॥ జన్మహాన్యోర్వితానస్య కర్మత్యాగోనవిద్యతే ।
శాలాగ్నౌకేవలేహోమః కార్యఏవాన్యగోత్రజైః॥

తా॥ జాతాశౌచమునందును మృతాశౌచమునందును శ్రౌతకర్మమును త్యజింప జనదు మరియొక యగ్నిసమీపమునందులేని శాలాగ్నియందు హోమముస్వయముగనే యొనర్చి ఔపాసనమన్యగోత్రికునిచే జేయింపదగునని ఆబృహస్పతియే పలికె ఇచట స్వయముగాజేయుట మరియొకరులేనిపక్షమునని తెలియదగును.

శ్లో॥ అగ్నిహోత్రిహవంకుర్యా దన్యాభావేస్వయంతువా ।
కుర్యాత్స్నాత్వార్ద్రవాసాస్తు తస్మాచ్ఛాలావృతేఽశుచిః॥

తా॥ ఆశౌచమునందు మరియొకరులేనిచో స్నానముజేసి ఆర్ద్రవస్త్రముకలవాడై తానే యగ్నిహోత్రిహోమముజేయనగు ఆకర్మకాలమునందుదక్క నితరకాలమందా శౌచమని తెలియదగునని కణ్వమహాముని పలికె.

సూ॥ దేవతాభిధానంచాప్రయత ఇతివర్జయేదితిపరికృతం ॥

తా॥ ఆశౌచముకలవాడు దేవతానామము నుచ్చరింపవగదని యాపస్తంబుడు పలికె ధ్యానించినచో దోషములేదని,

శ్రు॥ నహ్యస్తిమనస ఉపఘాతోఽన్తరేణ మలవద్వాససీం సూతికాం శవస్పృష్టకంచ॥

తా॥ రజస్వలయగుస్త్రీనిగాని సూతికనుగాని శవమునకు దహనసంస్కారము జేసినవానిగాని స్పృశించినపుడుదక్క తదితరసమయముల మనసునకుమాత్రము ఆశౌచ ములేదని వేదమునజెప్పబడె మరియు,

శ్లో॥ మనోహిశుద్ధమన్యత్ర సూతోదక్యాశవస్పృశః ॥

తా॥ సూతకవంతుని రజస్వలయగుస్త్రీని శవమును స్పృశించినపుడుదక్క తది తరకాలములయందు మనసు శుద్ధమేయగునని భరద్వాజుడుపలికె. పరమేశ్వరునినామ మును కీర్తించుటయందును ధ్యానించుటయందున దోషములేదు.

సూ॥ ఆశౌచేహోమదాన ప్రతిగ్రహస్వాధ్యాయానివర్తంతేనాశౌచేకస్యచిదశ్నీయాత్ ॥

తా॥ ఆశౌచమునందు హోమము దానము ప్రతిగ్రహము స్వాధ్యాయము నివర్తించు ఆశౌచమునందు సపిండవ్యతిరిక్తుడగువానియన్నమును భుజింపజనదని విష్ణువుపలికె ఇచటహోమమనగా వైశ్వదేవము ఔపాసనము ఇతరగోత్రునిచేజేయింపదగును.

శ్లో॥ విప్రోదశాహమాసీత వైశ్వదేవవివర్జితః ॥

తా॥ జ్ఞాతి మరణముసంభవించినపుడు బ్రాహ్మణుడు పది దినములు వైశ్వదేవమునువిడచియుండవలయునని సంవర్తుడుపలికె.

శ్లో॥ అగ్నిహోత్రేతుహోమార్థం శుద్ధిస్తాత్కాలికీస్మృతా।
పంచయజ్ఞాన్నకుర్వీత హ్యశుద్ధఃపునరేవసః ॥

తా॥ అగ్నిహోత్రహోమముకొరకు తత్కాలమునందుమాత్రము శుద్ధిగలుగు మరియు నాశౌచవంతుడు పంచమహాయజ్ఞముల జేయజనదని గోబిలుడుపలికె.

శ్లో॥ దర్శంచపూర్ణమాసంచ కర్మవైతానికంచయత్ ।
సూతకేపిత్యజేన్మోహా త్ప్రాయశ్చిత్తీయతేహిసః ॥

తా॥ సూతకమునందుగూడ దర్శపూర్ణమాసలను తదితరములగు శ్రౌతకర్మలను అజ్ఞానమువలన విడచినచో నతడు యథోక్తప్రాయశ్చిత్తము నాచరింపవలయునని మనువుపలికె.

శ్లో॥ సూతకేతుసముత్పన్నే స్మార్తకర్మకథంభవేత్ ।
పిండయజ్ఞంచరుంహోమ మన్యగోత్రేణకారయేత్ ॥

తా॥ సూతకముసంభవించినచో స్మార్తౌపాసనసాధ్యములగు పిండయజ్ఞము చెరువు హోమము వీట్లనన్యగోత్రికునిచే జేయింపనగు అన్యగోత్రికునిచే నవియనుష్ఠింపబడు సమయమున యజమానుడుస్నానముజేసి తడివస్త్రముకలవాడై తానే ఆయాదేవతుల నుద్దేశించి త్యాగముజేయవలయు ।ఆయుద్దేశత్యాగములు కర్తచేతనే జేయదగినవియని జాతుకర్ణ్యవచనమునకు స్మృత్యర్థసారము మొదలగువానియందు వ్యాఖ్యానముజేయబడె.

శ్లో॥ సూతకేమృతకేచైవ త్వశక్తౌశ్రాద్ధభోజనే ।
ప్రవాసాదినిమిత్తేషు హావయేన్నతుహాపయేత్ ॥

తా॥ సూతకమునందును మృతకమునందును శక్తిలేనపుడును శ్రాద్ధభోజనము జేసినపుడును పరదేశగమనము మొదలగు నిమిత్తములయందును హోమమితరులచే జేయింపనగుగాని విడువదగదని బృహస్పతి వచియించె మరియు,

శ్లో॥ జన్మహాన్యోర్వితానస్య కర్మత్యాగోనవిద్యతే ।
శాలాగ్నౌ కేవలేహోమః కార్యఏవాన్యగోత్రజైః॥

తా॥ జాతాశౌచమునందును మృతాశౌచమునందును శ్రౌతకర్మమును త్యజింపజనదు మరియొక యగ్నిసమీపమునందులేని శాలాగ్నియందు హోమముస్వయముగనే యొనర్చి ఔపాసనమన్యగోత్రికునిచే జేయింపదగునని యబ్బృహస్పతియే పలికె ఇచట స్వయముగాజేయుట మరియొకరులేనిపక్షమునని తెలియదగును.

శ్లో॥ అగ్నిహోత్రిహవంకుర్యా దన్యాభావేస్వయంతువా ।
కుర్యాత్స్నాత్వార్ద్రివాసాస్తు తస్మాత్కాలాదృతేఽశుచిః॥

తా॥ ఆశౌచమునందు మరియొకరులేనిచో స్నానముజేసి ఆర్ద్రవస్త్రముకలవాడై తానే యగ్నిహోత్రిహోమముజేయనగు ఆకర్మకాలమునందుదక్క నితరకాలమందాశౌచమని తెలియదగునని కణ్వమహాముని పలికె.

సూ॥ దేవతాభిధానంచాప్రయత ఇతివర్జయేదితిప్రకృతం ॥

తా॥ ఆశౌచముకలవాడు దేవతానామము నుచ్చరింపదగదని యాపస్తంబుడు పలికె ధ్యానించినచో దోషములేదని,

శ్రు॥ నహ్యస్తిమనస ఉపఘాతోఽన్తరేణ మలవద్వాససీం సూతికాం శవస్పృష్టకంచ॥

తా॥ రజస్వలయగుస్త్రీనిగాని సూతికనుగాని శవమునకు దహనసంస్కారము జేసినవానిగాని స్పృశించినపుడుదక్క తదితరసమయముల మనసునకుమాత్రము ఆశౌచములేదని వేదమునజెప్పబడె మరియు,

శ్లో॥ మనోహిశుద్ధమన్యత్ర సూతోదక్యాశవస్పృశః ॥

తా॥ సూతకవంతుని రజస్వలయగుస్త్రీని శవమును స్పృశించినపుడుదక్క తదితరకాలములయందు మనసు శుద్ధమేయగునని భరద్వాజుడుపలికె. పరమేశ్వరునినామమును కీర్తించుటయందును ధ్యానించుటయందున దోషములేదు.

శ్లో॥ దేవతాంతరనామాని నాశుచిఃపరికీర్తయేత్ ।
నారాయణస్యనామాని సర్వదాపరికీర్తయేత్ ॥

తా॥ అగ్ని మొదలగు ఇతరదేవతలయొక్క నామముల నూతికమున గీర్తింపదగదు నారాయణునినామములమాత్ర మెల్లప్పుడు కీర్తింపదగు పరమేశ్వరునకు వందనము ప్రదక్షిణము మొదలగునవి జేయుజనదు.

శ్లో॥ ఉచ్ఛిష్టేచైవచాశౌచే భగవద్వందనాదికం॥

తా॥ ఉచ్ఛిష్టుడున్నూ ఆశౌచముగలవాడును భగవంతునకు వందనాదులజేయుటఅని యివిమొదలగుముప్పదిరెండు అపచారముల పరిగణించి.

శ్లో॥ మందిరంనప్రవేష్టవ్యం ప్రవిష్టస్యఫలంశ్రృణు ।
సార్గాలీంయోనిమావిశ్య జన్మానినవపంచచ ॥
భవిష్యతివరారోహే వ్యాధఃక్రూరోతినిష్ఠురః ॥

తా॥ అట్టివాడు భగవదాలయమునుగూడ ప్రవేశింపజనదనియు నట్లుప్రవేశించి నచో పదునాల్గుపర్యాయములు నక్కగా జన్మించి పిదప క్రూరుడు కఠినుడునగు కిరాతుడుగా జన్మించునని వరాహపురాణమున జెప్పబడె.

సూ॥ అప్రయత్నేననాభివాదంతథా ప్రయతాయాప్రియతశ్చసప్రత్యభివదేత్ ॥

తా॥ ఆశౌచముకలవాడు పవిత్రుడగువానికి నమస్కారము జేయజనదు అట్లుచేసినచో దానినాతడంగీకరింపజనదని యాపస్తంబుడుపలికె.

సూ॥ నోదకుంభహస్తోభివాదయేన్న పుష్పహస్తోనాశుచిః ॥

తా॥ ఉదకకుంభము హస్తమునందు ధరించియు పుష్పముల హస్తమునందు ధరించియు జననాద్యాశౌచము గలిగియుండియు బ్రాహ్మణాదులకు నమస్కరింపజనదని బోధాయనుడు పలికె ఇక బ్రహ్మచర్యాదుల విషయమునందు,

సూ॥ అథశ్శయ్యాసనాబ్రహ్మచారిణస్సర్వేసమాసీరన్ ॥

తా॥ ఆశౌచముగలవారందరును బ్రహ్మచర్యము నవలంబించి అథశ్శయనము క్రిందనే కూర్చుండుట మొదలగు నీమముల నాచరింపదగునని గౌతముడుపలికె.

శ్లో॥ కృతలబ్ధాశనాశ్చైవ భవేయుస్సుసమాహితాః।
నచైవమాంసమశ్నీయుః వర్జయేయుశ్చనయోషితః॥

తా॥ ఆశౌచముకలవారు అయాచితముగా సంభవించిన పదార్థమును భుజించుచు మిక్కిలి సమాహితమనస్కులై యుండవలయు మాంసమును భుజింపజనదు స్త్రీసంగమము జేయదగదని మార్కండేయుఁడుపలికె భోజనముగూడ క్షారలవణవర్జముగ జేయవలయు నదియెట్లన.

శ్లో॥ అక్షారలవణాన్నాస్స్యుః నిమజ్జేయుశ్చతేఽన్వహం।
మాంసాశనంచనాశ్నీయుః శయీరంశ్చపృథక్ క్షితౌ॥

తా॥ ఆశౌచముగలవారు క్షారలవణరహితమగు యన్నమెనుభుజించుచు ప్రతిదినము స్నానముజేయుచు మాంసమునువర్జించి భూమియందు వేరువేరుగా పరుండవలయు నని మనువుపలికె మరియు,

శ్లో॥ కృతలబ్ధాశనాభూమౌ స్వపేయుస్తేపృథక్పృథక్॥

తా॥ ఆశౌచముకలవారు అయాచితముగ లభించిన పక్వాన్నమును భుజించు భూమిమీద వేరువేరుగ పరుండవలయునని యాజ్ఞవల్క్యుడుపలికె వసిష్ఠుడుమూడు రాత్రులుమాత్రమే అయాచితముగ లభించిన పక్వాన్నమును భుజించిగాని యుపవసించి గాని యుండదగునని చెప్పె.

సూ॥ అథప్రస్తరే త్ర్యహమనశ్నంత ఆసీరన్ కృతేనోత్పన్నేనవా వర్తేరన్॥

తా॥ ఆశౌచవంతులు మూడుదినములు భోజనమువర్జించి తృణమయమైన చాప యందు కూర్చుండనగులేక అయాచితముగ లభించిన పక్వాన్నమును భుజింపనగు ఆశ్వలాయనుఁడీనియమ మొకదినమేనని వచించె.

సూ॥ నైతస్యాం రాత్ర్యామన్నంపచేరన్ కృతేనోప లబ్ధేనవా వర్తేరన్॥

తా॥ అయాశౌచము ప్రాప్తించిన దినమున యన్నమును వండజనదు అయాచితముగ లభించిన పక్వాన్నమును భుజింపనగు మరియు,

శ్లో॥ నాశ్నీయుస్తద్దినేసర్వే చౌరసాద్యాస్సపిండకాః।
దశరాత్రంభవన్త్యేతే లవణక్షారవర్జితాః॥
తైలతాంబూలహీనాశ్చ ఏకభుక్తాజితేంద్రియాః॥

తా॥ ఆమృతదినమున ఔరసుడు మొదలగు సపిండులందరును భుజింపగూడదు పిమ్మట పదిదినములవరకు లవణక్షారములు వర్జించి తైలతాంబూలములు విడచి యేకభుక్తము నే యాచరించుచు జితేంద్రియులైయుండదగునని యంగిరసుడుపలికె కాన ఏకరాత్రముగాని త్రిరాత్రముగాని ఉపవాసముగాని అయాచితలబ్ధమగు పక్వాన్నమును భుజించుచుటగాని జేయదగుపిమ్మట దశరాత్రము క్షారలవణముల వర్జించి తనగృహమున పక్వమైనయన్నమునే భుజింపనగు ఆశ్వలాయనుడు క్షారలవణవర్జనము త్రిరాత్రమే యనిజెప్పె.

సూ॥ త్రిరాత్రమక్షార లవణాశినస్స్యు ద్వాదశరాత్రంవా మహాగురుషు॥

తా॥ మూడుదినములుమాత్రము క్షారలవములవర్జించి భుజింపనగు లేక మహాగురువులవిషయమై పండ్రెండురాత్రులీక్షారలవణముల వర్జింపదగు కాన త్రిరాత్రముగాని దశరాత్రముగాని క్షారలవణములవర్జింపదగు అదియును పగలొకపర్యాయమేయగు. రాత్రియందులేదు యెట్లన,

శ్లో॥ దివాచభుక్తంభోక్తవ్యం నమాంసంమనుజర్షభ॥

తా॥ ఓమనుజశ్రేష్ఠుడా ఆశౌచముగలవాడు పగలుమాత్రమే మాంసవర్జితముగ భుజింపదగునని విష్ణుపురాణమున జెప్పఁబడియె మరియు జ్ఞాతులందరు నొకచోటకలసి భుజింపదగు నదియెట్లన,

శ్లో॥ ప్రథమేహ్నితృతీయేచ పంచమేసప్తమేతథా।
జ్ఞాతిభిస్సహభోక్తవ్య మేతత్ప్రేతేషుదుర్లభం॥

తా॥ ప్రథమదినమందును మూడు ఐదు ఏడు దినములయందును జ్ఞాతులందరు గూడి భుజించినచో మృతినొందినవానికి మిక్కిలి ప్రియమని మరీచిపలికె మరియు,

శ్లో॥ సంతృప్తేషుసపిండేషు భోజనైర్వివమేహని।
నిత్యంవాప్రాగ్దశాదినా త్ప్రేతశ్చాతీవతృప్యతి॥
తేషాంతృప్త్యాకథాలాపై స్సహైకత్రైవభోజనాత్।
ఆశుతృప్యంతితత్ప్రేత స్తత్ప్రేప్స్యాతిదుర్లభం॥

తా॥ ఒకటి మూడు మొదలగు బేసిదినములయందుగాని దశాహమునకులోగడ ప్రతిదినముగాని భోజనాదులుచే సపిండులు తృప్తినొందుటవలన ప్రేతమిక్కిలి తృప్తి

నొందు ఆసపిండులు సంతోషముగా మాటలాడుకొనుచు నొకతావున భుజించి తృప్తినొం దుటవలన ప్రేత శీఘ్రముగాతృప్తినొందు యిది ప్రేతకు మిక్కిలిదుర్లభమని యాశ్వలా యనుడు పలికె ఆశౌచనియమములన్నియు శావాశౌచముననుమాత్రమే యాచరింపదగు జాతాశౌచమునందు యిన్నినియమములులేవు ఇక వేదున నిత్యనైమిత్తికకర్మల పరిత్యజించుట బ్రహ్మచర్యము దానప్రతిగ్రహాదుల వర్జించుటమాత్రమేయగు తాంబూలాదులను వర్జిం పనక్కరలేదు ఆతాంబూలవర్జనము శావాశౌచప్రకరణమునందుకలదు "అధశ్శయ్యా సనాబ్రహ్మచారిణః" అను గౌతమవచనము మొదలుకొని యెన్నివచనములు కలవో అవన్నియు శావాశౌచప్రకరణమునందుకలవు మిగిలినవన్నియు నాశౌచసాధారణములే నని తెలియఁదగు.



—♦ ఇక ఆశౌచాంతకర్తవ్యనిర్ణయము. ♦—

ఆశౌచాన్తమున జేయదగిన కృత్యముల సంవర్తుడు నెప్పెను.

శ్లో॥ ఆశౌచేనిర్గతేకుర్యాద్గృహమార్జనలేపనే।
సవాసాజలమాప్లుత్య శుద్ధఃపుణ్యాహవాచనైః॥

తా॥ ఆశౌచమతిక్రమించినపిదప గృహమునుదకముచే ప్రోక్షించి అలికి సచేల స్నానముజేసి పుణ్యాహముజేసి శుద్ధుఁడగును.

శ్లో॥ ఆశౌచాంతేతుకర్తవ్యం బ్రాహ్మణైరభిషేచనం।
ఋగ్భిర్యజుర్భిశ్ఛందోగైరబ్లింగైఃపావమానికైః॥
ఆశిషశ్చగృహీత్వాథ శ్రాద్ధకర్మసమాచరేత్॥

తా॥ ఆశౌచాన్తమునందు ఋగ్యజుస్సామవేదములయందుజెప్పఁబడిన అబ్దేవతల యొక్క చిహ్నముకలపవమానమంత్రములచే బ్రాహ్మణులచే నభిషేకింపబడినవాడై ఆబ్రాహ్మణులవలన నాశీర్వాదముల గ్రహించి పిమ్మట నేకోద్దిష్టముఁ జేయదగునని వసిష్ఠునిచే జెప్పఁబడెను.

శ్లో॥ పూజ్యగంధపుష్పాద్యైర్బ్రాహ్మణాన్ స్వస్తివాచయేత్।
ధర్మకర్మణిసంకల్పే సంగ్రామేఽద్భుతదర్శనే॥

యజ్ఞార్థేచప్రతిష్ఠాదౌ సర్వసంస్కారకర్మసు।
శుద్ధికామస్తుష్టికామ శ్రేయస్కామశ్చనిత్యశః ॥

తా॥ ధర్మకార్యమునందును యుద్ధమునందును అద్భుతదర్శనమునందును యజ్ఞవిషయమునందును ప్రతిష్ఠాదులయందును సంస్కారకర్మలన్నిటియందును సంకల్పకాలమునందును శుద్ధిని తుష్టిని శ్రేయమును కోరినవాడును బ్రాహ్మణులను గంధపుష్పాదులచే పూజించి స్వస్తివాచనము జేయింపవలయునని వ్యాసుఁడు పలికె కాన యాశౌచాంతమునందు శుద్ధికాముఁడగువాఁడు పుణ్యాహవచనము జేయదగును క్షత్రియవైశ్యశూద్రులయొక్క పద్ధతివేరని తెలియఁదగును.

శ్లో॥ పుణ్యాహవాచనం చైవం బ్రాహ్మణస్యవిధీయతే।
ఏతదేవత్రిరోంకారం కుర్యాత్ క్షత్రియవైశ్యయోః॥
మంత్రవర్జంతుశూద్రాణాం కుర్యాత్పుణ్యాహమస్త్వితి।
వచనేనైవవిప్రస్య వృద్ధిరస్తితివాచకం ॥

తా॥ ఇట్లు పుణ్యాహవచనము బ్రాహ్మణునకు విధింపబడినది దీనినే క్షత్రియవైశ్యులకు మూడుపర్యాయములోంకారము నుచ్చరింపుచు జేయదగు అనఁగా "ఓంపుణ్యాహమస్తు" అని మూడుపర్యాయములనదగునని భావము శూద్రులకు మంత్రవర్జముగ "పుణ్యాహమస్తు" అనిమూడుపర్యాయములనఁదగును ప్రణవమునుగూడ వర్జింపదగు వైదికమంత్రము లేకపోయినను బ్రాహ్మణువచనముజేతనే మున్ముందటికి శుద్ధివృద్ధ్యాదులు కలుగు ఈవిషయమున సంశయమక్కరలేదని చెప్పుటకై మున్మ్మరనిచెప్పఁబడెను. పుణ్యాహవాచనానంతరమున నేకాదశ ద్వాదశాహములజేయుదగు కృత్యములజేయదగు.

శ్లో॥ సునిర్వృత్తాక్రియాచేత్స్యాద్దాశౌచనియమైస్సహ।
ప్రాప్నువంతిపితృత్వంహి ప్రయాతాఃకర్తృబాంధవాః॥

తా॥ ఆశౌచనియములతోగూడ ఔర్ధ్వదైహికక్రియ సక్రమముగ జరుపబడి నచో మృతినొందినకర్తయొక్క తల్లి తండ్రి మొదలగు బంధువులు పితృత్వమును అనఁగా తమసుకృతఫలమునసనుభవింపదగు యోగ్యతను లేక ఆసుకృతఫలమునసనుభవింప ననుకూలమగు దేహమును పొందుదురు అట్లు పితృభావమునొందిన మాతాపిత్రాదులు స్వకీయ

మగు పుణ్యఫలమును పుత్రాదులచే దినదినమందును ఆయాసంక్రాన్త్యాది పుణ్యకాలముల యందును ఆయాకర్మ విశేషములయందును జేయఁబడుచున్న దానశ్రాద్ధాదుల నేర్పడిన సుకృతఫలమును చిరకాలమనుభవించుచున్నవారై ఎల్లప్పుడును పుత్రుడు మొదలగువార లకు వంశాభివృద్ధిని అభ్యుదయాతిశయమును ప్రార్థించుచుందురు. వారియనుగ్రహమున నితడు దీర్ఘాయుర్దాయము సత్సంతానము శ్రేయస్సుకలవాడగును అని చెప్పుచున్నాడు.

## —♦ పితృదేవతానుగ్రహమూలకశ్రేయఃప్రాప్తి. ♦—

శ్లో॥ పితౄణాంచప్రసాదేన కర్తుర్వంశో౽భివర్ధతే।
శ్రేయసాంచాభివృద్ధిస్స్యా ద్భూయసాముత్తరోత్తరం ॥

తా॥ పితృదేవతలయొక్క అనుగ్రహమున కర్తకువంశాభివృద్ధికలుగు ఇంకను అనేకములగు శ్రేయస్సుల కుత్తరోత్తరాభివృద్ధికలుగు దేవబ్రాహ్మణ సంతర్పణాదు లన్నిటికంటె పితృసంతర్పణమే యుత్కృష్ట ధర్మమనఁబడు ఆపితృదేవతలు కని పోషించి ఉపనయనాది సంస్కారములజేయుటచే పరమ ముఖ్యులు దేవబ్రాహ్మణసంతర్పణాదుల యందును అన్నిశుభకర్మలయందును పితృదేవతలు ప్రారంభమున బూజింపదగుదురు అది యెట్లన అగ్నిష్టోమము మొదలగు అన్నియజ్ఞములయందును నాందీముఖముచే ముందుగనే పితృదేవతలబూజించి పిమ్మట దేవతలను పూజింతురు వివాహము ఉపనయనము సీమంతము పుంసవనము మొదలగువానియందు నాందీముఖమును జేసిపిమ్మట నాయాదేవతల బ్రీతి నొందింతురు తీర్థయాత్రలయందాయాపుణ్యక్షేత్రముల బ్రవేశించి ముందుగ తీర్థశ్రాద్ధ ముజేసి పిమ్మట నాయాతీర్థముల నధిష్ఠించిన దేవతలనారాధింతురు ఇదియంతయును తలిదండ్రులుమొదలగువారికి పితృత్వముప్రాప్తించినపుడే సంభవించును అట్లుకానిచో నాతలిదండ్రులు మొదలగువారు నాందీముఖాదికర్మనుగూర్చి దేవతలుకానేరరు కాన పుత్రుడు మొదలగువారికే కర్మయందును అధికారములేకపోవుట సిద్ధించుచుండె ఆశౌచ నియమములతోగూడిన పుత్రుడు మొదలగువారిచే ప్రేతక్రియ జేయబడుటచే పితృత్వమును పొందిన మాతాపిత్రాదులు తమపుణ్యకర్మఫలములు పుత్రులుమొదలగువారిచే జేయఁబడిన దానము శ్రాద్ధము మొదలగువానివలన కలిగినఫలమును అనుభవించుచున్నవారై తమకు పరమోపకారులగు పుత్రాదులకు శాశ్వతములగు శ్రేయస్సుల బ్రార్థించుచుందురు లోక మునందుపకారముజేయని పుత్రులకుగూడ తలిదండ్రులెల్లప్పుడును శ్రేయస్సులగోరుచుం

దురుకదా మహోపకారులగు పుత్రాదులవిషయమున నికనేమి చెప్పవలయును కాన నాపితృదేవతల యాశీర్వాదములచే పుత్రాదులకు దీర్ఘాయుష్యము ఎల్లప్పుడు వారోగ్యము సూర్యచంద్రు లున్నంతవరకు వంశాభివృద్ధి ఉత్తరోత్తర శ్రేయోభివృద్ధియు కలుగును,

ఇట్లు శ్రీమత్సుబ్రహ్మణ్య సుధీవరునిచే రచింపబడిన అభినవషడశీతి

ఆశౌచధర్మశాస్త్ర గ్రంధము సమాప్తము.

